# విషయసూచిక










# సంస్కృతి



౧. నమో ! సద్గురుం సచ్చిదానంద రూపమ్ ,
నమో ! అద్భుతం అద్వితీయం అనూపమ్.

౨. నమో ! సత్యగమ్యం అఖండం అనంతమ్ ,
నమో [illegible] సద్గతిం సాక్షి భూతమ్.

3. నమో ! జ్ఞానమూర్తిం సదానంద సింధుమ్ ,
నమో ! దీనబంధుం దయాసార కందుమ్.

౪. నమో ! కేవలం కారణం కార్య రూపమ్ ,
నమో ! పావనం పాప సంహార దీపమ్.

౫. నమో ! భక్తరక్షం భవారణ్య భంజమ్ ,
నమో ! ముక్తిదాతా నమస్తే ! మహోజమ్.



ఓం

# పరిచయము

శ్రీ ధ. నారాయణాచార్యులుగారు

కం. శ్రీగురు మత గ్రంథంబును
శ్రీగురు కృపచే రచించి * శ్రేష్ఠతఁ జూపి ;
శ్రీగురు బోధామృతము తోఁ
శ్రీగురు పథ సేవజేయు * సిద్ధించనియెన్.

* * * * * * * *

గీ. భారతీయ తెలంగాణ * ప్రాంత భువన
గిరి నివాస ప్రఖ్యాత తం * గెళ్ల పల్లి
వంశ సంజాత భాగయా * ర్యాఖ్యు లింగ
మాంబజనితు ధర్మాచార్య * మహినివెలయు.



శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు

## సమర్పణము

శ్రీగురుమార్గస్థుల కాదర్శమూర్తియు, పూజ్యపాద పరమసంత్ యోగ యోగీశ్వరుడును, మత్పరమేష్ఠిగురుడు నైన; శ్రీ పోతులూరి వీరబ్రహ్మ సద్గురువరేణ్యు చరణారవిందములకు:— ఈ శ్రీగురుమత గ్రంథమును పూజా పుష్పముగ, హృదయపూర్వక భక్తితో సమర్పించుకొను చున్నాడను.

నివేదకుడు

# ప్రాక థ న ము

## శ్రీ డాక్టర్ జి. ఎల్. వర్ధన్‌గారు
(ఎడీటర్ దయాళ్)

ప్రపంచములో:— మానవత్వము నందలి జాతులన్నింటి యందును, మత మతాంతర వివాదములు సర్వసామాన్యముగ కలిగియే యున్నవి. ఇందులకు ప్రబల కారణమేమనగా:—ఋషి, మహర్షులు మఱియు సంత్, పరమ సంత్‌లయొక్క నిర్ధారిత మతధర్మ సిద్ధాంతము లమూల్యములయ్యు, అత్యద్భుత ఘన నీయములైనవిగా నున్ననేమాయె! అయ్యవి:— సూత్రప్రాయ ములుగా నుండియుండి అధికారి, లేక అర్హులగువారి కొరకు మాత్రమే! ప్రబోధోపదేశములుగ ప్రత్యేకింప బడియుండుట చేతను; మఱియు సూక్ష్మాతి సూక్ష్మనిగూఢ సిద్ధాంతము లయ్యుండి యుగ యుగాంత రములవరకు అచ్ఛిన్నముగనేగాక, చిరస్థాయి గనూ ఉంతవలయునను ఉద్దేశింపబడి యున్నట్టి వగుటవలననూ సామాన్యుల కలవిగాకున్నయవి. ఈ కారణ పరియవసాన ఫలిత ముగ మానవులు:— బహిర్ముఖ వాచకజ్ఞాన సంసిద్ధత నార్జించి భ్రాంతికోవిదులగుటయేగాక, పరస్పర ఈర్ష్యాసూయావేశ పర తాదర్శహీనులై కుతర్క వితర్క వాదములోనరించిరి. దీనివలన:— హఠపాషండ, తత్సంబంధ వాదులయొక్క ప్రత్యేక ప్రత్యేక సామాజిక మతములేర్పడెను. తదుపరి, ఈ పాక్షికదృక్పథులు తమ ప్రత్యేకతను సాధింపజూచి, పరస్పర పెనగులాటకు దల

పడి ఒకరినొకరు పరిహాసపఱచుకొనుచు, లజ్జితులుగ జేసికొన బ్రారంభించుట వలన:— సత్యప్రవృత్తి మఱియు, ఆదర్శము యొక్క వాస్తవ్యతాస్తిత్వము లతిసూక్ష్మరూపమున అలంకృత ములై గుప్తమగుట సంభవించెను. ఈ సంఘటనవలన:— అర్హు లగువారు, మాండలికపరిస్థితి కధీనులై యుండవలసినగతి దాపరించినది. మఱియు ఇందలి ఆచార్యులు స్వార్థపరత్వమున గురువేషధారులై, విభిన్న మతవాద ప్రచారము నొనర్చి, సత్య పథావలంబులను భ్రామికులగా జేయుటలో పెనగులాట సంభ వించుచు; ఇట్టి గురుశిష్యులగువారు పద భ్రష్టులగుటయేగాక అధోగతి పాలగుచున్నారలు. ఇదిటులుండగా:—

సత్యుగధ్యానేశ్వరులు, త్రేతాయుగమందు ఋషులు, ద్వాపరములో మహర్షులు, మరియు కలయుగమునందు ఆది సంత్, పరమసంత్, సంతులే! సద్గురు స్వరూపమున ప్రకటింప బడి; సారమత సిద్ధాంతమును సారరూపముననే యుపదేశించి అధికారి, లేక అర్హులను సంతృప్తినొందించుటయు సహజమై యున్నది. ఇట్టివీరలు:- ధర్మమును సంరక్షించి, జీవులనుద్ధరించి సంసారమునకు కళ్యాణము నొనగూర్చుచుందురగుటచే; జీవులు మేల్కొని కాల్ మఱియు మాయావాగుర బంధమునుండి విడి బడుచున్నారలు,

కలి యుగమునందు మానవులు:— సహజ జీవకోటిన చేరి యుండు చుండుట పరిపాటియగుటవలన, వారిఆత్మ అన్న మయకోశమునందే చిక్కుబడియుండును. కనుక, అప్పటికాల

చక్ర ప్రవాహమునందు దొరలువడి నిర్లక్ష్యులై యుందురు. ఇట్టివారి సంస్కరణ కీయుగమున సంత్‌మతము, లేక శ్రీ గురుమతము మాత్రమే! మహిమాన్వితమైనదేగాక, ముఖ్యమైనదిగా నుండుటచే బాహాటప్రచార మగుచుండును. ఇంతేగాక, సృష్టియందు:— పతితోద్ధారణయు, అధముల సంబాళనయు, పాపుల పరిత్రాణయు; దుఃఖితుల విముక్తికిని, ప్రబంధనిరీక్షణ సర్వత్ర గావింపబడుచునే యుండుచుండుట సహజ సంసిద్ధమైయున్న విషయము. మఱియు, కలికాలమునందు జీవులలో:— బుద్ధిచాతుర్యమినుమడించి, లేక శాణతన మతిశయించి, స్వార్థపరాయణమై విరోధించి యుండుచుండుటయు సహజము. ఏలయన: బుద్ధి తత్త్వము కాలుని, లేక కాలపురుష ముఖ్యతత్త్వమై యుండుటచే మాయాజనిత మనోవ్యామోహ భోగములందు విశేషముగ మానవులు చిక్కియుందురు. కాబట్టి, అవసర సమయమున, లేక ఈ లాటి దశలలో సంత్ సద్గురువులు ప్రకటింపబడి; జీవులను చైతన్యపరచి ప్రకాశమువైపునకు కొనిపోవుచుందురు.

పరమసంత్ కబీర్ కలయుగాదిసంత్ యై యుండిరి. వారి యుగమునం దేవిధానమువలన, సంత్‌మత నామిక శ్రీ గురుమత పరమపవిత్ర శిక్షణపునాదిని నిర్మించిరో! ఆ మూలబంధము కలికాలవైఖరి కనువైనదిగా నుండెను. వారు జీవులయెడ దయజూపి బీజరూపమున ఏదైతే శిక్షణయొసఁగిరో, అద్దాని యాధారముననే తర్వాతి సంత్ సత్పురుషులగువారు:— సంత్ మతాదర్శముడీలు వడకుండుటకై వారిని గూఢ రహస్యమును సమయానుకూల

ప్రయత్నము నొనర్చి ; జనులకు సవివరముగా ప్రబోధించి జాగృతి నొందించుచుండిరి. మఱియు:-

తొంబది సం॥ క్రిత మీపరంపరలోనే పరమసంత్, పూర్ణ ధని శివబరత్‌లాల్ గారు (ఎమ్. ఎ, ఎల్. ఎల్. డి) ఉత్తరఖండ మున సంత్‌మతాధార చివరవ్యక్తిగా ప్రకటింపబడి ; సంత్‌మత పునాది సిద్ధాంతసోపాన వ్యవస్థను నిర్మించిరి. మఱియు ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషలయందు దాదాపు మూడువేల గ్రంథ ములను సులభశైలిలో రచించి ; శిక్షణరహస్య భాండారమును సర్వసామాన్యులకున్నూ, తమతమ యర్హతల ననుసరించి తేట తెల్లముగ లభింపజేసిరి.

భువనగిరినివాసులగు దయాళ్‌స్వరూప్ సంత్ "తం. ధర్మా చార్యాజీ!" ఆంధ్రభాషయందలి మతగ్రంథములన్నింటిని పరి శోధించి చూడగా:-పరమార్థ సాధనాప్రయత్న మాగ్రంథములందు కలిగియున్నంథులకు సంతోషించిరిగాని అందలి సారాంశము ; సంకుచితభావ సంజన్యమైనదిగా నుండియుండుటచే వీరితరత్ర దృష్టిని సారించవలసిరాగా:- పరమార్థరహస్య సారతత్వవ్యాఖ్య పూర్ణముగ సులభశైలిలో, ఉత్తరఖండ జ్ఞానభాండారమునుండి లభించుటవలన సంతృప్తినొంది ; తమయొక్క నిజానుభవద్వారా మహర్షి మతరహస్యమును "శ్రీ గు రు మ త ము" అనుపేర గ్రంథ మును రచియించి:- దక్షిణ పశ్చిమాధికారుల (అర్హుల) సంతృప్తి కొఱకు మాత్రమేగాక, ఆంధ్రభాషాభాషీయ ధర్మాధికారులయెడ మన్నూ దయదలచి మహామహోపకారము నొనర్చియున్నారు.మఱి

సమర్థనీయ రచయిత:- జిజ్ఞాసువుల యవసరసంపూర్తికై గొప్ప సరళశైలిలో, అధ్యాత్మ సారాంశము వ్యక్తపడుట కీ గ్రంథము నందు పూర్ణత్వ ప్రబంధము నొనర్చియున్నారు. ఇంతేగాదు, ఈ గ్రంథరచనద్వారా వీరు:- ఉత్తర దక్షిణములందలి జ్ఞాన మఱియు భక్తిమార్గములను పరస్పర పరిచయపఱచి, యథార్థ మైన యా బ్రహ్మాండనాయక రామరాజ్య సంస్థాపన యొనర్చి యున్నారు.

కాబట్టి, ఈ ఆదర్శ పరిశ్రమవలన:- ఆసక్తిగల సత్యసం శోధకులు వీరికి చేయూతనిచ్చి; ఉన్నతోన్నత ఫలమునొందగల రని ఆశించుచున్నారము. సద్గురుడు సమస్తజనులకు కళ్యాణ మునొనగూర్చుగాక.

రాధాస్వామి



ప్రయత్నము నొనర్చి ; జనులకు సవివరముగా ప్రబోధించి జాగృతి నొందించుచుండిరి. మఱియు:-

తొంబది సం॥ క్రిత మీపరంపరలోనే పరమసంత్, పూర్ణ ధని శివబరత్‌లాల్ గారు (ఎమ్. ఎ, ఎల్. ఎల్. డి) ఉత్తరఖండ మున సంత్‌మతాధార చివరవ్యక్తిగా ప్రకటింపబడి ; సంత్‌మత పునాది సిద్ధాంతసోపాన వ్యవస్థను నిర్మించిరి. మఱియు ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషలయందు దాదాపు మూడువేల గ్రంథ ములను సులభశైలిలో రచించి ; శిక్షణరహస్య భాండారమును సర్వసామాన్యులకున్నూ, తమతమ యర్హతల ననుసరించి తేట తెల్లముగ లభింపజేసిరి.

భువనగిరినివాసులగు దయాళ్‌స్వరూప్ సంత్ "తం. ధర్మా చార్యాజీ!" ఆంధ్రభాషయందలి మతగ్రంథములన్నింటిని పరి శోధించి చూడగా:-పరమార్థ సాధనాప్రయత్న మార్గగ్రంథములందు కలిగియున్నంథులకు సంతోషించిరిగాని అందలి సారాంశము ; సంకుచితభావ సంజన్యమైనదిగా నుండియుండుటచే వీరితరత్ర దృష్టిని సారించవలసిరాగా:- పరమార్థరహస్య సారతత్వవ్యాఖ్య పూర్ణముగ సులభశైలిలో, ఉత్తరఖండ జ్ఞానభాండారమునుండి లభించుటవలన సంతృప్తినొంది ; తమయొక్క నిజానుభవద్వారా మహర్షి మతరహస్యమును "శ్రీ గు రు మ త ము" అనుపేర గ్రంథ మును రచియించి:- దక్షిణ పశ్చిమాధికారుల (అర్హుల) సంతృప్తి కొఱకు మాత్రమేగాక, ఆంధ్రభాషాభాషీయ ధర్మాధికారులయెడ నున్నూ దయదలచి మహామహోపకారము నొనర్చియున్నారు. మఱి

సమర్థనీయ రచయిత:- జిజ్ఞాసువుల యవసరసంపూర్తికై గొప్ప సరళశైలిలో , అధ్యాత్మ సారాంశము వ్యక్తపడుట కీ గ్రంథము నందు పూర్ణత్వ ప్రబంధము నొనర్చియున్నారు. ఇంతేగాదు, ఈ గ్రంథరచనద్వారా వీరు:- ఉత్తర దక్షిణములందలి జ్ఞాన మఱియు భక్తిమార్గములను పరస్పర పరిచయపఱచి , యథార్థమైన యా బ్రహ్మాండనాయక రామరాజ్య సంస్థాపన యొనర్చి యున్నారు.

కాబట్టి , ఈ ఆదర్శ పరిశ్రమవలన:- ఆసక్తిగల సత్యసంశోధకులు వీరికి చేయూతనిచ్చి ; ఉన్నతోన్నత ఫలమునొందగలరని ఆశించు చున్నారము. సద్గురుడు సమస్తజనులకు కళ్యాణమునొనగూర్చుగాక.

రాధాస్వామీ





# ప్రస్తావన

వందే గురూణాం చరణారవిందే,
సందర్శిత స్వాంత సుఖావబోధే ,
జనస్యయే జాంగలికాయ మానే,
సంసారహాలాహల మోహశాంత్యైః.

ఈ గ్రంథమునువెలువరించుటకు నాయొక్క విధ్యుక్త కర్తవ్యనిర్వాహణయందు తోడ్పడిన సద్గురు కరుణయే కారణమని ప్రప్రథమమున తెలుపుకొని:-శ్రీ శ్రీ శ్రీ పూజ్యపాదులగు పోతులూరి వీరగురు పారంపర్యములోని శ్రీ కనగాల వీరాచార్యులవారి శిష్యరత్నము , వివిధ జాతుల యందాధ్యాత్మిక సంతానముగల సుచరితయు, అజన్మ బ్రహ్మచారిణియు , నిరాడంబర ప్రవృత్తి గల హృదయయునగు మత్పరమగురు శ్రీ శ్రీ మునులపాటి వీర పిచ్చమాంబగారు:-౨౦. సం॥ల క్రితము , మా వీటి కఱుదెంచి "ఎన్నియో ప్రాంతముల దిరిగితిగాని నేటికి చిక్కితివిరా నా యొక్క నిజమైన కొడుకవు. నాయొక్క గురుస్థాన భారమును నీవే వహింపక తప్పదు" అని శాసించిరి. అందులకు నేనసమర్థుడనని తెలుపుకొనగా:- అస్మద్గురువరేణ్యుడును , ప్రేమహృదయు, శాంత సరళ స్వభావుడునగు శ్రీ అయిలా రామబ్రహ్మనందాచార్యుల వారిని పిలుపించి " వీడు నా మాటను వింటూలేడురా నాయనా ! నీవైనా చెప్పుము" అనెను. అందుకా పుణ్యమూర్తి:- "మనయొక్క ఆదర్శ స్వరూపియొక్క ఆదేశమునంగీకరింప వలయును" అనిరి. సరెననిః-" ఈ భారమున్నేను వహించుటకు ,

మీయొక్క ఆశీర్వాదబలమే ముఖ్యము” అని యంటిని. “దాని కేమియు కొఱతయుండదు గాన సంశయింప బనిలేదు” అనిరి. అప్పుడే వారిద్దరిని పూజించి అభయమును వడసితిని.

తదుపరి దృష్టాంతరముగా:- శ్రీ ఈశ్వరసం॥ వైశాఖ బ, ౧౦ గురువార దినమున (ఈ సాధ్వీమతల్లి పరమపథము జేరు విచిత్ర సంఘటన సందర్భమున) ఆ యమ్మగారి ప్రియ శిష్యుడు, నాయొక్క పరమ మిత్రుడును, వరంగల్ పట్టణ విశ్వబ్రాహ్మణ సంఘ సభాపతియు నైన, బ్రహ్మశ్రీ తొగిటి రామ బ్రహ్మచార్యులవారియొక్క పిలుపు రాగానే:- శ్రీ గురుమత ధర్మానుసారము నాయొక్క ప్రాణము తెగసి పోవుటయు, తిరిగి ఒక జామునకు స్మృతి కలుగుటయును అత్యద్భుతముగ సంభవించెను. ఇదిగాకను:-

మా పరమేష్టి గురుడగు శ్రీ శ్రీ శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు:- ఆగామి సంచితముల దెలయు బ్రహ్మజ్ఞాన శిఖరము నంది లోకమునకు భవిష్యద్వర్తమానముల నందించినటులను, అందులకు దృష్టాంతరములు గానబడుచున్నట్లును, భక్తులను తరింపజేయుచున్నటులయున్నూ, వీరభోగ వసంతరాయ నామమున ఆధునిక యవతార సత్పురుషుడనియు బ్రఖ్యాతి కలిగియున్న సంగతులు, అందరకును తెలిసియే యున్నవిగదా! ఏలనోగాని, ఈ సద్గురుని పారంపర్యమునందు స్వధర్మానుష్ఠాన పథనిరూపణము తేటగా గ్రంథస్థమై యున్నటుల గానబడక విచారాన్వేషణలో:-దాదాపు ౨౫ సం॥ల క్రితమీ శ్రీ శ్రీ శ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వాములవారి మఠమునకేగి యుంటిని. (అది శ్రీ

వెంకటేశ్వర స్వాములవారి ఆదిపత్యకాలము) నాకు పరిచయు లెవరును లేకుండుటచే, విభూతి యవసరమున శ్రీ వారి సమాధి వద్దజేర నాకది కనఁబడుటయు, అచ్చట యెవరును లేకుండుటయున్నూ సంభవించి అనుష్ఠానమునకై గూర్చుండః– శ్రీ వారి సమాధినుండి సునాదము వినబడి, అహర్నిశము నావెన్నంటియుండి నన్నుతికమక యొనర్చుచుండెను. అయ్యది ప్రణవనాదము, లేక సద్గురు వాణి యని అనుమానములనొటికి గుర్తెరుంగ గలిగినంతటితో ఆగిపోయి, సమయానుకూలముగా నన్ను మేలొక్కల్పుచు తోడ్పడుచుండి అనుభవములను గడింప జేయుచుండెను. మరియు, ఇదియే నన్ను సర్వమత గ్రంథముల బరిశోధింప కుతూహలుని గావించెను. కావున, శ్రీ సద్గురు వరేణ్యుని అపారకరుణామృతమువలన నాకులభించిన అనుభవములను బట్టిచూడగాః–అయ్యది " సంత్ మతము " లేక " శ్రీగురు మతముగ " సంభవించినందునను; మఱియా అహేతుక జాయమాన కరుణా కటాక్షుడగు దయాళుని అనుగ్రహము ననుసరించియు; అంతరిక ప్రేరణ లభించుట వలన నేనీ గ్రంథ రచన కియ్యకొంటిని. గానిః–గృహస్థాశ్రమ వ్యవహార జంజాటాటంకములచేత కాలాతీతమైనను, సర్వజనుల శ్రేయస్కరము నపేక్షించి దీనిని ప్రకటింపబూనితినని, నాయొక్క ఆత్మానుంగు సోదర సోదరీమణులకు నివేదించుకొనుచున్నాడను.

## వేదములు

ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు వేదములుః– హిందూమతముయొక్క పరమ పవిత్రాదర్శ ఉద్గ్రంథము

లయ్యు, స్వధర్మ గర్భిత స్వరూపములైయున్నను స్తబ్ధరూపమున యున్నవి. ఇయ్యవి పుష్ప ఫలశోభితము నొంది నప్పుడే జ్ఞానోత్తేజిత ములగును. మనము చారిత్ర్యికముగ పరిశోధింప నుంకింతుమేని ఇకార్యమును:-మహర్షివరేణ్య సాధితానుభవస్వరూప ఔపనిష ద్ప్రబోధమే! నిర్వహించి, ప్రకాశింపజేసినదని సమదర్శనకు గోచరింపక మానదు. వేదశబ్దము:- సంస్కృత "విద్" నుండి వెడలినది. దీని అర్థము:-విద్య లేక జ్ఞానమగును. ఇది ఆత్మిక ముగ ఆంతరికమున గడించవలసిన విద్యయగునేగాని బహిర్ముఖ చదువు కాదు. ఈ ప్రత్యేక ప్రవీణస్థితిని కలిగియుండుటచే నియ్యది సమస్త విద్యలకు ఉత్పత్తిస్థానమని తెలిసి గ్రహింప వలసియుండును. ఇందులకు దృష్టాంతముల చవిగొందము:-

ఆథర్వణవేద భా ౨౬, మం ౫౪ లో:- వేదములు కాల చక్రమునుండి వెలువడినవని కలదు. శతపథబ్రాహ్మణములో:- బ్రహ్మముయొక్క ముల్లోక భావనచే, వాయువగ్ని సూర్యులను ముువ్విధ ప్రకాశములుద్భవించెను. వీటి వలననే! ఋగ్యజు స్సామ వేదములేర్పడినవనికలదు. మనుస్మృతీ అ ౧, శ్లో 3 లో:- వేదములను స్వయం సంస్థాపితములను నిర్ణయము కలదు. బృహ దారణ్యకోపనిషత్తు బ్రా ౪. అ ౨, శ్లో ౧౦ లో:- నెమ్మిగల కట్టెనుండి మిణుగురులు పొగయు వెలువడునటులే, బ్రహ్మము యొక్క శ్వాసనుండి ఋగ్వాది వేదములు వెడలినవని కలదు. పురుష సూక్తములో:- వేదములు పురుషుని నుండి వెలువడినవి. చైతన్యము వలననే శబ్దము ప్రకటితమగును. పురుషు శబ్ద స్వరూపమని ఈ శాస్త్రముద్ఘోషించుచున్నది. పూర్వమీమాంసలో:-

వేదములు అవినాశి శబ్ద సంపుటియై సదా నిలచియుండునవేగాక నిత్యావి, గానము చేయువాని స్వాధీనమగునవికావు. వినబడిన వగుటచే శ్రుతులనబడినవనియు కలదు. ఇంతేగాక, శాస్త్రములు:- శబ్దమును ఆకాశముయొక్క గుణమనుచుండుటచే, ఇయ్యది ఆకాశమునకు ప్రాణమగుచున్నది. కాబట్టి, శబ్దమినాగా ఆకాశ ఉనికికవకాశమేలేదు. ఇందులకే! శబ్దమును:-వేదములు బ్రహ్మ మనుచున్నవి. మఱియు, సగుణ స్వరూపావలంబన పరికర ప్రణవనాదోంకార మగు దీని మూలముననే! నిర్గుణబ్రహ్మము, లేక పరబ్రహ్మము ప్రాప్యమగుననుచున్నవి.

వేదములలో:- నివృత్తి (జ్ఞాన) ప్రవృత్తి (సామాజిక) విభాగ ములు వెలసియుండుటచే, ఈ రెండున్నూ ఆత్మ మరియు దేహ సంయుక్త వివేకియగుమానవ జీవితమునకవసరములేనైయున్నవి మఱియు, ఋషిసత్తములీ వేదముల నాధారముగా గొనియే హిందూమతముయొక్క పునాదిని వేసియున్నారలు. హిందూజాతి సనాతనమునుండియు సామాజికధర్మము జేకొని, దీని తోడ్పాటున నే జీవించిదృఢముగ బలపడి, అందరికి మించి ప్రాణశక్తియుతమై తేజరిల్లి యున్నది. మరియు వేదమంత్రములు సర్వధర్మములకు పుట్టినిల్లైయుండుటచే, పరిశోధనా దృక్పథమునకిందు సమస్త సూచ నలు లభించుటవలన; వేదము లనాదినుండియు సత్సనాతన కామధేను జ్ఞాన భాండార స్వతః ప్రమాణములను పేరెన్నిక గన్నవి: ఇంతేగాదు; ఎవరే విద్యను సాధించి యార్జింప నుంకించి యీ కామధేనువను అద్దము ఎదట నిలచెదరో, వారికద్దాని యందవ్వారి భావనావైఖరిననుసరించిన పాఠమే లభించును.

కాబట్టి, వీనినుండి బయలుదేరి ప్రకటింపబడినట్టి ఉపనిషత్తులనునవి:- ఊహించుటకలవిగాని మహా వైభవోపేత భవనములుగానై యుండి, హిందూమత తత్వజ్ఞానమునకు మాత్రమేగాక, జగత్తు నందలి సర్వవిధ మతగ్రంథములకన్న పురాతన ప్రకాశితములై యున్నవి. ఈ యుపనిషత్తులలో గొన్ని అచ్చము వేద మంత్రములచే రూపొంది యున్నప్పటికిని, వీని జనన తేదీని నిర్ధారింప నెవ్వరు నుత్తీర్ణులు కాజాలలేదు. అయిన నియ్యవి బుద్ధ ధర్మమునకు పూర్వములై భారతవర్షమున ప్రచారమునొంది యున్నవనుట జగత్ప్రసిద్ధము.

షడ్దర్శనములు. అనగా:- ౧. న్యాయ. ౨. వైశేషిక. 3. యోగ. ౪. ఉత్తరమీమాంస. ౫. పూర్వమీమాంస. ౬. సాంఖ్యములీ యౌపనిషత్తుల ఆధారముననే రూపొంది సంపూర్తి గావింపబడినవి. ఇయ్యవి మాత్రము బుద్ధధర్మమున కిటీవలి వన వచ్చును. ఏలయనగా:-బుద్ధ ధర్మము నియ్యవి ఖండన ముండన గావింప యత్నించినవి. అయినను, సాంప్రదాయాభిమానమునకు లోనై పరీక్షింపకుండా నుండగలుగుచో, ఇయ్యవి గమ్యస్థానమునకు దారిజూపఁ గలవనుటలో నిసుమంతేని సందియములేదు. ఇందలి ఉత్తరమీమాంసయను వైభవోపేత వేదాంత సిద్ధాంతమనుదాని పునాది ఉపనిషత్తులందు కలిగియున్నను, ఉన్నత స్థాయిలో అనగా:- ఆత్మ స్వాతంత్ర్యమును గఱపగల హృదయ రంజిత రాగాలాపనలో గలదు. ఈ యుపనిషద్గర్భిత గాంభీర్య జ్ఞాన రహస్యమును కనిపట్టగలుగుచో నిందులో:- శరీర ధారియగు తానొకడు కలిగియుండగా, ఏకత్వ (అద్వైత) వాదమున కొడిగట్టి

జగన్మిథ్యాలాపన కవకాశముండకుండెడిదే యని తోచకమానదు. ఇదీ వైఖరి నవలంబించుట వలననే! ఈ సిద్ధాంతమునందు:- అనుష్ఠాన పథము లోభించి మాయావాదులు, భ్రమవాదులు, పరిణామవాదులు, బహురతవాదులను శాఖోప శాఖలు బయలు దేరి అనిర్వచనీయ ఖ్యాతి, లేక వచింపనలవిగాని శక్తి ఆశ్రయము గొనవలసివచ్చినది.

ఈ వేదాంతమున అద్వైత సిద్ధాంతము బయలుదేరగా రెంటితనముగల ద్వైత, లేక సాంఖ్య సిద్ధాంతమున్నూ తలెత్తినది. ఇటుల సాగిపోవు టీద్వంద్వ జగత్తున పరిపాటయ్యున్నను; సాంఖ్యసిద్ధాంత కర్తయనబడు శ్రీ కపిల ఋషి శిష్యుడైన మహా యోగి పతంజలి:-ఈశ్వరుని విశేష పురుషుడని సంశయాస్పదుల సంతృప్తికి కారణుడయ్యెను శిష్యుడు గురుని సిద్ధాంతమును రద్దు పరచజాలడుగదా! అయితే, ఒకటియంటే రెండనుటలో రహస్యమేమియు నుండి లేదనుట నిస్సంశయము. దీనిని బట్టి చూడ:-చార్వాకుడున్నూ నాస్తికుడనదగడు. ఏలయనగా:-అతడు; ఏ యాధారమున ప్రభవించి యుండెనని తెలియజాలకున్న నేమాయె! భౌతికపదార్థ ఉనికినైతే అంగీకరించునుకాదా? ఎవ డైన నొక ఉనికినంగీకరించినపుడు నాస్తికుడవబడ జాలడనుటలో వింతయుండనేరదు. ఈ చిత్ర వైచిత్ర్య విధాన వైఖరులుద్భవిల్లి అవలంబింప బడుచుండుటవలననే కాబోలును, శ్రీమనూ భగవానుడు "నాస్తికోవేదనిందకః" అని యుద్బోధించెను.

వేద శ్రుతి యనగా:-మహర్షులు తమ ఘటములందు వినినట్టి అనాహతనాదము, లేక దైవవాణి, తదుపరివారి ధ్వని

యగు మృదుమాధుర్య స్వరమును, అమృతార్థ ఛందస్సుగా మంత్రముల రూపానర్చిరి. అయ్యాది ఛందోబద్ధ ప్రకటనతో స్మృతి యని పేరొంది ; పండితంమన్యుల చే జిక్కి స్వభావార్థమునకు లోనై నానావిధ స్వరూపములదాల్చెను. ఈ వేద మంత్రములే . బ్రాహ్మణ గ్రంథములుగానై, ఔపనిషత్తుల రూ పొం దె ను! తర్వాత సంహిత, బ్రాహ్మణ, ఉపనిషద్భాగములుగానై త్రైవేద మను నామకరణము నొందెను. కాని; ఈ వేదములు:- ఒకేజాతి యొక్క పిత్రార్జితము (మిరాస) గానై సర్వజనుల కందుబాటులో నుండి లేకుండుట విచారకర విషయము. చూడుడు:- యజు ర్వేద, అ ౨౬- ఖం ౨- మం ౧.

యథేమాంవ్వాచంకల్యాణీ మావదాని జనైభ్యామ్ । బ్రహ్మ
రాజన్యాభ్యాం శూద్రాయచార్యాయచ స్వాయచార్ణాయచ॥

తా. పరమేశ్వరాదేశములగు ; స్వయం సంసిద్ధ పరిపూర్ణములగు వేదములను:- లౌకికుల శ్రేయస్కరము మఱియు పరమార్థుల కానంద దాయకమునేగాక, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, స్త్రీ మఱియు సేవకాది సర్వమానవహితార్థము, కళ్యాణకారిగా ప్రకాశింప బ్రకటింపబడ జేసియున్నాను. ఇదే విధముగ వినియోగ పడవలయును.

ఇదిటుల కలిగియుండగా:-స్వార్థపరత బహిర్ముఖ చర్యల వలన సంస్కార రూపొంద సమకట్టి. శ్రుతికి పెడార్థ . ప్రచా రము గావించువారు దేలుటచే పరమ సంత్ మహర్షి శివబరత్లాల్ వర్మ జీ. ఎమ్, ఏ. ఎల్, ఎల్, డి. గా రుల్లేఖించి ప్రకటించిన దేమనగా:- ఓ బ్రాహ్మణులారా! ఇంతవరకు జరిగిందేమో జరి గిందిగాని, ఇకనైన సత్యమును గుర్తెరుంగదలంచుడు? మఱియు

నిజమునకవకాశమిచ్చి సక్రమ పోకడ నవలంబింప నొడంబడుటే గాక, విశాల హృదయులై కుయుక్తి నటుంచి సద్విద్యను ప్రకాశ పఱచబూని హిందూజాతి నకాలమృత్యు వా తా వ ర ణ ము నుండి తప్పించి ఉద్ధరింపుడు.

## మం త్ర ము

అస్యమహతో భూతస్య నిశ్వసితమే
తద్ధృగ్వేదాది ఇతి. (బృహ, ఉ. ౨-౪-౧౦)

అనగా:- "పరమేశ్వరునియొక్క నిశ్వసితమే ఈ ఋగ్వేదాది మహచ్ఛాస్త్రము." ఇట్లనగా:- ఋగ్వేదాదులు అవ్యాకృత పరబ్రహ్మమువల్ల నుండి, పురుషుని నిశ్వాసముభంగి అప్రయత్న ముగా నుద్గతమైనవి. ఈ వేదఋక్కులలో:- అప్పుడు ఆకాశాది పంచభూతముగాని, మృ త్యు వు ను, మృత్యురాహిత్యమున్నూ లేదను సంస్కృత భాషోచ్చారణ గానమాధురీగరిమ జూపబడి యు న్న ది. అనగా:- భగవదస్తిత్వ మంతర్భూతమై యుండినట్టి ప్రాణమనునది మాత్రమే నుండియుండెను. అయ్యది నిశ్చలమై యుండెను. ఈ భావమే తర్వాత విశ్వసృష్టి వర్ణనలో యెట్లు పొడ చూపునో, హిందూమత శాస్త్రములలోన మనకు విశదమగుచున్న దేమనగా:- వేదఋక్కులో వర్ణింపబడినట్టి ప్రాణము ఒకటియే! ప్రశాంతమయ్యు స్వయంపోషకమై, చలనరహితమై మఱియు కంపనారహితమై యుండెను. సృష్టి కి ప్రారంభమునందది ప్రకం పింప దొడగెను. ఈ ప్రకంపనాఫలితమేనీ ప్రాపంచికమంతయును. ఇట్లని మహర్షులు జ్ఞానద్వారమున తమ హృదయములను పరిశో

ఉంచి సత్తునకును , అసత్తునకును గల అనుబంధమును కనుంగొనిరి. చూడుడు:-

౧. ఏకంసత్ విప్రాబహుదావదంతి. (ఋగ్వేదము. ౧-౧౬౪-౪౬)
౨. సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్. (చాందోగ్యోపనిషత్తు ౬-౨-౧)
3. ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ , నాన్యత్కించ నమిషత్. (ఐతరేయోపనిషత్తు ౧-౧-౧)

తా. ౧. ఏకమగు సత్పదార్థమును అనుభవజ్ఞులు నానావిధముల పేర్కొనియున్నారలు. ౨. ఈ జగదుత్పత్తికంటెపూర్వము , సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై కేవలాద్వితీయాఖండైకరస సద్వస్తువు మాత్రమే యున్నది. 3. పరమాత్మ ఒక్కటిమాత్రమే ! ఈ ప్రపంచ సృష్టికిపూర్వమున్నది. ఆ పరమాత్మవ్యతిరిక్తమైనవస్త్వంతర మెద్దియును లేదు.

కాబట్టి , ఈ సృష్టికి పూర్వము బ్రహ్మచైతన్యము:- విశుద్ధ సత్వగుణ ప్రధానమాయయందు ప్రతిబింబించిన దగుచు ఈశ్వరుడనియు , మాయాశబలబ్రహ్మ శుద్ధ బ్రహ్మమనియు బేర్కొనబడుచున్నది. ఇదియే ! శక్తిప్రపూర్ణ జగత్స్రష్టయై యున్నది. మఱిదియే తమోగుణప్రధానమూల ప్రకృతియందు ప్రతిబింబించి జగత్తున కుపాదాన కారణమునగుచున్నది. గనుక ; దేనితత్వము దెలిసిన సమస్తమున్నూ తెలియబడునో ! యా సమష్టితత్వమును పరిశీలించుటలో యుపయోగపడు:-నామ ,రూప , ఘన , ద్రవ మొదలగు పదార్థములాకాశమనుతత్వముయొక్క వివిధ పరిణామ స్వరూపములేయని అనుభవజ్ఞ సిద్ధాంతము. ఇంతేగాదు:-ఆకర్షణ మఱియు భావము , లేక ప్రాణముతోగూడియున్న ఈ విశ్వశక్తి:-

ఆకాశము నందిమిడియుండి, అనంతరము చైతన్యమేర్పడి యాద్వివిధతత్వ సమ్మేళనమువలన యీ సమస్త ప్రపంచముద్భ వించి, తిరిగి ప్రళయ కాలయమున యందే! అనగా:- ఘనద్రవ మొదలగునవి ఆకాశముయందు, మఱియు ఆకర్షణ విద్వేషణ మొదలగునవి ప్రాణముయందును లయము గాంచుననియు, సమిష్టి తత్వమగు ఏకత్వ నిర్ణయమునకై యాకాశ మఱియు శక్తి తత్వముల నన్వేషించి మహత్తు, లేక విశ్వమానసమను ప్రధాన కారణమును వారు కనుగొనిరి. ఈ విశ్వమనస్సను భావనా శక్తియే! ఈ సమస్తమును కలిగించుచున్నదని తేల్చి, ఈ భావనా శక్తి కాధారముగనున్న తత్వమునే! పరమాత్మ, లేక భగవంతు డని నిర్ణయించిరి.

ఇకారణముల ననుసరించి చూడగా:-అహంస్మృతి వలన వ్యష్టిగా వ్యక్తమై యున్నట్టి మానవుని దేహమునకు మనస్సును, మనస్సున కాత్మయు పారంపర కారణభూతము లగుచున్నవి. గనుక ప్రకృతీ ప్రాభవమునందు న్యూనతకు తావులేదనియు, స్వార్థ సంకుచిత ప్రత్యేక భావమువలన యేర్పడునట్టి అహంకా రము వలననే! అయ్యాధి సంభవించి భ్రమకు కారణమగుచున్న దనియు దెల్యవలసియుండును. మఱియు పిండమనునది మానవ జీవియొక్క ఆధారమున యుండి, జీవి పిండమున కధిష్టాతయై యున్నట్లే! పెద్దదగు బ్రహ్మాండమున కధిపతి, స్వామి, ధని మఱియు అధిష్టాతను బ్రహ్మము, లేక పరమాత్మ డందురు. ఎటులైతే, ఇంద్రియావయవములతో వెరసి ఏకరూపుతో మానవుని శరీరము కలదో! ఎటులైతే, కిరణముల కూడిక రూపము

సూర్యుడో! మఱెటులైతే, బిందువుల కలయిక స్వరూపమునే సముద్రమందురో! అటులే సూర్య చంద్రాది దివ్యశక్తిగోళము లొకదానితో నొకటాకర్షింపబడుటతో, ఏకముఖముగ బ్రహ్మాండము వెలసియున్నది. మఱియు చరాచర సంపుటియగు ప్రపంచ మనబడు బ్రహ్మాండమునందలి జీవులకలయిక రూపమే ఈశ్వరు డనజెల్లుటచే, ఆత్మ మనశ్శరీర కూడికయగు పిండము బ్రహ్మాం డాంశము, ఛాయ, లేక ఏకలేగనుక బిందుత్వ పరిస్థితినెఱుంగ గలిగినచో సింధుత్వము బోధపడునటుల; పిండము బరిశోధించు చో బ్రహ్మాండ పరిస్థితియు దెలసి రాగలదు. ఇందుచే, బ్రహ్మాం డాత్మయొక్క మనశ్శరీర కూడికను ఈశ్వరుడుగా. తమ అంత రికమునం దుపాసించువారిని సగుణోపాసకు లందురు. మఱద్దాని ఆత్మను మాత్రమే లక్ష్యమునందుంచి, అదన్నిటికిని కారణమని భావించి ధ్యాననిమగ్నులగు వారిని నిర్గుణోపాసకులందురు.

ఇదిగో గమనింపుడు; యజుర్వేద అ ౪౦, మం ౮, యందు:— ఈశ్వరుడు సర్వవ్యాపి, పవిత్రుడు, అకాయుడునై యున్నాడు. మఱియు అథర్వ, వే. కాం ౧౧, ప్ర ౨౪, అ ౨, మం ౨౭ లో:— ఈశ్వరుని వలన దేవతలు, గంధర్వ, మను ష్యాదు లుత్పత్తి యయ్యెను. మఱియు యజుర్వేద ౨౧ అధ్యాయ ములో:— ఇదే ఈశ్వర తత్త్వము విరాటుగానై యద్దాని వలన ఆది పురుష ప్రకటింపబడి, బుద్ధి ప్రతాపముచేత శ్రేష్ఠుడన బడియెననియు గలదు. కాబట్టి:— ఈశ్వరతత్త్వమునమభవమున గడింపజేయు విధి విధాన స్వరూపమే మతమనబడుచున్నది. ఇయ్యది, భావవృక్షథము నను సరించిన అనుష్ఠాన పథ నిరూపణ

యగును. మఱిది మనస్సున్నంత వరకే ఉచ్చరింపబడునదియు, శ్రద్ధతో విశ్వసించునదియు నైయున్నది. మతమను దీనిని మానవుడు:–ప్రకృతియొక్క అపారశక్తి సంపదను గాంచి విచిత్రపడి, అందలి ఉన్నతోన్నతమైన శక్తి నారాధించుటతో నంతర్గతమున ప్రవేశింప నుంకించి, స్థూల మూలమున సూక్ష్మకారణముల వరకేగి, తనయందుగల శక్తి స్థోమతుల నెఱుంగుటతో బ్రారంభించి దీనిని నేటిస్థితికి దెచ్చి, తనయొక్క నిజరూపమున శాంత్యానందములగని కృత కృత్యుడయ్యెను.

౧. మరీచి. ౨. అత్రి. 3. అంగీరస. ౪. పౌలస్త్య. ౫. పులహ. ౬. క్రతు 3. వశిష్ఠ యను సప్త ఋషులకు సప్త మత వైఖరులు పూర్వముండియున్నను, వారలు సత్యమార్గము నెఱింగి యున్నవారగుటచే, వారిలో పాక్షిక పాషండ తనమునకు తావు లేకుండెను. గనుక, తమ శిష్యుల కాత్మ స్వాతంత్ర్యము గఅపుటలో వారివారి అర్హతానుగుణ్యముగ విశాల హృదయులై వ్యవహరించుచుండిరి, ( ఋషివరేభ్యో త గ ర తి క్రమము:– ౧. శ్రవదృషి. ౨ కాందఋషి. 3. పరమఋషి. ౪. మహర్షి. ౫. రాజర్షి. ౬. బ్రహ్మర్షి. ౭. దేవర్షి ) ఇందువలననే ! హిందువులలోనివాడే శాఖా సాంప్రదాయియై యున్నను ; పరమార్థ సాధనయెడ ప్రతి వ్యక్తికిని సర్వ సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగి యున్నది. అయినను, సామాజిక కట్టుదిట్టములయెడ మాత్రము ఋష్యాదులు చేయిజేసికొని యుండలేదగుటచే ప్రతి వ్యక్తియు ఇందుకధీనుడై బద్ధుడై యుండక తప్పలేదు కాని, ఇతరులవలె మతమునకే దాసుడై మాత్రముండి యుండుట లేదు. ఈ కారణ

ఘనవే హిందూమతము, పరిశోధనయందు దినదినాభి వృద్ధి నొందుచూ వచ్చినది. దీనియందలి వేదాంత సిద్ధాంతమనునది, ఎల్లెడల పరివ్యాప్తమై వెలసియున్నట్టి సూత్రము. సాంఖ్య సిద్ధాంత కర్తయనబడు కపిలఋషియే దీనికి పునాదినివేసి యుండినటు లను; బాదరాయణుడద్దానిని వైభవోపేతభవనముగా నొనరించె ననియును ఔపనిషచ్చరిత్రవలన తెలియుచున్నది. ఐ న నూ! ఇయ్యదించుక కొరత గలిగి యున్నదేమనగా:-

ఇందలి "బ్రహ్మం" మఱియు "ఆత్మయను శబ్దములు, అర్థ దృష్టి లేకుండా యధా తథముగ వాడుకలో సాగిపోవు చున్నవి. మహర్షులు, ఏ కారణముననుసరించి యీ శబ్దముల న్నిర్మించి నిర్ణయించి ప్రయోగించి యుండిరో! తదనుయాయులు గుర్తెరుగజాలకుండుట శోచనీయ విషయము. చూడుడు:- బ్రహ్మ మను శబ్దము సంస్కృత ధాతువగు, బ్ర:-పెరుగుట; లేక అభివృద్ధినొందుట. మఱియు మ:-మనన, లేక చింతన యగును. ఇక ఆత్మయన సంస్కృతధాతువగు అత్:- చలించుట, లేక చైతన్యము మఱియు మ:- మనన లేక చింతనయగును. అనగా:- అభివృద్ధి నొం దు చు యోచించుట, లేక చింతన గావించు లక్షణము గలిగియున్నదే బ్ర హ్మ మ న బ డు ను. మఱియు చలించుచు వివేచన గావించునదే ఆత్మయనబడు నగుటచే, ఈ దృక్పథముల ననుసరించియే ఋషులు:- క ర్మ మా ర్గ సాంఘిక కట్టుబాట్లనే గాక వేదములనున్నూ "అపరావిద్య" యనుటను ఉపనిషత్తులు సూచించుచున్నయవి. మఱియునింతకు శ్రేష్ఠమైన విద్య, లేక ప రా వి ద్య యనబడునదియు గలదు.

అయ్యది మననతో చైతన్యజ్ఞానమునకు సంబంధించినట్టిదగుటచే, అనుష్ఠాన పథానుభవమున పొందబడునది. ఉపనిషత్తుల సంజ్ఞ యీపరావిద్యవై పేగలదు. పరావిద్యయనగా:-అంతరికరహస్యము. ఇయ్యది హృదయవిద్య కనుక గురు శిష్య సాంప్రదాయము ననుసరించి, ప్రాచీనకాలమునుండియు అంతరాన్వితముగా అనుభవమున గడించుచుండిరి. మఱియు దీనికి, ఆరణ్యక విద్య యని పేరిడిరి. దీని పునాది వేదములందే కలదు. కాబట్టి ఆత్మ మఱియు దేహ కలయికగా వ్యక్తమైయున్న వివేకియగు మానవునికొరకు అపర, పరయను రెండు దారులేర్పడియున్నవి. ఇందొకటి కర్మమార్గము. రెండవది జ్ఞానమార్గము. ఉపనిషత్తులలో వీనినే! పితృయాన మ ఱి యు దేవయానములుగా పేర్కొని యున్నారు. ఇటులే! బౌద్ధమతముయందున్నూ హనాయాన్, లేక హినాయాన్ (చిన్నదారి) మహాయాన్ (పెద్దదారి) (యాన మనగా:-స్వారి) అ ను న ట్టి నామములతో ప్రయోగింపబడినవి. దీనిని బట్టిచూడ బౌద్ధము హిందూమతములోని శాఖయేనైయున్నది.

ఇందలి ప్రవః, లేక పితృయానమను కర్మమార్గముచే, జనన మరణావస్థయను గొలుసు యెడతెంపులేక పా ర ం ప ర గా సాగి పోవుచునే యుండును. మనన, లేక దేవయానమను జ్ఞాన మార్గావలంబనమువలన అది విచ్ఛిన్నమవగలదు. ఔపనిషత్తులలో నిది యంతయు సూచింపబడియున్నను, మరియు అనుష్ఠాన పథమునకులొంగని విద్య రెండుగవ్వల కొరగాకున్నను క ర్మ మార్గమే! బలపరచబడినది. చూడుడు, చిన్నదగు ఈశోపనిషత్ ఏమని ప్రబోధించుచున్నదియో:- "సత్కర్మవలన మృత్యువును జయింపుము. మఱి జ్ఞానముచే అమరపథము నార్జింపుము."

పరమాత్మయు బోధపడగలదని ప్రబోధింపబడియున్నది. కాబట్టి, ఇచ్చట సత్యభావ వివరముల నీదిగువన గమనింతము.

ఇందొకటవ భావము:–అభివృద్ధినొందుచు మనన గావించునది బ్రహ్మమ్ అనబడును. మఱియు చైతన్యముతో వివేచన గావించునది ఆత్మయనబడును వీనిలో చైతన్యము మఱియు వృద్ధి నొందుటలు ఏకార్థమును సూచించుచున్నవి. చింతన రెంటిలోననూ కలదగుటచే బ్రహ్మమనునదేఆత్మ, మఱియు ఆత్మయనునదే బ్రహ్మమగుచున్నది.

రెండవభావము:–దేనియందైతే వివేచనతో గూడి యభివృద్ధి నొందుట; మఱియు చైతన్య, వివేచనలను రెంటితనము కలిగియుండునో! అదియే బ్రహ్మ మరియు ఆత్మయునగును. కాబట్టి ఈ శబ్దప్రయోగము; తారతమ్యము నెఱుంగజాలుటకు మాత్రము ఉపయోగపడుచున్నదే గాని:– ఏదైతే సర్వముయందు గలదో! అదియే, భాగమునందున్నూ కలిగియుండునగుటచే, బ్రహ్మండ మంతట యిమిడి వెలసియున్నట్టిదే బ్రహ్మమనియు! పిండాండ (శరీర) మంతట యిమిడి వెలసియున్నట్టిది ఆత్మయనియు పేర్కొనబడుచున్నది. ఇందుచే పిండ మఱియు బ్రహ్మండ భావనను తుడిచి, లేక తొలగజేయుచో బ్రహ్మమే ఆత్మ, ఆత్మయే బ్రహ్మమగును.

మూడవభావము:–ఏదైతే చలన, గమన, వివేచన మాత్రమేగాక; చలన వివేచనలలో కలిగియుండియు వీనిని క్రమ పద్ధతిగ నడుపునో! మఱియు చలన వివేచన లనునవి

దేని విశేషణములో అదియే ఆత్మయగును. ఈ దృక్పథము, ననుసరించి ఏదైతే బ్రహ్మమో అదియే ఆత్మయగును గనుక. నిజముగా పరికించుచో ఆత్మ మఱియు బ్రహ్మ మనునవి:- పిండ బ్రహ్మాండ దృష్టితో ఆధారాశ్రయములు మాత్రమేనని తోచగలదు

నాల్గవ భావము:- బ్రహః, మనన; లేక అత్, మననలు అనునవి తత్సంబంధ శబ్దములేయగును. మఱియు నియ్యవి; సూర్యుడేకస్థాయియై యుండియు తనయొక్క కిరణముల ప్రకాశ ప్రసారమువలన సర్వస్థాయియై యున్నట్లే! ఈ బ్రహ్మ మఱియు ఆత్మలనునవి; బ్రహ్మాండ పిండాంతములయం దేకస్థానియు సర్వ స్థానియునైయున్నవి. కావున, ఎచ్చటనైతే సంబంధము కలిగి యుండునో! అచ్చట సంబంధ సంభాషణమే యవసరమగును. ఒకవేళ సంబంధమే లేకున్నచో స్థిరస్థాయి గాకలిగియున్న దెద్దియో అదియే నిలచియుండగలదుగదా! ఈ పరిశోధనము ననుసరించి బ్రహ్మ మఱియు ఆత్మయనునవి పరివర్తిత పరిణామ స్వరూపము లేనై వీటి వెనుక, లేక వీనికాధారముగ పరమ పవిత్రామృత సత్పదార్థము డాగియున్నది. అదియే! సర్వసారామృత స్వరూప సత్పథము. మిగతవన్నియు తచ్ఛాయా స్వరూపములు మాత్రమే నై యున్నవి.

ఇంక ఐదవ భావమేమనగా:- ఏదైతే మనచుట్టుముట్టు పుష్కలముగా పరివ్యాప్తమై స్థూల సూక్ష్మములుగ గోచరమగు చున్నదియో! అదియే మాయ యనబడును. ఉపనిషద్బోధ మున యిద్దియొక్క పునాదికలదుగాని విశదముగ, లేక స్పష్ట ముగలేదు. సంస్కృత ధాతువగు యిందలిమా:- కొలచు. యః-

యంత్రము, లేక పనిముట్టు అగును. అనగా:– కొలచుట, ఊహించుట, పరిమాణము నేర్పరచుట, మరియు విచారణ గావించుటకై ఉపకరించబడి పరికరమే, లేక మనయొక్క స్వభావ సంజనితమై యున్నట్టి తెలివియే! మాయయగును. ఇయ్యది:– సముద్రమునందు అలలనునవి అవతరించుటవలె, ఆగంతుక దేశకాల నిమిత్తములచే యేర్పడు నామరూప సంజనితము. మఱియ్యది బ్రహ్మము, లేక ఆత్మయుగాదు. వీనికి భిన్నముగనూ లేదు. "అన్యోతరాత్మనో" దీనినాత్మకు భిన్నముగ తెలయు, లేక భావించువాడే దారితప్పినవాడు. ఒకవేళ ఆత్మను మాయాధీనమనుకొనుచో:– ఈశ్వర, వేద, శాస్త్ర మఱియు విద్యా జ్ఞానములన్నియు దూషితములేయగునని తెలియవలసియుండును.

మహర్షివరేణ్యు లింతటితో తమ ప్రబోధము నందాగి పోలేదు. చూడుడు:– బ్రహ్మమను శబ్దము నుపయోగించు సందర్భమున పరబ్రహ్మమనియు; ఆత్మ యనుటతో పరమాత్మ యనియు; ఈశ్వరుడనుటతో పరమేశ్వరుడనియున్నూ ప్రయోగించియున్నారలు. కాబట్టి, మనయొక్క శరీరమునకేగాక కాళ్లు, చేతులు, వ్రేళ్లకున్నూ మూడేసి భాగములు కలిగి యున్నట్లే! ఈ జగత్సృష్టికిన్నీ:–దివ్యము (కారణ) అంతరిక్షము (సూక్ష్మ) పాతాళము (స్థూల) అను విభాగము కలదు. మఱియు వీటి కాధారభూతమగు సత్పథమున్నూ కలదు. ఇంతేగాదు, పిండాండ స్వరూపుతో ప్రకటింపబడి ఆత్మలమని పేర్కొనబడుచున్న మన దృష్టితో చూడగా:– మనకు మనశ్శరీరాత్మలు కలిగియున్నట్లే! బ్రహ్మాండమున పరివ్యాప్తమై వెలసియున్నట్టి బ్రహ్మమ్:–జాగ్రత్,

లేక స్థూలమున విరాట్ (ఈశ్వర్) స్వప్న, లేక సూక్ష్మమున అవ్యాకృత్ (ఓంకారము, లేక సగుణబ్రహ్మమ్) సుషుప్తి, లేక కారణమున హిరణ్యగర్భ (నిర్గుణబ్రహ్మమ్, లేక పరబ్రహ్మము) అని పేర్కొనబడి యున్నదనియు; ఈ అర్థదృష్టి ననుసరించుచో బ్రహ్మాండమున మనస్సనునది, బ్రహ్మమే యగుననియు దెల్యవలయును. ఇంతేగాక:-

సత్‌యొక్క విశేషణమనదగు ప్రకృతియొక్క తేజోకిరణ ధారాప్రవాహము, పైనుండి దిగుచు లేక పరివ్యాప్త మగుచు సర్వవిధలోక లోకాంతర మండల సమస్తభూత, జీవ, పదార్థ సృష్టి యేర్పడుచూవచ్చి చివరకు మానవరూపము దాల్చి తిరుగబడినది. ఎటులనగా:-తేజోకిరణము ఎల్లప్పుడు వలయాకారముగనే ప్రవహించునదగుటచే, సూర్యచంద్ర నక్షత్రాది గ్రహణ మండలములన్నియు సమాంతర చతుర్భుజాకారము, అనగా:- గోళాకారముగ ప్రభవించియున్నవి. కావున మానవునియందు:- పైసృష్టియందలి సమస్త పరిస్థితస్పర్శలు, శక్తులున్నూ సూక్ష్మబీజ స్వరూపమున వెలసి కలిగియేయున్నవి. ఇక్కారణముచేతనే! సర్వజీవులలోన మానవుడుత్కృష్టుడై యుండుటేగాక క్రిందు మీదు (ఉల్టా) వృక్షముగా ప్రభవించియున్నాడు. ఎటులైతే నీటి సరస్సు తీరమున (అంచున) గల చెట్టు నీటిలోననూ, ఛాయా స్వరూపమున కనబడుచు రెంటివేరులు కలిసియుండుటను చూపట్టి మనకు విస్మయ (ఆశ్చర్యకర) దృశ్యము గోచరమగునో! అటులే, మానవ వృక్షముయొక్క వేరులు పైభాగమునను; మఱియు కొమ్మలాకులుపూలేగాక విత్తన ఫలములనున్నూ క్రిందిభాగముననే కలిగింపనేర్పడి, తలలో ప్రాణము

కలిగియుండి తలంపుతో సర్వావయవముల నాడించుచు, ఏక స్థానియు సర్వస్థానియునైయున్నది. ఈ జీవి మరణావస్థలో తన యథాస్థానమగు భ్రూమధ్యమును చేరునప్పుడు తొలుత:- కాళ్లు చేతులు చల్లబడి, నాభిపెకలి, హృదయుమాగి, తలంపులావరించి, కనులు మూతబడుటను చూచియే యుందురుగదా! కాబట్టి మానవునియందు సర్వశక్తులును తలలోనే కలిగియున్నవి. చూడుడు:- మేధస్సు తలలోనే కలదగుటచే యోచించునపుడు, ప్రాణము సహజముగనే తలవైపుచేర విషయపరిజ్ఞానము కలుగును. మఱియు బలమైన గాయము సంభవించినపుడు ప్రాణము పైకెగసి స్మృతి తప్పుటను గాంచుచునే యున్నారము. ఇందుచే:-

ఏ మార్గమునంటి జీవులీలోకమునకు రాబడిరో, అనగా:- చైతన్యమువలన యేర్పడిన శబ్దతంతిద్వారా సుషుమ్న నాడి మూలమున ఏతెంచిరో! ఆదారిగుండా తిరిగి యరిగిననే గమ్యము జేరగలరు. కాని మానవుడు:- జాగ్రత్స్వప్నములయందు దప్ప సుషుప్తియొక్క పరిజ్ఞానమునైన దెలియజాలనపుడు, సహజానందప్రదంబగు తురీయ తురీయాతీత పథానుభవము నెటుల తెలియజాలును? కాబట్టి చైతన్యలగ్నమైననే ప్రాణము, లేక స్మృతి పైకి ఎగబారిననే! సమాధ్యానుభవమునకు వీలున్నది. మఱియువృక్షము బీజముయందు కలిగియుండుట సహజమే గనుక, ఈ బాట మానవజీవియొక్క ఘటముయందేగలదని తెలిపి:-సమర్పణాప్రబుద్ధునిజేసి; సురతశబ్దయోగ ద్వారా సులభ సాధనోపాయము జూపుటతో మనోప్రవృత్తులనేకాగ్రిపఱచి; సోపానక్రమముగ ప్రాణమును పైకి గొంపోయి, సచ్చిదానందాను

# ప్రస్తావన

భవము గలుగజేసి సత్పథమున జేర్చునదే ! శ్రీ గురు మత మని
గ్రహించవలయును. ఇచ్చట , ప్రాచీనోపనిషదభిప్రాయములను
గమనింపుడు:—

ఓగార్గీ ! ఈ అక్షరమగు ఆత్మ చూచునుగాని చూడబడదు.
నిజముగ పరికించుచో దీనియందే ఆకాశము ఓతప్రోతమైయున్నది.
(బృహ , ఉ. 3- ౮-౧౧) ఆత్మయనునది జ్ఞానమేనైయుండి , తది
తరులు తెలియుట కవ్వలిదైయున్నది. (బృహ , ఉ. 3- ౪- ౨)
ఎవడైతే ఆత్మను చూచునో , తెల్యునో , వినునో యాతడు సర్వ
జగత్తును తెలిసినవాడే ! (బృ , ఉ. ౨- ౪- ౫) ఎవడైతే యీ
జగత్తును ఆత్మేతరమని భావించునో ; వానినీ జగత్తు దూరమున
బడవేయును. (బృహ , ఉ. ౨- ౪- ౬) ఆత్మ తప్ప మఱేలాటి
అస్తిత్వమైనను యుండిలేదు. అనేక మనుట (పృషక్కలమనుట)
నామరూపము మాత్రమే ! మార్పున్నూ నామరూపమందే గలదు.
(ఛాం , ఉ. ౬- ౧- ౪ ) ఆత్మయే ! జగత్తును తనలోనుండి వ్యక్త
పఱచి , దానికి ప్రాణముగ నేర్పడి , ప్రాణస్వరూపుతో నందు
సమయించెను. (ఛాం , ఉ. 3- ౧౯ మఱియు ౬- ౨ ) (తైత్త ,
ఉ. ౨- ౬ మఱియు ఐతరేయ : ఉ. ౧- ౧)

తిలకించితిరా ! అయితే , ఈ జగజ్జాల సృష్టికి పూర్వము:—
సర్వ సారామృతమగు సత్ , లేక సత్యము మాత్రమే యుండి
యుండెను. దానినెవరైన అస్తి , లేక నాస్తి యనుటకు వీలులేదు.
ఏలయనగా ; అస్తి నాస్తులయొక్క అంగీకార నిరాకరణలు రెండవ
వాడుండియున్నగదా పొసగి వీలగుట. ఈ సత్యముయందు రెండు
పరిస్థితులు కలిగి యుండెనని , మనమిపుడు కలిగియున్నారము

గనుక చెప్పుకొనుచున్నాము. అందొకటి అస్తి, లేక జాతి యను దీనినే! ఉపనిషద్ర్పబోధాధారమునకై బ్రహ్మమని ఉపయోగించి యున్నారు. రెండవది విశేషణము, లేక పకృతి యని ఆర్యులు పేర్కొనవలసివచ్చినది. గాని:– అస్తినుండి అస్తిత్వమెపుడు వేరై యున్నది? ప్రబోధమునందు మాత్రమే పృథేదము నుపయోగించుకొనక తప్పుజాలకున్ననూ సత్యము, లేక సత్ప్రథమగుఅస్తి యందు జాతియులేదు. విశేషణమున్నూ (గుణమున్నూ) యుండి లేదు ఒకవేళ అస్తిని జాతి, లేక ఏకమని పేర్కొందుమా! అస్తిత్వమగు విశేషణము వెనువెంటనే సూచితమగును, ఏలయనగా:– ఇయ్యవి తత్సంబంధ శబ్దములు. కనుక, ఇందొకదాని దలంచిన రెండవదియు పొడచూపును. ఇటులని గుర్తెయంగక, మనమెపుడు విశేషణ భావభ్రాంతులమగుదుమో:–మనకపుడద్దాని తేజో సౌరభములు దృగ్గోచరించుననుట సహజమేగాక; వీని సమ్మేళన వలననే భూతజాలము ప్రభవించి జగజ్జాల సృష్టిగ ప్రకటింపబడి, తుదకు మనుష్యునియందు నిలచి తిరుగబడుటచే ద్వంద్వ భావమేర్పడి భ్రమకును మూలకారణమై, మోసపడనై, తన యందు నిగూఢముగ వెలసియున్నట్టి సర్వశక్తిని రేకెత్తించుట కొరకు సాధనసంపత్తిని, లేక మతవిధి విధానానుష్ఠానమును యేర్పఱచుకొను స్థితి సంభవించుచున్నది. కనుకనే! భారత వర్షమందుత్తరఖండవాసియగు శ్రీ ఆదిసంత్‌కబీర్;– ఇట్లని యను భవమున గుర్తెరింగియే, శ్రీగురుమతముయందు పాక్షిక పాషండ సాంప్రదాయాభిమానములకు తావులేదని నిరూపించి చూపుటకో యన్నట్లు; తనకు కౌమారుడు కలిగియున్నను ఋషిసంతతికి జెందియున్నవాడే ఋషియనదగునని, శ్రీ ధర్మదాసులవారికే తన

గద్దీ నొసంగెను. మఱియు దక్షిణఖండ వాసియగు సద్గురువరేణ్యు శ్రీ వీరబ్రహ్మేంద్రులు:- తనకు కొమారులు కలిగియున్నప్పటికి, అర్హత ననుసరించి శ్రీ దూదేకు సిద్దప్పగారికే తనయొక్క గురుత్వ పదవిని ప్రసాదించియున్నారు. చూచితిరా! ఇందులోగల గాంభీర్య రహస్యమును.

సంత్ మతమని పేర్కొనబడునట్టి "శ్రీగురుమతము" ప్రబోధించునది ఏమనగా:- సర్వశక్తి సంపూర్ణమగు సత్పురుషమును, అగాధానందజలధి యనుటతో సామ్యముగా సముద్రమునకు పోల్చి, అద్దానియందు తరంగమేర్పడి ప్రకాశమంత మయమ్యొందుటచే, అయ్యాకృతిని కలిగియున్నట్టి తేజమునకు నామకరణ మిడకున్నచో, ఊహించి ప్రబోధించుట కలవిగాదగుటచే సత్పురుష అనబడియెను. ఎటులైతే సూర్యచంద్రాదులకు చుట్టు తత్సంబంధ వలయాకార ఆవరణ కలిగియుండునో! అనగా: ఎటులైతే దీపమునుండి పొగవెలువడి యుండక ప్రసరించు, దానిమ వెలుతురు నాధారముగాగొని, లేక అద్దాని నాశ్రయించుటతో ప్రకటింపబడి వ్యవహరించుచు, తద్భిన్నపదార్థముగ గోచరించుచుండునో! అటులే యీ సత్పురుష, లేక సత్ లోకమునకు చుట్టియున్నట్టి సూక్ష్మమాత్రపువర్ణ తంపరకాడిక వలయాకార ఆవరణ కలిగియుండుననుటేగాక; ఆగంతుకచక్రముగ వెలసియుండు యీ ఆవరణయే ప్రభావ, లేక ఆదిమాయ అను పేరెన్నిక గలిగియున్నది. ఈ ప్రభావయందలి ప్ర:- ఆది. భా:- భరించుబడినట్లుండునది. అనగా:- తత్సంబంధభారమును, తొలుత ఆదిమాయ ఒకేవిధ సమతనుకలిగియుండి. భరించుటతో ప్రకృతి యనబడును. ప్రకృతియందలి ప్ర:- ప్రథమ. కృతి: యినప్పు.

అనగా:- ప్రారంభమున రచియించుతనమును కలిగియుండునది ఇయ్యది, పరబ్రహ్మపథము ననుభవించు వారికే! బీజరూప లయావస్థగా వేద్యమగుననియు; దీని యొకభాగము మాత్రమే పరబ్రహ్మమునందు దొరకొనియుండి, సర్లోకముక్రింద సూచింపబడు ననియును; మఱియు:- సర్వశక్తి సంపూర్ణయయ్యు, తనలోతాను ప్రకాశమానయై యున్నట్టి సత్పురుషచ్ఛాయనిది ఆకర్షించి తేజోవంతమగుటతో ప్రకటింపబడి, ఛాయాపురుషయను పేరొందిన ప్రతిరూపమే! పరబ్రహ్మపథమనబడుచున్నదని గుర్తెరుంగవలెను ఇయ్యది సర్లోక సముద్రమందలి బిందువు మాత్రమే నయ్యు ప్రతిభాసయై యుండుటవలన, సత్పురుషువైపు దృష్టిపడి యద్దాని ప్రవీణతనుగాంచి తానున్నూ పూర్ణతనొంద నిచ్ఛగించి, త్రిలోక రచన గావించుటచే:- ప్రకృతియొక్క ప్రాథమిక తత్వమనబడు చున్నది. మహాకాలపురుష యనబడు యీ పరబ్రహ్మమునకు కలిగియుండునట్టి వలయాకార ఆవరణయే కారణమాయ అనబడును. మఱీ పరబ్రహ్మ పరివర్తిత స్వరూపమే బ్రహ్మమనబడు చున్నది. కాలపురుషయనిపేర్కొనబడు యీబ్రహ్మమేతననాహుతి గావించి జగద్రచనగానేర్పడి, అందులో పరివ్యాప్తత నొందుటనే బ్రహ్మయజ్ఞమందురు. (శతపథ బ్రా ౧౩-౭-౧-౧) కనుక దీనికి ఆవరణగా గలిగియుండుదానినే:- సూక్ష్మమాయ అందురు. ఈ బ్రహ్మాంశ, పరివర్తిత, లేక తజ్జనితమై ఆత్మయని పేర్కొనబడు చున్నదానికి స్వరూపము (శరీరము)గా నేర్పడియుండునదే స్థూల వ్యష్టిమాయ అనబడునని తెలియవలయును. ఇంతేగాదు, ఇచ్చట జ్ఞప్తియం దుంచవలసిన దేమనగా:-

సత్పురుషకాయమనునది విశుద్ధ చైతన్యమేయని. అనగా:- అన్నింటి కాధారభూతమగు జ్ఞానతత్వమేననియు; దీనివల్లనుండి ప్రకటింపబడినట్టి ముల్లోకములలో నొకటవదానిని చైతన్యదేశ మందురనియు; రెండవదానిని కాలదేశమనియును; మూడవ దానిని మాయాదేశమనియున్నూ పేర్కొందురు. ఇయ్యవి దీపము నందు మనకువేద్యమగునట్లుతెలుపు ధూమ్ర నలుపువర్ణములగల్గి అనుభవమున గోచరమగును. ఈ నాలుగింటికిపైన అనుభవమున కందగలట్టి మూడు పరిస్థితులు కలిగియున్నను శాస్త్రములు:- భూర్భువస్వః మహ జనతపస్సత్యములని సప్లోకమువరకే తమ ప్రబోధమును నిలిపివేయుచున్నయవి. జననుమనను:- ప్రకాశ మానయగు తేజోమయికి సత్పురుషయనునామము సంభవించుటలోని కారణమును తెలిసికొంటిమిగదా! స్వరూపనామము తేర్పడుటతో గుణమున్నూ ప్రకటింపబడుట సహజమేనగును. ఇందులో నామి తమపరియే స్వరూప నామగుణములు జనించుటచే, వీటియందు లక్ష్యమునుంచక నామినిమాత్రమే! అనగా:- ప్రకృతిసిద్ధ క్రమ బద్ధముగ ప్రత్యక్షమైన సృష్టికి చివరవ్యక్తిగా ప్రకటింపబడి, అం దలి సర్వపరిస్థితులు బీజరూపమున తనయందుకలిగి మనుష్యు డని పేర్కొనబడు చున్నవాడు:- సోపానక్రమముగ ఆయాశక్తుల రేకెత్తించి అనుభవమును గడింపజూడ సాధనము నొనర్పవలయు ననియు; తదుపరి సత్పథము సుగమమగుననియు శ్రీగురుమతము నిరూపించి యున్నదని తెలియవలయును. ఇదిగాకను, మన యొక్క ఆదర్శపురాణ చారిత్ర్యక మతవిధాన వైఖరితోపాటు తెలియుచున్న దేమనగా:-

భరత ఖండోత్తర భాగమునందలి హిమాలయ పామీర్ పర్వత ములనే! ప్రారంభ మానవుడు ప్రభవించి, అయోధ్య (అః-లేని యోధ్యః యుద్ధము) ను తనయొక్క ప్రధానస్థానముగ యేర్ప అచి ప్రథమ మనువసబడెననియు; తదుపరి ప్రళయము సంభవించుటచే; చాలావరకు జనులు నశించగా ద్వితీయమను వున్నూ నావపైయేతెంచి, హిమాలయ శిఖరమునజేరి, నీటితడి ఆరినవెనుక అయోధ్యనువెతకి యందే నివాసిగానుండెననియును. ఈ ద్వితీయమను సంతతియే యహూది, పారశీ, మిస్రాని, యూనానీయులనియు; హైందవులమగు మనమందరము, ఇందలి ప్రథమ మనువుయొక్క సంతతి యనియును తెలియుచున్నది; ఇంకనిచ్చట, ఈకలయుగాది సంత్ శ్రీ కబీరు పురుషోత్తముని అనుభవైక వేద్యోపదేశమును గ్రహింప జూచెదము:-

౧. అంతర్ జ్యోతి శబ్దఇక్ నారీ, హరి బ్రహ్మ తాకే త్రిపురారీ,
౨. తే త్రియె భగ్ లింగ్ అనంతా, కాహునజానిల్ ఆదివఅంతా;
౩. బాఖరి ఏక్ బిధాతె కీన్హా, చౌదః ఠైర్ పాటి సోలీన్హా,
౪. హరిహర్ బ్రహ్మమహంతొ నావూం, తే పుణ తీన్ బసావల్ గావూం,
౫. తిథ్ పునిరచల్ పిండ్ బ్రహ్మాండా, చౌదర్శణ ఛానవేపఖండా,
౬. పేటేకాహునబేద్ పఢాయా, సునతికరాయెతురక్ నహి ఆయా,
౭. నారీ మోచిత్ గర్భప్రసూతీ, స్వాంగ్ ధరే బహుతే కర్తూతీ,
౮. తెహియా హంతుం ఎకేలోహూ, ఏకేప్రాణ్ బియాపే మోహూ,
౯. ఏకేజనీ జనాసంసారా, కోన్ గ్యాన్ తే భయఉ న్యారా,
౧౦. భాబాలక్ భగ్ద్వారే ఆయా, భగ్ భోగేతే పురుష్ కహాయా,
౧౧. అబిగత్ కీగతి కాహునజానీ, ఏక్ జీభ్ కిత్ కహాం,
౧౨. సాఖీ:-కహహి కబీర్ పుకారి కే ఈలైఊబెవహార్,
రాంనామ్ జానేబినా భవబూడి మువాసంసార్,

ఇందుల కనువాదము:- ౧. అంతర్ (ఉన్మనీ) జ్యోతి, శబ్దం, ఏకం, నారీ. (ఇయ్యవి ఐదావస్థలు) ఈనారీ (అతిసూక్ష్మ మాయ) వలన బ్రహ్మ (రజః) విష్ణు (సత్వః) మహేశు(తమః)లు కలిగినారు. ౨. ఈ ముప్వురివలన అసంఖ్యాక స్త్రీ పుల్లింగయుత సృష్టి యేర్పడెను. ఈ సృష్టియొక్క ఆద్యంతముల జాడ ఎవరి కేని అబోధము (అవిదితము) 3. ఇందులోని బ్రహ్మః-పదునాలుగు అపట్టులు( ఊర్ధ్వ అధో సోపానములు) గల భవనము నేర్పఱచెను. ४. సృష్ట్యాదినేతః (అధిష్టాత) లైన బ్రహ్మ విష్ణు మహేశు లిందులో తమకై ముల్లోకములను నిర్మించుకొనిరి. ५. తదుపరి:-పింద బ్రహ్మాండరచనయై, షడ్దర్శనములును మఱియు తొంబదియాఱు పాషండ మతమతాంతర సాంప్రదాయములు(వాణీరూపమాయచే) వెలువడెను. ౬.ఎవ్వడెవనికేని గర్భస్థముగావేదమును బోధించెనా! ఏ తురుష్కుడైన (గర్భస్థమున) సున్నతి గావింపబడి వచ్చెనా! ౭. నారీయందు చిత్తమునుంచుటచే గర్భమునుండి వెలువడి వెడలించుచు నానా ప్రకార వేషములను దాల్చుచు, వివిధ ప్రక్రియల నొనరించుచున్నారలు. ౮. అప్పుడు మా మీ రక్తము మఱియు ప్రాణము నొకటియేనై వ్యాపించియుండెను. ౯. సమస్త జగత్తునకు జననియు నొకతియేనైయుండ, ఏ జ్ఞానముచే తమ నితరులకు విభిన్నులుగా భావించుచున్నారు? ౧౦. భగమునుండి వెడలుట వలన బాలకుడను పేరొంది, భగభోగముచే పురుషు డనబడుచున్నాడు. (ఇంతే కాదా వ్యత్యాసము) ౧౧.అవిగతి వయిన స్థితి నెఱుంగజాలువా రొకరైనా లేనపు డొకే నాలుకతో మరొక విధముగా నెటుల వివరించుట! (శ్రుతిః-"అవిగతి గోతీతమ్ జ్ఞాన రూప అతీతమ్.") ౧౨. శ్రీ కబీరుగారి ఉచ్చైస్వర ప్రబో

ధము:—అరరే! ఈలయమగు అస్థిర జగత్సంసారసాగర వ్యవహార మున, ఏక రామ (స ద్గు రు) నామానుభవము లేక మునకలు వేయుచున్నారలు. మఱియు, శ్రీకబీరు మహాశయుని హిత ప్రవచనము లివిగో:—

౧. మూరఖకే సంఘాపనే జ్ఞాన్ హృదయెకా జాయె,
కోయిలాహుయే నఊజలా చాహే సామఁసాబుఁలాయె.

... ... ... ...

౨. బిన్ బివేక్ కే సబ్ హీనిష్ఫల్ కరమ్ భక్తి ఔర్ జ్ఞానా,
తాతే సత్సంగ్ గురూకాకీజే మేట్ తిమిర్ అజ్ఞానా,

... ... ... ...

3. గురూకో మానిష్ జానై తేనర్ కహియే అంధ్;
హూహేఁ దుఖీ సంసార్ మే ఆగే జమ్ కో ఫంద్.

## వి జ్ఞ ప్తి

అనుష్ఠాన పథమునందు, పరావిద్య ననుభవమున గడింః జేయు "శ్రీ గు రు మ త ము" ను రహస్యమైనదని గుప్తముగ నుంచబడుట వలననే! అజ్ఞతలేని గురు శిష్యుల కాలవాలమై విలువలేని దనబడ జొచ్చినది. మఱియు పరమార్థము:—అర్హులగు వారికే బోధపడగలదని ప్రత్యక్షానుభవముగ దెలియుచుండ దీని గుప్తముగానుంచనేల? సర్వజీవులయం దమూల్యమైన మానత్వము తరించవలయునని యిచ్ఛగించుచో, శ్రీగురుమత మూ మునదప్ప గత్యంతరములేదనిశాస్త్రముద్ఘోషించుచుండుటచే దీని గ్రంథ స్వరూపమున నుంచుటవలన, ఇక్కలికాల నరుల కం

# ప్రస్తావన

బాటుననుండి చేపట్టితరించుట కవకాశము లభించగలదు. ఇటుల గావించుటతో అర్హత ననుసరించి ఉపదేశించు రహస్యమును వ్యక్త పఱచుట కాజాలదుగదా! ఇందులకు సద్గురుడు లభించుటతో యించుక శ్రద్ధ వహింపబడునేని, కాలాతీతమున కవకాశముండక హృదయస్థగురుని చేయూతనొంది, ఆత్మాన్వేషణకై తగు పరికర ములతో గూడియున్నట్టి విలువైన నరదేహము లీలగా బలికాజాల కుండానగును. కాబట్టి:- అవాఙ్మానసగోచర మైనట్టి సద్విద్య, ఆత్మవిద్యననుసరించినదేగాక ఈ గ్రంథము; జ్ఞానానుభవమును విజ్ఞానజనిత విద్యస్వరూపుతో వి వ రి ం ప బడినదగుటచే, శబ్ద జంజాటమునకు లోబడి పలుకుల జీల్చుటతో పెడభావమున కోడి గట్టక, శబ్దముల సమకూర్చుట యందలి సదుద్దేశ సంయుత సత్యా భావనను గని పట్టజూడవలయును. ఏలయనగా నియ్యది:_ సాధ కునికి సులభసాధ్యము నుద్దేశించి రచియింపబడిన దగుటచే, ఇందులో పునరుక్తి పాటింపబడలేదు. మఱియు దీనిలో క్రొత్త యెద్దియు లేకుండుటయేగాక, పూర్వులు:_ మన ప్రయత్నమునకై మిగిలియుండ జేసినది లేదనియును; అనాది కాలమునుండి మానవుడు తనయొక్క ఉత్తమోత్తమ జన్మను తరింపజేసికొను టకుగా నొనర్చియున్న కృషి సారాంశమే! ఇదియని జూపెట్టు టయే దీనియొక్క రచనోద్దేశమని నివేదించుకొనుచున్నాడను.

మానవజన్మోద్దేశ కర్తవ్య సాధన స్వరూపమగు మతము యొక్క సత్యతను సుసాధ్యముగ పరిగ్రహించుటకై, ఈగ్రంథము నందలి ప్రథమభాగమునందు:-సత్యమత విషయికసూత్ర విశదీ

కరణ కలదనియు ; ద్వితీయ భాగమందు:—పరావిద్యతో వెలసి యున్నట్టి "శ్రీగురు మతము" యొక్క వివరము కలదనియున్నూ తెలియవలయును.

## వం ద న ము లు

ఈ గ్రంథ రచనకు ; తమతమకృషియొక్క అనుభవము లను చూపెట్టుట మూ ల ము న సహకరించినట్టి.—పరమసంత్, సంత్ ; మహర్షి , ఋషి , సూఫీ , పరివ్రాజక , మఱియు తదిత రులకును ; స వి న య కృతజ్ఞతాభివందనములను ఆచరించు చున్నాడను.

## ప్రార్థనాపూర్వక విజ్ఞప్తి

పాఠకులారా ! హంసపగిది నిండలి పాలను గ్రోలి , నీటిని పరిత్యజింతురుగాక యని విన్నవించుకొనుచున్నాడను.

ఇట్లు భవదీయ విధేయుడు

తం॰ ధర్మాచార్య

(గ్రంథరచయిత)



# శ్రీ గురు మతము

## పూర్వ శాంతి పాఠము



ఓమ్ సహనావవతు, సహనౌ భునక్తు, సహ వీర్యం
కరవావహై, తేజస్వీనావధీతమస్తు, మావిద్విషావహై.

ఓం. శాంతి శ్శాంతి శ్శాంతిః.



## ౧ వ ప్రకరణము

## మత చరిత్ర



౧. ప్రపంచమునందుగల మతములన్నియు ఈశ్వరపరము లయ్యు సంతోషదాయకముగా ప్రభవిల్లియుండినను, సామాజిక ములేనయ్యుండి యున్నవగుటచే:- వివేకపరిజ్ఞాన యుతాత్మయగు మానవత్వము శాశ్వతత్వమును వాంఛించునదేనైననూ ! ఈ జీవి

---

సూచన:- ఈ గ్రంథమునందలి ప్రస్తావనను గమనించి యున్నారా ! అయితే సందేహాస్పద విషయమేద్దియేనైనను ; ఇందితర ప్రకరణములందు నివారణ కాగలదని జ్ఞప్తియందుంచవలయును.

యొక్క జన్మస్థాన పరివృతమును , సహజప్రకృతిని , మఱియు అప్పటి సాంప్రదాయము ననుసరించియుండు చుండుటయు సహజమేగనుక ; ఈ మతములు జన్మతరించుట కుపకరింపబడ జాలకున్నవి. ౨. హిందూమతాదర్శ గ్రంథములగు వేదారణ్యక విభాగమునకు సంబంధించిన ఉపనిషద్ప్రచారము:- మానవుడు తరించుట కనువైనదిగా నున్ననేమి ? ఆ ప్రబోధమంతయు వేదసారామృత మనబడుచున్ననేమాయె ! ఇందులోకి ద్వైతాద్వైత విశిష్టాద్వైత సాంప్రదాయములు ఏతెంచి , పాక్షిక దృక్పథముతో తమ ప్రత్యేకతను సాధింపజూచి, మానవునియొక్క ప్రవృత్తియందుమరింత గల్లంతునే సమకూర్చినవి. మఱీ సాంప్రదాయములు మానవుడు ఉద్ధరింపంబడుటకు , సోపానత్రయముగా నున్నట్టి విషయమే మఱుగున బడిపోయినది. ఈ కారణాంతరము లావరించి నేటి మానవత్వము దేహజంజాట మాత్రముతో జీవితమును సరిబుచ్చునదై , ఆత్మ పరిజ్ఞానము నిసుమంతయు నొల్లనిదిగా తేజరిల్లినది. 3. కార్యకారణపరమైనదీ సృష్టియైయుండ:-కార్యము కారణము కొరకే ! యనుటనుమరచి , మానవుడు కేవలము కార్యసాధనోపకరణమగు భౌతికస్వరూపారాధనలయందే ! కార్యము నుపయోగించుచున్నాడు. మఱియు అనేకత్వకూడికయగు భౌతిక శరీరము:-మార్పునొందుట సహజమగుటచె, అదియే! తాననుకొను వానిని దుఃఖములపాలొనర్చునను భావమునకే తావు శ్రేకుండానై విచారకరముగానున్నది.

ఋష్యాదులు:- పరమార్థిక తత్వమును సూత్రప్రాయమున గానమొనర్చియున్నారు. దానిని అనుష్ఠానపథమున అవలంబించి

గడించినవారునూ లేకపోలేదు. గాని ; అయ్యదనుభవైక వేద్యా విష యమగుటచే సర్వసామాన్యులకలవిగాక, అద్దానిని నానావిధ ముల పేర్కొనియున్నారలు. మఱియు, జగత్తుయందుప్భవించిన మతములన్నియు:— యోగులు, మునులు, బుద్ధులు, తీర్థంకరుల యొక్క ఆత్మోన్నతి ఫలితాంశములైయున్నవి. ఎవరి కెంతవరకు సాధింపబడియెనో ! అంత వరకే తమశిష్యుల కుపదేశింపిరి. మఱియు, ఎంతకాలమువరకు మానవుడు అంతర్ముఖ సాధనకు గడంగుచుండెనో ! అంతవరకే, అనుభవమును గడించుచుండెను. తదుపరి బహిర్ముఖులగుటచే ; వ్రాతలు మఱియు గానముల నొనర్చుట మాత్రముతో సంతృప్తులు కావలసివచ్చినది.

మతమునందు:— ప్రవృత్తి (కర్మకాండ) నివృత్తి (జ్ఞానకాండ) యను రెండు మార్గములుకలవు. ఇయ్యవి, బ్రాహ్మణములు మఱియు ఆరణ్యకములను వేదవిభాగసూత్రములు. ప్రవృత్తి యనగా:— వృత్తి, నడవడి, అలవాటు, అభ్యాసము, సంబం ధము, ప్రస్తుత; వృద్ధినొందుట. కార్యనిమగ్నతలగును. నివృత్తి యనగా:— ఉత్త, ఉదాసీనత, రిత్త, రిక్త, అందుబాటు, శాంతి, సమాప్తులగును. ఇందలి ప్రవృత్తిమార్గ మనునట్టి కర్మకాండను:— భౌతికదృక్పథమునందు మానవులు బలిష్టులై యుండుటనుగాంచి, ఆర్షేయబ్రాహ్మణులు తమ జీవనమున కాధారముగాజూచి బలపర చుటవలన ప్రజలలో అజ్ఞానము ప్రబలెను. దీనిని క్షత్రియు లెఱింగి, తమ స్వధర్మ నిర్వహణమూలమున వారించి, జనులలో చాలావరకు నివృత్తి మార్గము నలవడజేసిరి. ఇట్లనగా:— ఆత్మిక దృక్పథము (జ్ఞానము)ను కలిగించిరని ఉపనిషచ్చరిత్ర వాకొను

చున్నది. ఈ జ్ఞానమార్గము శ్రేష్ఠమైనదయ్యేయున్నను, కాలచక్ర మార్పుననుసరించి రానూరానూ క్షీణదశనొందుతూ వచ్చినది. మఱియు సత్కర్మ నొనర్చుటకైనను తావులేకుండా యగుచున్నది. సర్వ సామాన్యముగ మానవుడు:-స్వార్థపరుడుగా నుండుచుండుట వలన ప్రవృత్తినే! అనుసరించుటయు సహజమేయైనను, సృష్టి తత్వమును తెలియగల సంస్కారులగువారు నివృత్తియొక్క ఘనతను గుర్తెరుంగజాలకపోరు. అదెటులనగా:-ఇట్టివీర లొకప్పుడు నిత్య, లేక స్థిరదృక్పథమును కలిగియుండుటవలననే! తదుపరి స్వార్థపరులై అనిత్య, లేక అశాశ్వత స్వరూపముల నాశించి వానిని శాశ్వతముగ నుండవలయు ననుకొని కర్మనొనర్చుచున్నారు. గాని; అయ్యవి మార్పునొందున వగుటచే తత్పరియవసాన ఫలితముగ ప్రాయశ్చిత్తము సంభవించుట సహజమేగదా! అప్పుడు కర్మ నొనర్చుట జ్ఞాన అర్జనకు ప్రథమ సోపానమని వారికిస్వయముగనే బోధకురాకపోదు. ఇచ్చట తెలియవలసినదేమనగా:-

హిందూత్వమున:-కర్మమార్గమును "మీమాంస" యందురు. మీమాంస యనునది సంస్కృత ధాతువగు "మాఙ" (జ్ఞానమును వెతకుట) నుండి వెడలినదేను. మఱియు, "ఉత్తరమీమాంస" యనునది తర్వాతి మెట్టు. ఇందలి కర్మ మార్గము; లేక కర్మ సూత్రములకు:-జైమిని ఋషికర్త. ఉత్తరమీమాంసయను జ్ఞాన తత్వము, లేక బ్రహ్మ సూత్రములకు:- బాదరాయణుడనబడు వ్యాస మహర్షికర్త. ఈయన యుధిష్ఠిరుని సమకాలికుడని చరిత్ర వలనతెలియుచున్నది. పూర్వ ఋషికాలమందలి సహజమతము వకు వేదాంతము అనునామము:-కలియుగాదిలోఈఋషిసత్తముని

వలననే యేర్పడి, దీనికి ప్రథమాచార్య "లోపముద్ర" (అగస్త్య ఋషి భార్య) మంత్రద్రష్ట యనియు; వీరికి దాదాపు సమకాలికుడే యనబడు, శ్రీ శంకరాచార్యులను మహానుభావుడు దీనిని బలపరచినటులయున్నూ చారిత్ర్యకముగ బోధపడుచున్నది. మఱియు:—జరదిష్టనబి (Javrashter) గారి పారసీక మత గ్రంథమునగూడా, వీరిద్దరి నామములే గాంచనగుచున్నవి. మఱియు ఇందలి వ్యాసులవారినే, పురాణములన్నింటికి కర్తయనుచున్నారు. గాని వీరి కర్తృత్వమున వెలువడినవనబడు పురాణ గ్రంథములయందు ధర్మవ్యత్యాసము కలదగుటచే:—అయ్యా వాటిని కాలానుగుణ్య పరిణామానుకూల ధర్మ గ్రంథములనవలసియుండును. వ్యాసుడను ఒక ఋషివరేణ్యుడు పూర్వకాలమున కలిగియున్నను; ధర్మపరివర్తన సమయమాసన్నమైనపుడు, ధర్మమును నిరూపించి ప్రకటించు "వ్యాసంగమము" అను ధర్మ ప్రతిష్ఠాపన సంఘమనునదొకటి, పూర్వకాలమున యుండుచుండెనని తోచగలదు. చూడుము "వ్యాసుడటన్న నేమని సమాజము లెంచునో, వాని వ్రాలు వ్యత్యాసముకాగ కనరా! వినరా! తనరారు గ్రంథముల్, అని ఒక కవియున్నూ నుడివి యున్నాడు. ఏలయన, సక్రమ ప్రబోధకుని వ్యాసుడనియు, గురువును శంకరాచార్యులనియును ప్రయోగింపబడు చుండెడిదిగదా!

కలియుగాదికి దాదాపు రెండువేల సం॥ల తర్వాత అవతరించినట్టి, తొమ్మిదవ అవతారముగ నెన్నబడు శ్రీ బుద్ధ భగవానుడు(౨౪ వ బుద్ధ) మత ప్రవక్తయై, సూత్రప్రాయముగానున్నట్టి ఉపనిషద్ప్రబోధమును సులభ సాధ్యమునొనర్చినటులను; ఈయన సహన, శాంత, సత్స్వభావ, విశాల హృదయుడైయుండి

యుండుటేగాక మతమును అనుష్ఠాన రూపొందజేసి , సభ్యతాను కూల ప్రచారము గావించి ప్రతి యింటికిని అందజేసినటుల యున్నూ ; "అహింసో ప్రథమో ధర్మః" యను సూత్రమును సర్వజనులలో నాటుజేసినట్లున్నూ చరిత్ర వలన తెలియుచున్నది. గాని ఇటీవల:-

దాదాపు పం డ్రెండు వందల సం॥ ల క్రితము దగు శ్రీ గౌడ పాదాచార్య పారంపర్యమునందు శ్రీ శంకరాచార్య స్వాములను మఱియొక నామము గాననగుచున్నది. వీరే! వ్యాససిద్ధాంతిత మగు వేదాంతమునకు "అ ద్వై త మ ను" నామకరణము నిడి సంస్థాపించినటులను ; తన విద్వత్బలముచే శ్రీ కుమారిల భట్టు వలె , భౌద్ధ మఱియు జైన మతానుయాయు లనగద్రొక్కినటుల యున్నూ చరిత్రవలన తెలియుచున్నది, ఇందులకు చూపెట్టు బడుసాకు : "చాతుర్వర్ణ సాంఘికాచార సంస్థను శ్రీ బుద్ధుడు సమూలముగ పెళ్లగించి నాశనముచేసె" ననుట ప్రచారితమై యున్నది. గాని శ్రీ బుద్ధదేవుడు:- అనుష్టాన పథమగు మతధర్మ సంఘమునమాత్రమే ! వర్ణవ్యవస్థకు తావు లేదనెను. అదెటుల నగా:- పారమార్థికశీలములేని యొక తరగతిజనులు ; కేవలము తమజన్మమునుబట్టి తామితరులకంటె అధ్యాత్మికముగ శ్రేష్ఠులమని చెప్పుకొనుట లోగల అసంగతమును , శ్రీ బుద్ధభగవానుడు లోక మునకు సువ్యక్తముచేయ ప్రబోధించెనేకాని , సాంప్రదాయానుగుణ్యములైన సాంఘికాచారసంస్థలను నిర్మూలింపలేదని , సమ యోచిత న్యాయదృక్పథునకు చారిత్ర్యకముగ తెలియకపోదు. ఒకవేళ , వారి అనుయాయులు పొరపాటున సాంఘిక కట్టుదిట్ట ముల కడ్డుపడి యుండుచో, ఆ మతశాఖకే ముప్పు వాటిల్ల

జేయుట ఏటిన్యాయము ! అయినను , ఈ బుద్ధమతము నణచి వేయుటతో నొక ఆనందదాయకవిషయము బయలువడి మేలే చేకూరినది. అదెద్దనగా:-

మతధర్మమే ! హిందువులయొక్క ఆదర్శ సర్వస్వమై యున్నను ; ప్రతి వ్యక్తిత్వ అర్హతలో విభేదము కలిగియుంట సహజమని గుర్తెరింగినవారగుటచే , సనాతనమునుండియు మత ప్రచారమునకు వీరు తావియ్యకుండిరి. ఈ మతముయొక్క బలమైన శాఖయగు బుద్ధధర్మ నిషేధముద్వారా హిందూమతేతరములగు ఖండాంతరములలో హిందూమత పరివ్యాప్తమున కవకాశము లభించినది. ఇంతేగాదు ; భగవద్గీతలో గనపడు చాతుర్వర్ణ సంస్థ:- కేవల గుణకర్మ స్వభావశీలము ననుసరించిన సాంఘిక వర్గీకరణము మాత్రమేగాని, జన్మనుబట్టి సంక్రమించిన ప్రత్యేకాధికారముల ఆధారముపై నిర్మింపబడిన విభజన సంస్థకాదు. కనుక , ఇందుకు వ్యతిరేకించి ప్రతిపాదించుచో , భగవద్గీత ప్రభోదించు తాత్త్విక పరమావధియగు సమదర్శనమునకు విరుద్ధమగునని తెలియవలయును. మఱింకెవరైన నీ వర్ణవ్యవస్థను దుర్వినియోగ పరచియుండినచో:- ఆ కారణమునుబట్టి హిందూ మత ప్రాణకేంద్రమగు పారమార్థిక శాఖాతత్త్వమును నిందించి డీలుపడజేయుట సమంజసము కాజాలదు. ఏలయన , నేటి ప్రపంచరుగ్మతకీ పారమార్థికతత్త్వమే ! పరమౌషధమగుటచే దీని యావశ్యకతను గురించి వేరుగ జెప్పపనిలేదు. ఇట్లనుటచే ఆర్షేయ బ్రాహ్మణజాతి స్వాభావికముగ మంచినే చేసియున్నదనుట కాజాలదు. ఏలయన , ఇందుమూలముగనే ! వర్ణవ్యవస్థ రానురానూ క్షీణించి ప్రజలందరునూ ఉన్నతినొంద సమానావకాశాలు లేకుం

డానై, తన్మూలమున సాంఘిక ఐకమత్యము భగ్నమైనదిసుమా!
అయినను:- ఈ వ్యవస్థను తొల్దొల్త తలపెట్టినట్టి మహనీయ ప్రాచీనుల యుద్దేశము:- నేడు సాధారణముగ సంఘసంస్కర్త లనుకొనునంతటి చెడ్డదిమాత్రం కాదని తెలియవలసి యుండును. మఱియు:-

ఈ బుద్ధదేవుని శూన్యవాదియని బేర్కొందురు- (శూన్యమను సోపానమొకటి శ్రీగురుమతానుష్ఠాన పథమున కలిగియున్నదని యిచ్చట జ్ఞప్తియందుంచవలయును) శూన్యశబ్దము సంస్కృత ధాతువు "శ్వి" నుండి వెడలినది- దీని అర్థము:- రిక్త; ఒంటరి; ఆకాశము; వట్టి; పూజ, లేక సున్న; చుక్కయగుగనుక యీ శబ్దముల కలయిక స్వరూపమును గమనించుచో సత్యము స్వయముగనే బోధపడగలదు. ఇంతకు యభిరుచికర విషయమేమనగా:- వ్యాసఋషి వేదాంతసూత్రములందును బుద్ధధర్మ వ్యతిరేక సూచనలు గాననగుచున్నవి. ఇందుచే, ఈ ధర్మము వ్యాసునికన్న పూర్వపుదని నిరూపణ యగుచున్నది.

ఋషులయొక్క మతవిధానాదిలోని ఉపనిషద్ చరిత్ర వలన తెలియుచున్నదేమనగా:- ధ్యాననిష్ఠయే ప్రధానతవహించి యుండెను. తదుపరి కర్మధర్మము ననుసరించి యేర్పడినట్టి యజ్ఞశాలలలో బలులు విస్తారముగా జరుగుసమయమున; మహారాజశ్రీ రుషభదేవులు పూర్ణత్యాగము నవలంబించి నిలిపివేసిరి. మఱియు వీరే! అహింసామార్గమగు జైనమతపునాదిని వేసి, మూర్తిపూజ నారంభించినవారని తెలియుచున్నది. అప్పటినుండియే ఋషులు గురుమూర్తిపూజద్వారా ధ్యానమును నిర్వహింప మొదలిడి; కర్మ

కాండను అజ్ఞానాంధకార చేష్టయని తమ ఉపనిషత్తులద్వారా ప్రబోధను మొదలిడిరేగాక; జ్ఞానకాండ ప్రారంభించుటతోపాటు దీనిని రాజన్యులు తమ స్వధర్మముగ చేకొని ప్రచారము నొనర్చి జనలోకము నుద్ధరించిరనియునూ తెలియుచున్నది మఱీ బ్రాహ్మణులు క్షత్రియులవలనే! జ్ఞానము నార్జించియుండిరను ఘట్టము లెన్నియో ఉపనిషత్తులందు సవివరముగ గాన నగుచున్నవి. ఇంతేగాదు, ఈ యుపనిషత్ ప్రబోధమును క్షత్రియులే! ప్రప్రథమమున అనుభవమున సమకూర్చి రూపొందజేసిరనియు; తదుపరి బ్రాహ్మణులు వానినభివృద్ధిపరచిరనియు (బృహ, ఉ. ౨-౧ మఱియు ఛాందో, ఉ ౫-౧౧-౧౪లో) గాంచనగును. ఈ చరిత్ర నంతయు క్లుప్తవివరము గావింప కారణమైన ఖిద్వద్వరేణ్యుడగు శ్రీ శంకరాచార్యులవారు:- క్రీ, శ. తొమ్మిదవ శతాబ్దాదిలోని వారని, కాంబోడియా దేశమునేలు రాజగు ఇంద్రవర్మగారు (క్రీ, శ. ౮౭౮ నుండి ౮౮౭) చెక్కించిన శిలాశాసనమువలన తెలియుచున్నది.

తర్వాత శ్రీ శఠగోపాలాచార్యులనువారు:- శ్రీసాంప్రదాయ పునాదిని వేసినటులను; ఈయన ఎరుకువాడయ్యు, సామాజిక మతమతాంతర వర్ణాశ్రమ వివాదల నణచి సత్యతను గనజేసి నటులయున్నూ; వీరితదుపరి చండాలురు సహితము, ఈ పీఠాధిపత్యమును వహించినట్లున్నూ తెలియుచున్నది. వీరి పరంపరలోనే శ్రీ రామానుజాచార్యులవారవతరించి, తమ విద్యాబలముచే శ్రీ సాంప్రదాయమునకు విశిష్టాద్వైత నామకరణము నొనర్చిరనియు; వీరు సన్యాసాశ్రమ స్వీకారమునకు పూర్వము బ్రాహ్మణజాతికి జెందియున్న వాడగుటచే, ఆపీఠము నాజాతికే! పిత్రార్జితముగ నొనర్చిరనియును చరిత్రవలన తెలియుచున్నది.

తర్వాత కొన్నివందల సం॥ లకు శ్రీ వల్లభాచార్యులవారి విశిష్టాద్వైతమునందు:- శుద్ధాద్వైతమను శాఖాసంప్రదాయమును వెడల దీసిరనియున్నూ తెలియుచున్నది. ఇందులోనే:- శ్రీరామానందుల వారవతరించిరి. వీరు విశాలస్వభావులేగాక, శ్రీ కబీరుగారిని తమ శిష్యునిగా పరిగ్రహించినవారు వీరేను. ఇక్కాలికాలమున:- శ్రీ శఠగోపాచార్య మఱియు శ్రీ రామానుజాచార్య లెద్దానిని దక్షిణహిందూస్థానమున పునాదినివేసి ప్రారంభించిరో! దేనిని ఆర్యావర్తమున శ్రీ రామానందులవారు ప్రబలజేసిరో! ఆ భక్తి పథమును శ్రీ కబీరుగారు విశాలదృక్పథులై, హిందూదేశమునం దంతటను పరివ్యాప్తపఱచి వైభవోపేతముగా నొనరించిరి. వీరి ప్రబోధము:- శ్రీ శఠగోప రామానుజులననుకరింప కుండుట యును, అందవ్వారలకు వీరికీ హస్తిమశకాంతర తారతమ్య మున్నూ కలిగియున్నను వీరు:- వారి చిహ్నములను ధరించుట మాత్రమేగాక; బహుముఖానుభవమున రామనామమహిమను గడించి, గీతాగానరూపమున లభింపజేసి మనకు పూజ్యపాదులైరి.

తదుపరి:- అద్వైత మఱియు విశిష్టాద్వైత ప్రభేద వివాదల గాంచి, సంస్కరణాభిలాషతో శ్రీ మధ్వాచార్యులనువారు; ద్వైతాద్వైత సాంప్రదాయమను మఱొకదానిని సృష్టించుటయు గానవగు చున్నది. ఇదంతయు, లేక ఈ ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సాంప్రదాయములే తెంచి, తమలోతాము పెనగొనుచుండుటను గాంచి; సామాన్యప్రజలు తథావలంబులగుటకు సందేహించుటను అదను గాగొని ఇతరులు:- ఈ ప్రజకు భౌతికావసరముల సమకూర్చు

ఆశనుగొల్పి, బలవంత బ్రాహ్మణత్వమును ప్రసాదించుటలో జాలిగొనికాబోలును శ్రీ దయానందులు:- "ఆర్యసమాజము" అను మరియొక సాంప్రదాయమును స్థాపించుటయును కాన నగుచున్నది. ఇంతకు:-

ఉపనిషదృషులసందేశము:- ఉన్నతోన్నతమైనది. అయ్యాది జ్ఞానశిఖరమగుటచే, సామాజిక కట్టుదిట్టముల కలవడియున్న వారికది అసాధ్యమై యున్నదని తోచుట నిక్కమే! ఐనను; దానియొక్క కళానైపుణ్య స్వరూపమును "యోగదిష్ట"యను ఉద్గ్రంథమున గాంచనగును. ఇందుగల రమ్యమైయున్న వైఖరిని; హైందవాదర్శగ్రంథములగు "షట్దర్శనము"లందును గాంచజాలము. ఏలయనగా:- ఎచ్చటనైతే విద్య అంతమగునో; దానినే ఉపనిషత్తులు సూచించుచున్నవిగదా! అద్దాని నిక్కలికాలమున:- శ్రీ కబీర్, నానక్, వీరబ్రహ్మేంద్రాదులు అనుష్ఠానమునందనుభవమునగడించి ప్రవహింపజేసిరి. తదనుయాయులచ్చటచ్చట నేడును కలిగియే యున్నారు. మఱియు మహర్షి శివబరత్లాల్ వర్మజీ (ఎం, ఎ. ఎల్, ఎల్, డి.) గారలు దీనిని వైభవోపేతముగా ప్రబోధప్రచార మొనరజేసిరి. కావున ఈజగత్తుయందు; పరిపూర్ణ జ్ఞానధనులెల్లప్పుడును కలిగియుండిరనియే చరిత్ర విశదపఱచుచున్నది. ఇంతేగాదు; ఉపనిషద్రృబోధము: అత్యంత చివరవిద్య గనుకనే, గురుకులాశ్రమములందే! గురుత్వముఖ ద్వారమువనే! అంతరాన్వితముగా లభించుచుండునదై యున్నది. ఈ కారణమునను సరించియే; ఇయ్యదారణ్యక విద్యయని పేర్కొనబడినది. ఇది జ్ఞానరసామృతమగుటచే మేధాసంపత్తికిని, సాంప్రదాయాభిమానులకును అలవిగాక, మతమతాంతరము లేతెంచుటయు;

పాక్షికహరధర్మిత్వము నవలంబించుటయును సంభవించినది. మఱియు నీ ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత యనబడు మూడింటిని:- ప్రస్థానత్రయమందురనియు దెలియవలయును. ఇంతేగాక.—

ఇదిగో! గాంచుడు, మన సోదరుడగు శ్రీ అనిలభరణ రాయిగారేమని వాకొనియున్నారో,- "అధ్యాత్మమును త్రోసిపుచ్చి అహంకారమునే! శరణుజొచ్చినయెడల; మానవుని గట్టెక్కించుట యసాధ్యము. మఱిదియే ప్రస్తుత యుగసమస్య. అధ్యాత్మమునుండియే భరతఖండము తన సంస్కృతీ సభ్యతల నుచ్ఛతమ శిఖరాగ్రమునకెత్త సమర్థమయ్యెను. రాష్ట్రీయ, సాంఘిక, శిల్ప, వాణిజ్య, సాహిత్యాదు లందపూర్వ కర్మశక్తి, మఱియపూర్వ నిర్మాణశక్తియు భరతఖండమునవెల్లడియైయుండెను. మఱియు:- భారతతీయ జ్ఞానసంపద, భారతైశ్వర్యము, భారతీయ వీరత్వము, కర్మకళాకౌశల ప్రతిభయు ప్రపంచవాసులను విస్మయోద్రేకుల గావించెను. వేదోపనిషత్తులందు:- బ్రహ్మసత్యం, జగత్తు గూడసత్యమే! జగత్తు బ్రహ్మముయొక్క ప్రకాశస్వరూపలీల. ఇందు గార్హస్థ్యాశ్రమమునకు మిక్కిలి ఉచ్ఛస్థానమొసంగబడినది సన్యాసము కేవల స్వల్పసంఖ్యాకులగు యోగులకుమాత్రమే చరమాదర్శముగానుండెను. ఎప్పుడు:- శ్రీశంకరాచార్యులవారు తనయొక్క అపూర్వ ప్రతిభాసామర్థ్యములతో, భారతదేశమందలి అబాలగోపాల సాధారణ జనులయందు "బ్రహ్మసత్యం, జగన్మిథ్యా" అనునట్టి యీ మాయావాదమును ప్రచారమొనర్చిరో! ఎప్పుడు:- బ్రహ్మచర్యాశ్రమానంతరము గార్హస్థ్యాశ్రమమందు ప్రవేశించకనే! ఏకాయకి సన్యాసమును స్వీకరించుట వాంఛ

నీయము, ప్రశంసనీయమనియు; కేవలమసమర్థుల కొరకే (క్రింది మెట్టువారికే) గృహస్థాశ్రమమనియు ప్రచారమొనర్చిరో! అప్పటి నుండియే భారతీయ సభ్యతాసామంజస్యము మఱియు, ఐహిక జీవనమునందు భరతఖండముయొక్క నిజమైన పతనము ప్రారంభమైనది. మఱియు యూరోపు:- బాహ్యజీవన సంఘటనల యందు అశేషోపదానమును సంగ్రహించియును, నిజమైనసుఖ శాంతిని గడింపజాలకున్నందుచేత; అధ్యాత్మమునకు కేంద్రస్థాన మైయున్న భరతఖండమువైపు నేడది తన దృష్టినాకృష్టమొనర్చు చున్నది. ఇచ్చట తెలియవలసినదేమనగా:-

ఎప్పుడెపుడీ! భారతవర్షపవిత్రభూమి యందలి మానవుని యొక్క మానసము విపత్తునకు గురియగుచుండునో, అప్పుడప్పు డది తనయందు లోతునకు మునింగి శాంతిని చేకూర్చుకొన ప్రయ త్నించుచుండును. కావున బ్రాహ్మణ క్షత్రియులలో సంభవించిన యుద్ధమందు క్షత్రియులు ఒత్తడిపాలై ఇట్లని ఆజ్ఞాపింపబడి యున్నది. "ఎవడు వేదములను తెలియునో వాడే ఆత్మతత్వము నెఱుంగగలుగును" (తైత్త, ఉ. 3-౧౨, ౯-౭) మఱియు "గురు నిద్వారా తప్ప ఆత్మతత్త్వము నెఱుంగజాలరు" (కఠ, ఉ. ౨ యొక్క ౭ నుండి ౯) ఈ సంఘటన:- మతధర్మమునందలి, కర్మకాండజనిత యజ్ఞబలిదానాసహ్యతకు సంబంధించినదని శ్రీ రామచంద్రుని సమకాలికులైన జనక, యాజ్ఞవల్క్య సంబంధోప నిషత్తులు సూచించుచున్నవి. ఈలాంటి రెండవ సంఘటన:- మహాభారతకాలమున చార్వాకునివలన క్షత్రియులలో జరిగిన యుద్ధవ్యాకులతకు కారణమయ్యెను. అప్పుడు భగవద్గీతా ప్రబోధ ప్రభవించెను. తదుపరి గీత మఱియు ఉపనిషత్తులు కలసి బ్రహ్మ

సూత్ర రూపొందెను. (అది బౌద్ధ, జైనమత బాహాటప్రచారసమయము) మూడవ సంఘటన:- విదేశస్థుల దండయాత్రలు సంభవించి హిందూజనులలో మతవివాదలు ప్రబలి. కల్లోలము రేకెత్త శ్రీ శంకరాచార్యులుద్భవించి సమయజేసిరి. నాల్గవ సంఘటన:- ద్వైతాద్వైత విశిష్టాద్వైతము లేతెంచుటచే మతవిరుద్ధములు సూచితమైన సందర్భమున, మహమ్మదీయ మతప్రబోధము జొరబడుటవలన అశాంతి యేర్పడెను. ఆ సమయమున:- అనగా నేటికి ఐదువందల సం॥ల క్రితము శ్రీ కబీరుమహాశయు డాది సంత్‌స్వరూపమున ప్రభవించి మతములను తరచి సామంజస శాంతుల జేకూర్చిరి.

చూచితిరా! మతకథ ఇటులున్నది. గనుక, యేశక్తి బలమున పరమాత్మ:- జీవజగత్స్వరూపములతో నభివ్యక్తమైనదో, ఆ శక్తియే మాయానామమున బేర్కొనబడు చిచ్ఛక్తి. వేదోపనిషత్తులందే బ్రహ్మము:- నిర్విశేష, నిర్గుణ, నిష్క్రియమని చెప్పబడియెనో అటులే సవిశేష, సగుణ, సక్రియమనిగూడ చెప్పబడియున్నది. చూడుడు:- "ఏకోహం బహుశ్యామ్". (వేదము) "నిర్గుణోగుణీ" "ఈశావాస్య మిదంసర్వం" "సర్వంఖల్విదంబ్రహ్మ" (ఉపనిషత్) "శ్రుతేస్తుశబ్దమూలత్వాత్" (బ్ర, సూ.) "వాసుదేవస్సర్వం" "ఏకాంశేనస్థితో జగత్" "మమైవాంశ స్సనాతనః" "యయేదం ధార్యతేజగత్" (భగ, గీ) "అక్షరాత్పరతః పరః" (ఉ, భాష్యం) ఇందుచే, బ్రహ్మమినహ జగదస్తిత్వము లేదు. అంతేగాని జగత్తు మిథ్యకాదు. క్షరాక్షరములు రెండును పురుషోత్తమునందు ద్వివిధ పరిస్థితులు. పురుషోత్తముడే! పరబ్రహ్మము. సకల జీవుల హృదయములందు, ఈశ్వరరూపమున

విరాజిల్లియున్నాడు. ఎవరైతే ఆధ్యాత్మసాధన మూలమున, ఉపయుక్తమగు దృష్టిని గాంచిరో, వారు తమయందంతస్థితముగ నీ సత్యమును గుర్తెరుగగలరు. "అనిత్యం అసుఖంలోకం" "మయ్యేవ నివసిష్యసి" (భగ, గీ) కాబట్టి:-

వ్యక్తిగత సంకీర్ణవాసనా కామములను కలిగించు క్షుద్రమైన అహంకారమును జారవిడవలెను. ఏలయనగా:- అహంభావమే! భగవాను నుండి మానవుని విడదీసి (పృథక్కరించి) వైచినదని గ్రహించి, దానిని నిర్మూలము గావింపవలయును, అహంప్రవృత్తియే మాయ, లేక మనస్సు. అహంవినాశమే శాశ్వతసుఖవికాసము. "మమసాధర్మ్యమాగతః" "ఇహైవ" అనగా:- ఇచ్చటనే నన్ను గాంచెదవు. (భగ, గీ) ఇట్లనగా, ఈ మర్త్యలోకముననే మానవుడు భగవానునితో నైక్యజ్ఞానమును ప్రతిష్ఠించవలసియున్నది గనుక, అహమ్మమకారములను త్యజించగలుగువారికే! సమగ్రజీవితానుభవము సంభవించగలదని గుర్తెరుంగవలయును.

తెలిసినదా! అయితే, సత్య శ్శాంతిస్సర్వాంతర్యామియునైయున్న ఆదర్శ, లేకగమ్యుడగుఇష్టదేవుని:- ఏకమనుటకును, లేక అనేకమనుటకును వీలులేదు. అయ్యదున్నదేమో ఉన్నది. వివేక పరిజ్ఞానయుతాత్మయై ప్రపంచోద్యానవనమున కేతెంచినందుకు, శాశ్వతఫలమును అనుభవింపదలంచి యున్నచో; అనుభవించవలయుగాని "తామునిగినదే గంగ, తావలచినదే రంభ" యను నిరార్థక, ప్రాలాపములతో అమూల్య మానవజీవితమును వృథాపుచ్చనేల? ఉట్టికి గాకుండా, స్వర్గమునకును గాకుండా, ఉభయభ్రష్టత్వము తప్ప మరేమియు లభించజాలదు సుమా

పశ్చిమమున:- ఋషులు "ఇతి" శబ్దముతో ; మునులు "నేతి" శబ్దముతో మతమును ప్రారంభించిరి. ఇందు మొదటి తెగవారు:- అదియే ! ఇయ్యదియన ధ్యానులనబడిరి. రెండవ తెగ వారు:- అది, ఇది కాదు. లేక అట్లని వాకొనుటకు వీలులేదన జ్ఞానులని పేర్కొనబడిరని ఉపనిషచ్చరిత్రవలన తెలియుచున్నది. తదుపరి వీరి స్థానములు పండితమ్మన్యుల చేజిక్కగా మూడవ తెగ ఏతెంచి:- ధ్యానజ్ఞానములు తగిలేవని, ఉపాసనాకాండను నెలకొల్పి బలపరచిరి. ఈ యుపాసనయే తదుపరి భక్తిమార్గ రూపొంది ; మహాఋషులు తమ సమాధ్యావస్థానుభవము వలన వైదికజ్ఞాన సిద్ధాంతము నొనర్చియుండిన విషయమే మరుగున బడిపోయి:- మూలాధారధని, లేక ధునియగు గణేశోపాసకులు గాణాపత్యులనబడుటయు ; స్వాధిష్టానధునియగు బ్రహ్మోపాసకులు స్మార్తులనియు ; మణిపూరకధునియగు విష్ణూపాసకులు వైష్ణవులనియు ; అనాహతధునియగు శివోపాసకులు శైవులనియు ; విశుద్ధధునియగు దుర్గ, లేక శక్తిని ఉపాసించువారు శాక్తేయులనియు ; ఆగ్నేయధునియగు సూర్య, లేక తేజోనిరంజన్ ఉపాసకులు సౌరులనియు ; అనబడి నిజయోగోద్దేశము అడుగంటుటతో పూజయని, అర్చనయని, వ్రతమని, నోమని, ఆచారమని ఇలవరసయను సిద్ధాంతములను:- పొట్టకూటికై పరమార్థము నవలంభింపజేయువారు నియమించ భౌతికలాలసము పెంపొంది ; రాళ్ల చెట్ల పశువుల పూజలతో ! గౌరవమర్యాద పాండిత్య ప్రకర్షణాడంబరములతో ! మతము నేడు సరిబుచ్చబడుచు, మానవుని లోక పరలోక పరిజ్ఞానశూన్యుని గావించుచున్నది.

ప్రపంచమునందలి మ త ము ల లో:— విద్యావంతములు మఱియు అనుష్ఠానపథములను ఇరుతెగలుగా నున్నవి. ఏలయనగా, అక్షరజ్ఞానమును విద్యయందురు కాని, అనుభవజ్ఞానమే నిజమైన విద్యయగును. విద్య గలిగియు అనుష్ఠానపథావలంబి కాకుండుట కన్న; అనుష్ఠానపథాన్వితుడై విద్య లేమియే శ్రేయస్కరము. అయినను, విద్య మఱియు అనుష్ఠానపథమును రెండున్నూ కలిగియుండుటయే శ్రేష్ఠము. ఈరెండు గలిగియున్నను, అనుభవజ్ఞుని తోడ్పాటు కలిగియుండనిచో అనుష్ఠానము ఫలదాయి కానేరదు. ఇటులేలన; "ఉద్ధరేదాత్మ నాత్మానం" (భగ, గీ) అనగా:— ఆత్మ; తత్సమాత్మ (సమజీవి) వలననే ఉద్ధరింప బడగలదు. ఇట్లనగా:— గురుత్వద్వారానే ఆత్మోన్నతి నొంద వీలున్నదనుట. మఱియు సాధకదశకు పూర్వము పాతుకొని యున్న స్వభావాటంకములకు, సదుపాయములను ఉపదేశింప వలసియుండును. "శ్రేయాంసి బహువిఘ్నాని" గదా!

ఇంతకు మతమనగా సామాన్యార్థము:— అభిప్రాయము. లేక స్వభావమగును స్వభావమన్ననో కర్మ పరియవసాన ఫలస్వరూపమగుటచే, ఈ స్వభావము ననుసరించునది మతమన జెల్లదు. మఱియు తమకు కలిగియున్నంత అనుభవమాత్రమునే మతమనుచున్నారు గనుకనే! మతములనేకము ప్రభవిల్లుటకు కారణమగుచున్నది. ఇట్లని నైరాశ్యము, లేక నిరాశకు తావీయరాదు. ఏలయన; సహజమతమనగా:— దైవాన్వేషణ విధివిధాన స్వరూపము. దైవము అనుభవైకవేద్యము. మతమనగా:— తానే, తన కొరకైనదే! తాననగా ఆత్మయగుగాని శరీరమాత్రమే గాదు. మతమనగా:— అనుభూతి. ఆత్మానుభవ స్వరూపము. ఆత్మ సాక్షాత్కార

మార్గము. ఆత్మాదర్శ సాధనము. ఏకత్వానుకరణ ప్రయత్నము. జ్ఞానస్వరూపము నొందువిధానము. శాశ్వతానంద పదవినందు పద్ధతియగును. ఇట్లని గుర్తెరుగ గలుగుచో:- మతముపేర సాంప్రదాయాభిమానమునకు లోనై హఠధర్మిత్వము చేకొనబడకుండెడిదే! మఱియు మతధర్మము:- స్వార్థపరుల, లేక విద్యావంతుల చేతి కీలుబొమ్మగానై సామాన్యుల కలవిగాకుండా నుండకుండెడిదేను.

మానవాత్మలన్నియు:- స్వరూపజ్ఞానములే నై యున్నవి. జ్ఞానాన్వేషణయందే యున్నవి. కర్మనొనర్చుటయు, జ్ఞానప్రకాశము నొందుటకొరకే నైయున్నది. గాని; జ్ఞానమును గుర్తెరుగజాలువారు మాత్రము అఱుదైయున్నారు. కర్మయు జ్ఞానముయొక్క మారు రూపమే! అయినను, ఇప్పుడీ కర్మపదము జ్ఞాననేత్రముపై పటీ గట్టుచున్నది. కనుక కర్మ ప్రారంభము జ్ఞానము చివర. అనగా:- కర్మయనునది జ్ఞా నార్జనకు ప్రథమసోపానము (మెట్టు) అని తెలియవలసియుండును. ఇట్లని గుర్తెరుంగక, స్వార్థపరుడై కర్మ నొనర్చువాని కది చక్కగా బుద్ధిని నేర్పగలదనుటను గాంచక తప్పదు. కాబట్టి, పరిశోధనాదృక్పథునకు; వేదాంతమనునదియు జ్ఞానాన్వేషణలోని చివరమెట్టని బోధకు రాకమానదు. ఇదియు జ్ఞానమనబడ జాలదనుటయేగాక, కర్మ మఱియు జ్ఞానమునకు మధ్యన, ఎన్నియో ఘట్టములున్నవనియు అనుభవపూర్వకముగ తెలిసిరాగలదు.

ప్రపంచమొక పాఠశాల. కర్మానుభవమునకై జీవుడిచటి కేతెంచును. గనుక, అర్హతలలో విభిన్నత కలిగియుండుట సహజము. అర్హతకు తగుసూత్రము కలిగియుండవలయు ననుట యును సహజమే! అయినను, తానంటియున్న సూత్రమునే

సర్వస్వమన జూచుట మాత్రము అసహజము. ఏలయనగా:- ఏలాటి అర్హతగలవాడైనను, చేపట్టియున్న దేలాటిసూత్రమైనను తథానుసార వర్తనుడగుచో; అవ్వాలి విషయము తనకే స్వయముగ బోధకురాగలదు. ఇది పలుకుల కందునది కాదు. సిద్ధాంత రాద్ధాంతములచే వివరింప బడజాలదు. మానవునందు సహజముగనే కలిగియున్నట్టి జ్ఞానసంపత్తి:- సాధనవలన అనుభవమున గడింపబడునది. సాధనమూలముననే! సత్యము అనుభవమూలగా వేద్యమగును. ఒకవేళ ఉపకారబుద్ధి ననుసరించి తనకు కలిగిన యనుభవములను గ్రంథస్థమొనర్ప వచ్చును. గాని:- అదియే పరమసిద్ధాంత మనుకొనుటయే! చర్చలకు మూలకారణమై, మానవుని యగాధజలధిన బడవేయుచున్నది. మఱియు ఎటూ తోచని స్థితిదాపరించి, ప్రత్యక్షముగ నున్నదానితో మానవుడు తృప్తి నొందవలసిన గతి దాపరించుచున్నది. ఇందులో:- మానవుడు జగత్సత్యభావముతో జనించుటవలన దేహమునే! తానను కొని తిని, త్రాగి, నిద్రించి, పిల్లలగనుటతో జీవితమును సరి ఋచ్చు జూచుటయు సహజమయ్యె. కావున తెలియవలసిన దేమనగా:-

"ఇష్టదేవ" యను శబ్దముయొక్క వాస్తవిక, శ్రేష్ఠ, ప్రశంసనీయతల నెఱుంగ గలుగు వారీలోకమున చాల అఱుదు. దీనిని గుర్తెరుగ గలుగుచో; ప్రపంచమున గల మతములన్నిటి ముఖ్యావసరము బోధపడగలదు. ఇష్టశబ్దము సంస్కృతధాతువగు "ఇష్" వలన వెడలినది. దీనియర్థము:- ప్రేమ, ప్రియమైన, ప్రేమించు, ఆశించు, సమ్మతించుటలగును. మతముయొక్క నిజోద్దేశము:- దుఃఖమునుండి విడిబడి, శాశ్వతత్వము నొందు

టయే ! గనుక, మనమంపరమును ఆత్మస్వాతంత్ర్యమునే వలయు నందుము. ఈ వొకేయొక తలంపుననుసరించియే, సర్వజగత్తున కర్మాకలాపము లొనర్పబడుచున్నవగుటచే స్వభావమునకు, లేక అర్హతకు తగియున్నట్టిదే ! ఐచ్ఛిక, అభీష్టిత, యథేప్సిత, వాఞ్ఛిత, లేక నైష్ఠికమత మనబడును. ఇది తనకొరకైనది, తన మఱియు తనయొక్క ఈశ్వరపరమైనదిగదా ! ఇదిటులుండగా:-

ప్రపంచము క్రమబద్ధముగ సాగిపోవుచుండుటయు మన కందరకును తెలిసియున్నట్టిదే గనుక, అనర్హతకు తావొసగుచో ఇక అధోగతియే దాని పరియవసాన ఫలితమగును. ఇంతేగాక, సహజత్వమున సులభముగనో ! అసహజమువలన ఒత్తిడిగనో ! వివేకజ్ఞానయుతాత్మయగు మానవుడు; సత్యమునుండి ఉదాత్త సత్యమునకే ఏగుచున్నాడు. దీని ననుసరించి, ఆకాంక్షను మరింత రగులజేయుట మాత్రమే యవసరమగును. కాబట్టి చరమలక్ష్య మగు ఈ మతవిషయమున ప్రబోధకులు:- సాక్షికదృక్పథమున కెడమీయక, ప్రేమోదార, సహానుభూతులతో పని గొనవలయు నను మనవి జేయబడుచున్నదని తెలియుదురుగాక. ఇదిగో ! అతి నిధానముగ గ్రహింపవలయును.

## వేదోపనిషత్తులలో !

బ్రహ్మమునుగురించి బీజాకృతినవేదములు సూచించియే యున్నను, ఉపనిషత్తుల శిక్షణమాత్రము బ్రహ్మజ్ఞానాను భవము నార్జింపజేయుటయే ! గనుక యద్దానిని స్పష్టముగా విశదీకరించినవి:- "ఏకం సద్విప్రా బహుధావదంతి" (ఋగ్వేద, ౧-౧౬౪-౪౬) అనగా:- సత్పదార్థము ఏకమే ! అయినను,

జ్ఞానులద్దానినే వివిధనామములతో పేర్కొనియున్నారలు. ఏల యన ; శాఖలాకులు పూలు ఫలములతో వృక్షము తనలో కలిగి యున్నను బీజము అని పేరొందియున్నదిగదా ! మఱియు:– సృష్ట్యాదిలో నీళ్ళనుండి సశరీరివలె జనించినట్టి ప్రథమతత్త్వమే బ్రహ్మము. (ఋగ్వేద , ౧-౧౨౧-౧) ఇందువలన:- నిజతత్త్వము అద్వితీయమేనని , ఈ పుష్కలముమాత్రము సత్యముకాదనియు తెలియవలయును. (ఋగ్వేద , ౧౦-౧౨౯-౨) బ్రహ్మమొక నిత్య సత్యమైన చక్రబొడ్డు. ఎందైతే , సూర్యునకు కిరణముల వలె సర్వప్రాణులు గుదిగ్రుచ్చబడియుండునో ! (ఋగ్వేద ; ౧౦-౮౨-౬) భూత భవిష్యత్తులందున్నూ కలిగియుండెడు ఈ బ్రహ్మము (పూరుష్) నకు:- సమస్తజగత్తు స్వరూపమైయున్నది. (ఋగ్వేద , ౯౦-౨) సర్వసాధారణముగ జనులకి బ్రహ్మమనునది తెలిసిలేదు. గాని దీనిని కప్పియుంచెడు , అసత్తగు భౌతిక రూప శాఖలనుమాత్రమే వారు తెలియుదురు. (అథర్వణ , వే. ౧౦-౭-౨౧) ఏలయన:– మనుజ , దేవతమొదలగునవి ఈబ్రహ్మము లోనే ! నీటియందు పువ్వులవలె వెరసియున్నవి. (అథర్వణ , వే. ౧౦-౮-౩౪) ఈ సాక్ష్యులు మాయకుసంబంధించిన పునాది సిద్ధాంత వేరులేనయ్యున్నవి. చూడుడు:- ఋగ్వేద , ౬-౪౭-౧౮. యొక్క బృహ , ఉ. ౬-౫-౧౯. లో "ఇంద్రోమాయాభిః పురుష త్రపతే." ఆదిలో సత్పథముతప్ప ప్రాణులు లేకుండెను. అదియే:- భూతములను వెలువరచి , పురుషుని నీళ్ళనుండి వ్యక్తపఱచి రూపమును ప్రసాదించెను. ఈ పురుష్ అనబడినదే ప్రథమతత్త్వము. (ఋగ్వేద , ౧౦-౯)

బ్రహ్మమగు ఈ ప్రథమతత్త్వాధారమున వెలువడిన టి ధారాప్రవాహములే! ఐదు తత్త్వములుగా పేర్కొన బడు నవి: ఇందలి ప్రథమతత్త్వముమాత్రము "అప్రక్త్యం సలీలమ్" అనగా:- నీరేను. (ఋగ్వేద, ౧౦-౧౨౯-3) సలిల్ అను శబ్దార్థము:- గమనమగును. గనుక, ఇది భౌతికనీరుకాదు. ధారాప్రవాహమే క్రమముగా ఘనీభవించి స్థూలనీరుగ స్వరూపము దాల్చును. ఎద్దానినుండైతే, స్థూలజగత్ప్రాణులు కలుగునో! ఇందుచే, వేదమంత్రములభావము బీజప్రాయముని గ్రహింపక, శబ్దములందు చిక్కువడుచో నిజజాత దురూహ్యమగును. ఎటులయన, ఈ నీరే! ప్రాణులకావరణ, లేక శరీరమైయున్నది. (బృహ, ఉ. ౧-౫-౧) మఱియు, ఇదిగో:- నిజముగా ప్రారంభ నీరే! హిరణ్యగర్భుడనగు నాయొక్క జగత్తు. ఇది నీయది గూడాను (కౌషీ, ఉ. ౧-౭) మొట్టమొదట నీళ్ళతోనే ప్రథమ పురుష ఉండెను. (కఠ, ఉ. ౪-౬) అదియే హృదయగుహాయందుండునది. (ఛాందో, ఉ. ౮-౧-3) మాత్రిశ్వః:- జగత్ ప్రాణి ఈ నీళ్లయందే వెలసియుండెను. (ఈశో, ఉ. ౪) అదియే:- నీటిచే జీవబీజమును పృథివియందుంచెను, లేక విత్తెను. (నారాయణి; ఉ. ౪) మఱియు, ఐతరేయోపనిషత్తీ నీళ్ళను నానావిధముల పేర్కొని; అంభస్:- దివి, లేక దేవలోకమునకుత్తమ ఆశ్రయముని. మరీచన్ (కిరణములు):- అంతరిక్షమనియు. మర్:- పాతాళము, లేక పృథివియనియును. అప్:- నీరనియునూ ప్రబోధించినది. అనగా, జగత్ ఆద్యంతములు నీరేనని తెలియుచున్నది.

"జన్మాదిఅలస్యఃయథాఇతి" అనగా:- దేనినుండైతే, ఈ జగత్తు మొదలగునవి ఉత్పత్తియగునో! అదియే బ్రహ్మము. (బ్రహ్మసూత్రము) దేనివల్ల ప్రాణులు ఉత్పత్తియై జీవించి, తిరిగి దేనియందు లయించునో! అద్దానినెఱుంగ ప్రయత్నించవలయును. బ్రహ్మమదియేను. (తైత్త, ఉ. 3-౧) ఈ బ్రహ్మమే జగత్తును సృజించి ప్రవేశించెను. (తైత్త, అ. ౬, అ) ఎటులైతే, అగ్నిహోత్రమునుండి అసంఖ్యాక మిణుగురులు బయలువెడలునో! అదేవిధముగ వివిధతత్త్వములు, అక్షర బ్రహ్మమునుండి ప్రకటింపబడి తిరిగి యందే లయమగును. (ముణ్డా, ఉ ౨-౧-౧) "అనేనజీవేనఅనోప్రవిస్యః" అనగా:- ఈ జగదోత్పత్తికి కారణము బ్రహ్మమే! అదియే ఇందులోప్రవేశించియున్నది.' (ఛాందో, ఉ. ౬-3. ౨) ఆదిలో హిరణ్యగర్భయను ప్రథమపురుషు ఉద్భవించెను. అదియే! కర్మఫలపరిపాకమునకుగాను ఈవిశాలబ్రహ్మండమునుపరివ్యాప్తపఱచి ముదుగజేయుచుండును. (శ్వేతా, ఉ ౫) ఇదిటులుండగా :-

బ్రహ్మము. లేక పరమేశ్వర:- "అమృతంసత్యేనచిన్నమ్" "సత్యస్యఃసత్యమ్" (బృహ, ఉ. ౨-౪-౫-౭-౯) అనగా:- అద్దానిని గుర్తెఱింగిననే జగత్తత్త్వము తెలియునగును. ఏలయన, అయ్యది జగత్తుకాదు. జగత్తునకది భిన్నముగనూలేదు. అది సత్యమైన ఆత్మలకాత్మయైనది, లేక ప్రాణులకు ప్రాణమైనట్టిది. "జ్యోతిషాంజ్యోతిష్" (కఠ, ఉ. ౫-౧౫) అనగా:- జ్యోతులకు జ్యోతి స్వతఃజ్ఞానమేగాక స్వయం ప్రకాశవంతమైనది. "నహి ఏతస్మాద్ ఇతినేతి అన్యత్పరమ్అస్తి" (బృహ, ఉ. ౨-3-౬)

అనగా:- పరమసత్యమగు బ్రహ్మమునెడ, నేతి యనుటకు మించినవివరణము మఱియొండులేదు. గనుక "నఇతి, లేకనేతి" యనుశబ్దమును "నఏవమ్" అని తెలియవలయును ఏలయన, మనోమేథస్సులద్దానిని గుర్తెరింగి గ్రహింపజాలవు. "తత్సత్యం సఆత్మాతత్త్వమసి" (బృహ, ఉ.౫-౪; ౨-౧-౨౦) అనగా:- బ్రహ్మము సత్యమని, ఆత్మగూడా సత్యమేననియు, అదియే ఇదియైయున్న దనియును ఇందులకే బ్రహ్మమనగా:- "సత్యస్యసత్యమ్" జగత్తనగా:- స్వరూప నామమాత్రమేనని నిరూపింపబడినది. మఱీ బ్రహ్మమును:-"విజ్ఞానమానందమ్" "సత్యంప్రజ్ఞానమానందమ్" అని బృహ, ఉ. (3-౯-౨౮) తదుపరి "సత్య జ్ఞానమనంతమానందమ్" లేక "సచ్చిదానందమ్" అనియును బ్రహ్మమునకు శ్లాఘనీయ సవిశేషప్రశంసగా వర్ణింపబడినది. (సర్వోపని, సా. శ్లో ౨౧ లో) అనగా:- ఏదైతే, దేశకాలనిమిత్తములచే మార్పునొందక స్థిరస్థాయిగా నుండునదియో! అదియే బ్రహ్మము, లేక పరమేశ్వరత్వమై "తత్త్వమసి" యను లక్షణముగలదనుట. మఱీ భావమే! నరసింహతా, ఉ. ౪-౯-౭. రామపూర్వతా, ఉ ౯౨. రామోత్తరతా, ఉ. ౨-౪-౫. ల లోననూకలదు. మఱి ద్దానినే! స్వప్రకాశ్ స్వయంజ్ఞాన్యాన్ అని పేర్కొని, దీనికి వివిధబిరుదులొసంగబడియున్నవి. చూడుడు:- "సాక్షిన్" (శ్వేతా, ఉ. ౬-౧) "పరిద్రష్ట" (పశ్న, ఉ. ౬-౫) "సలిల్" (బృహ, ఉ ౪-3-3౨) ఇంతేగాక; కల్ప కల్పాంతరములు సమాప్తినొంది ఏ ప్రకాశమున్నూ లేనిసమయమున, నిశ్చలకాంతియందు ప్రకాశముగనుండునదియు ఈ బ్రహ్మమేననియూగలదు. (ఛాందో, ఉ. ౮-౪-౨ లో) మఱియును:- "తస్మిన్ఇదంసంచః విజయాతిసర్వమ్"

(వా జ సే నై, సం 3౨-౮) అనగా, ఈ సృష్టి బ్రహ్మములోనే లయించి తిరిగి ప్రకటింపబడును. ముణ్డ, ఉ. ౧-౧-౭. లో:– బ్రహ్మమును సాలీడునకుపోల్చి, దారమును ప్రకటించి తిరిగితనలోకి గైకొనుచుండునని గలదు, ఇట్లనగా:– నానావిధప్రాణులీ అక్షర బ్రహ్మమునుండి వెలువడి తిరిగి అందేలయించునసుట (ముణ్డ, ఉ. ౨.౧.౧)

ఈవిధముగ ప్రబోధములుండుటకు కారణము:- కల్ప దృష్టియేనగును ఏలయన, ఉపనిషత్తులు:- జగత్తునకు ఆదిని అంగీకరించునుగాని, బ్రహ్మమును అనాది అనంతమనుచున్నవి గదా! దీనినిబట్టియే వేదాంతము తన శిక్షణలో:- "సంసారస్యఅనాదిత్వమ్" అనగా జగత్సంసారమనునది ప్రవాహరూపమునఅనాదియైయున్నదని ప్రబోధించును. ఇదెటులనగ, ప్రాణులయొక్క శ్వాస బహిర్ముఖమగుటయేగాక అది అంతర్ముఖమగుచుండుటయు సహజమేగదా! ఈమాదిరిగానే, బ్రహ్మమునందునూ బోధపడి యుండనోపు. ఇది మొదటిభావము. ఇక రెండవభావము:- కర్మ ఫలానుభవసమస్య. ఏదైతే, రెండవజన్మలందు పొందబడునో!

బ్రహ్మమువల్లనుండి మొదట తత్త్వములు ఉద్భవించెను. వీటిచే యేర్పడినట్టి శరీరములందు వ్యక్తిగతాత్మలు ప్రవేశించెను. ఈ భావము, ఇతిహాసమువలె:-ఋగ్వేద; ౧౦-౧౨౯-3. ఐతరే, బ్రా. ౫-3౨. శతపథ, బ్రా. ౧౧-౫-౮. ల లోననూ కలదు. మరియు ప్రశ్న, ఉ 3-3 యందు:- బ్రహ్మమువలన ప్రాణులుద్భవించును ఎటులైతే, పురుషునికి ఛాయ, అద్దమున ప్రతిబింబము ప్రత్యక్షమగుచుండునో! ఇటువలెనే, ఆత్మలు:– మనో

"ఆకాశ్ అస్తల్ లింగాత్" (బ్రహ్మ, సూ. ౧-౧-౨౨) అనగా పృథక్త్వమున కవకాశముతేనట్టిదగు ఆకాశమును బ్రహ్మమునకు సంబోధముగాగైకొని సాధింపబడియును. ఏలయన, "తస్మిన్ యదంతర్" ఆకాశాంతర్గతముననుండునదే! మాన్ప నొందనట్టి అమరాత్మ. (ఛాందో, ఉ. ౮-౧-౧) మఱియు, బ్రహ్మము:- ప్రాణానందాకాశమైయున్నది. (ఛాందో, ఉ. ౪-౧౦-౫. కఠ, ఉ. ౬-౨. ప్రశ్న, ఉ. ౩-౩) బ్రహ్మము:- ఆకాశమునందుండి యద్దానిని క్రమముగా నడుపుచుండునదే గాక, అయ్యది సత్యమైన నీయొక్క అమరాంతర్యామ ఆత్మయే నయ్యున్నది. (బృహ, ఉ. ౨-౧-౫, ౩-౭-౧౨) ఈ కారణముల ననుసరించి:- ప్రాణముమను మఱియు శబ్దమును, లేక ఆకాశమును బ్రహ్మమునకు చిహ్న, లేక ప్రతీకములుగా అంగీకరించుటతో; ప్రాణమే ప్రజ్ఞ యని అద్దానికి "ప్రజ్ఞానం బ్రహ్మ" యను బిరుదొసంగినది. (ఐతరే, ఆ. ౨-౧-౨) మఱియు:- ఓంకారధ్యానము. అవినాశి బ్రహ్మమును చేర్చును. ఏదైతే, జ్యోతులన్నింటికి పుట్టినిల్లైయుండి యున్నదో! (మైత్రే, ఉ. ౬, ౨౪. నాదబిం, ఉ. ౧౭) ఒకవేళ, బ్రహ్మమువల్లనుండి సూక్ష్మశబ్దాది తన్మాత్రలు వెలువడి, ఆకాశాది స్థూలపంచమహాభూతములుగా ప్రభవిల్లి, జగద్రూపము దాల్చినట్టి వివరణము అవసరమగునేని:- ప్రశ్న, ఉ. ౪-౮. మైత్రాయ, ఉ. ౩-౨. ప్రాణాగ్నిహో, ఉ. ౪. మహా, ఉ. ౧. వేదాంతసార (౧౨౮) పంచీకరణ విధిలోననూ గాంచవచ్చును.

యజ్ఞమనునది:- పితృయానమార్గము. ఈఆచారానువర్తనచే జననమరణ ప్రవాహమునకు అంతములేదు. గాని, ఈ పరిశ్రమ వలన పితృలోకము మాత్రము లభితమగును. ఇంక దేవయాన

మార్గమగు జ్ఞానార్జనవల్ల యన్ననో ! దేవలోకమునొంది మోక్షము వడయనగును. చూడుడు:- బృహ, ఉ. (౧-౫-౬, ౬-౨-౧౬) ఛాందో, ఉ. (౫-౧౦-౩) ప్రశ్నో, ఉ. (౧-౯.) ముణ్డ, ఉ. (౧-౨-౧౦.) ఇంతేగాదు, పంచయజ్ఞములు అనునవి ఆత్మకు సంబంధించినవి. (౧-౪-౬) యజ్ఞముయొక్క త్రయాగ్నులు:- ఆత్మయొక్క తేజోప్రకాశప్రకటనలేను. (ఛాందో, ఉ. ౪-౧౧-౧౪) వాక్కు, ప్రాణము, నేత్రము, మనస్సులను నాలుగు:- యజ్ఞమునకు పారోహితులు. చూడుడు:- బృహ, ఉ. (౩-౧ ౧-౫-౨౩) ఐతరే, ఆ. (౩-౨-౬.) కోష్తగీ, ఉ. (౨-౫.) మహా నా, ఉ. (౨౪) ప్రాణాగ్ని హెూ, ఉ. (౩-౪.) యజ్ఞమనునది జ్ఞానమే నయ్యున్నది. (తైత్త. ఉ. ౨-౫) మఱియు, మెలకువతోనున్నను నిద్రించిననూ! ఉచ్ఛ్వాస నిశ్వాసలనునవి :- అద్యంతము లేక సదాక్రమముగ సాగిపోవుచునేయుండు నగుటచే ఈ యజ్ఞమే స్థిరమైనది. ఇందుకు వ్యతిరిక్తమైన యజ్ఞములన్నియు అస్థిరములైనవేను. మఱియవ్వాటియొక్క ఉనికి కర్మవరకే నిలచిపోవును. ఇకా్కరణమున ప్రాచీనకాల ఋషులీలాటి స్థూలాగ్ని హెూత్ర యజ్ఞముల నొనరింపలేదు. (కోష్తగీ, ఉ. ౨-౫.) ఏ ఆహారమైతే భుజింపబడునో ! అయ్యది, దేవతలకు నివేదనగా అర్పణయగును. (బృహ, ఉ. ౧-౫-౨) ఎటులయన, పంచప్రాణేంద్రియముల విధులు:- ప్రకృతియందల్లి ఐదు విధముల దేవతలు మఱియు లోకములకు నివేదితములై యున్నవి. (ఛాందో, ఉ. ౫-౨-౨. మైత్రే, ఉ. ౬-౯.) ఇంముచే, ఏ ఆహారమైతే చేతికి అందుబాటున నుండియుండునో ! అదియే యజ్ఞమునకు యుక్తమైన సామగ్రియైయున్నది. (ఛాందో, ఉ. ౫-౧౯-౧.) ఇంక తదుపరి

వెలువడినట్టి యుపనిషత్తులు:_ బుద్ధధర్మ ప్రచారమును అతికట్ట నెంచి వేరొక విధముగా ప్రబోధించినవని తెలియవలసియుండును.

తపస్సునుగురించియు ఇంచుక చవిగొందము:- సృష్టికర్త తపము నొనరించెను. ఏలయన, ఈ జగత్తనునది తపనవలననే ప్రకటింపబడినది. (ఋగ్వేద, ౧౦-౧౯-౧) ఈ తపోబలముచేతనే అల (స్కంభ్) గానేర్పడి జగత్తుగానంతట పరివ్యాప్తమయ్యెను. (అథర్వణ, వే. ౧౦-౭-౩౬) ఈ తపస్సువలననే ఆది ప్రారంభ నీటి తరంగడోలికలాడుచుండెను. (అథర్వణ, వే: ౧౦-౭-౩౮) తపస్సను దానివలననే! బ్రహ్మచారి తనగురువును ఆనందపఱచి సూర్యునివలె ఉన్నతోన్నతినొంది బ్రహ్మమగును. (అథర్వణ, వే. ౧౧-౫) తపముతోనే! రాజు తన రాజ్యమును సక్రమముగా పాలించును. దేవత మృత్యువును తప్పించుకొనును. ప్రాచీనకాలమున సప్తఋషులీతపస్సే యొనర్చిరి. (ఋగ్వేద, ౧౦-౧౦౯-౪) తపస్వి, లేక తాపసియొక్క జీవితము గృహస్థులకాదర్శ ఆదరణీయముగా నుండెను. మఱియు తపమునొనరించుటచేత మనుష్యుడు, ఐహిక (సంసార) జీవితమునకు లోబడియుండుటను జయించును. (బృహ, ఉ. ౨-౪: ఛాందోగ్యధర్మస్కంధ, ౨-౨౩ బ్రహ్మజ్ఞానము తపస్సువలననే లభించును. ఏలయన, తపస్సే బ్రహ్మము. (తైత్త, ఉ. ౪-౩) తపస్సే బ్రహ్మజ్ఞానమునకు పునాదియైయున్నది. (కేనో, ఉ. ౩౩.) బ్రహ్మజ్ఞానమే శ్రేష్ఠమైనవిద్య ఇయ్యది తపస్సు వశముననేయున్నది. (శ్వేతా, ఉ. ౧-౧౫-౧౬. ౧౬-౨౧.)

ఇంక మనము ఉన్నతోన్నతినొందుటకు అత్యవసరవిషయ్యమును కనుగొందము:- శిష్యత్వమువహించి పూర్తి సంవత్సరము

గురునియొక్క గృహమున నివాసిగానుండనిచో; మఱియు ఆసక్తిచే స్వయముగా గురునితో మనవిచేసికొనకుండునేని; బ్రహ్మజ్ఞానారన కొఱకైన శిక్షణ నెంతమాత్రమైననూ గఱపరాదు. (ఐతరేయ బ్రాహ్మణ, ౩-౨-౬-౯) ఏలయన, ఈ జగత్తునకు భూతము (దయ్యము) పట్టియున్నది. మఱియు, అంధకారముచే కప్పివేయ బడియున్నది. ఈకారణమునకు లొంగి, ఎవరైతే తమ ఆత్మలను హత్యగావించియున్నారో! (ఏక ఆత్మపరిజ్ఞాన మిసుమంతేని లేకుండా జీవితమును గడుపుచున్నారో!) వారలు సర్వధ్వంసమై పోవుచున్నారలు. ఇంతకీ జ్ఞానమనునది తార్కిక విచారమువలన లభించునదియుగాదు. ఇయ్యదిగురునిముఖతమాత్రమే! రాబడి, అనుష్ఠానానుభవమువలనగడింపబడునది. (ఈశో, ఉ ౩)మఱియు, అర్హుడైన పితానకొమారునికి, లేక విశ్వసనీయశిష్యునకుమాత్రమే! బ్రహ్మము ఈ బ్రహ్మాండమునకు సూర్యుడని ఉపదేశింపదగును. దీనికిబదులుగా చక్రవర్తిరాజ్యమొసంగిననూ నిరర్థక పనికిమాలినదేయగును. ఇట్లెందుకన, గురుత్వమునుండి రాబడినట్టి జ్ఞానముమాత్రమే! గమ్యమగు మోక్షమును వడయజేయును. చూడుడు:- ఛాందో, ఉ. (౩-౧౧-౫, ౪-౯-౩) బృహ, ఉ. (౬-౩-౧౨; ౨౦-౧-౧౪.) మఱియు ఈలాటిదృష్టాంతరములను:- కోష్తగి, ఉ. (౧-౧-౪-౯.) ప్రశ్నో, ఉ. (౧-౧) ముణ్డ, ఉ. (౧-౨-౧౨) ల లోననూ గాంచవచ్చును. ఇంతేగాదు, గురునితోడ్పాటునగాక గమ్యము లభింపజాలదని ప్రబోధించుచూ:- ఇందులకు సత్వశుద్ధి, ఇంద్రియమనోనిగ్రహము, శాంతస్వభావము, సహన శక్తి, ఏకాగ్రత లనునవి ఆత్మవశపరములనియూ బోధింపబడి

యున్నది. చూడుడు:- కఠ, ఉ. (౨-౮, ౨-౨౪.) శ్వేతా, ఉ. (౬-౨౨) మైత్రే, ఉ. (౬-౨౯) ముణ్డ, ఉ. (౩-౨-౬) మహానా. ఉ. (౧౦-౨౨) కైవల్య, ఉ. (౩-౪.)

ఓమ్ తత్సదోమ్



## ౨ వ ప్రకరణము

# మత వైఖరులు

మతమనగా:- (౧) అజ్ఞానమును తొలగించి, దుఃఖనివారణగావించి, చావుదశను దప్పించి, శాంత్యానంద స్థిరత్వముల నొనగూర్చునది. గనుక, అమూల్యమైన మానవ జీవితమునకు మతము విస్తారార్థముగలదై యున్నది. (౨) మనోనిగ్రహశిక్షణను వదయజేసి, జన్మోద్దేశమును సాధింపజేసి, ఆత్మసంతృప్తిని గలుగ జేయునదగుటచే, ఈ మతమనుదానికిగల విలువతోసమానమైనది మఱియొకటిలేదు. (౩) తన నిజత్వమును బోధపఱచి ఆత్మ సామ్రాజ్యాధిపత్యము నొనగూర్చునదేగాక, సర్వాంతర్యామిని తన యందే గనజేయునదికాబట్టి:- ఆర్యావర్తమునందు ప్రతివారికిని, మతముపేర ఎల్లప్పుడును పూర్ణస్వాతంత్ర్యముకలదు (౪) మానవ ప్రవృత్తియందు విభిన్నఅర్హత కలిగియుండుట సహజమేనగుటచే, ఎవరికినచ్చినసూత్రమును వారవలంబించియున్నను:-శంకాసమాధానమూలమున పనిగొనిరేగాని భారతీయులు స్వమతముపేర వైరభావమునకేగాని, రక్తస్రవంతులకేగాని, ఏనాడును తావొసంగలేదు.

హిందూమతమునందు నాలుగు ప్రధానసిద్ధాంతములు కన బడుచున్నవి. వాటినిచ్చట గమనించెదము. ఇందలి, ఒకటవ సిద్ధాంతమేద్దనగా:- జీవేశ్వర ప్రకృతులగు మూటియొక్క అస్తిత్వ ముల నంగీకరించుచుండియు ఈశ్వరుని సర్వవ్యాపకుడనునది. అయితే:- ఎచ్చట ప్రకృతితనయొక్క ప్రత్యేకతనమును కలిగి

యుండునో! అచ్చట ఈశ్వరఉనికి కవకాశముండదు. ఎచ్చట జీవతనముండునో ! అచ్చట ఈశ్వర ప్రకృతుల ప్రత్యేకతనము లుండజాలవు. ఎచ్చటఈశ్వరతనముండునో ! అచ్చటజీవప్రకృతుల ప్రత్యేకతనములలో మార్పురాగలదుగనుక:_ ఈ మూడును తమ స్వస్థానములందు సీమిత, పరిమిత, లేక అపూర్ణములైయుండగల వగుటచే ఈ మూటిలో నెద్దియు సర్వవ్యాపకమనబడజాలదు. ఏల యన:– సర్వవ్యాపకమైనది సదా ఏకమేనై యుండజెల్లునుగాని, అస్తిత్వము లనేకముండుననుటకెట్లు పొసగగలదు ? కాబట్టి దీనిని పతితసిద్ధాంత మనవలసియుండును.

రెండవసిద్ధాంతము:- ఈశ్వరుడులేడు, పురుషప్రకృతులు శాశ్వతలుగా కలవని పేర్కొని జీవినే! పు రు ష డు ; లేక ఆత్మ యనుటేగాక పురుషప్రకృతుల కలయికవలననే రచనఏర్పడు నంటూ ; జీవులను ప్రకృతినుండి విడివడు హితోపదేశము చేయు చుండును. ఈ సిద్ధాంతమించుక ముందడుగు వేసినను, జీవప్రకృ తులయొక్క ఏకటప్రసంగమున బడియుండుటచే దీనివారలు:_ ఈశ్వరఉనికియొక్క అవశ్యకతను గుర్తింపజాలకున్నారు. వీరు జీవులను అనేకమనుచు, ప్రకృతినిమాత్రము ఏకమందురు. గాని; ఆకాశాది అనేకభూతగర్భితమైయున్న ప్రకృతిని ఏకమన గలుగుచున్నప్పుడు, జీవకూడికను ఏకమనియేల అనకూడదో ! ఆ యేకమును ఈశ్వరుడనుటలో తప్పేముండును ? ఏకమునుండి గాక అనేకమనుట ఎట్లు పొసగగలదు ? అయినను, ఎచ్చటరెండు అస్తిత్వము లుండునో ! అచ్చట సర్వవ్యాపకత మరుగువడి, లేక మాయమైపోగలదు. గనుక రెండున్నూ అశాశ్వతములేయనజెల్లును

కాదా ? ఒకవేళ రెండును శాశ్వతములేయగుచో, వానికలయికయు శాశ్వతమేయగుటచేత విడివడనేరజాలవనుట నిక్కమేయగును. లేక:- అయ్యవి రెండును అస్థిరములేనైయుండునేని, స్థిరాధార రహితముగ వానికలయికకు వీ లుం డు న ను ట అసంభవమే యగును. కావున, దీనిని విముక్తికి తావులేని సిద్ధాంతమనవలసి యుం డు ను.

మూడవ సిద్ధాంతము:- జీవుడననొక ప్రత్యేకవస్తువు కాదను టయేగాక ప్రకృతి, మాయ, లేక భౌతిక వస్తుకలయిక వలననే! వివిధ జీవులేర్పడి వ్యవహరించుచునను సిద్ధాంతమిది. ఎటులైతే బత్తెపేడను, గాడిద మూత్రమునందు కలుపబడగా అద్దానినుండి తేళ్లుజనించునో! అనుచుండుటచే దీనియందు సందేహానుమానము లకు గొప్ప తావున్నది. అదెటులనగా:- ఈ సిద్ధాంతావలంబులు ప్రకృతిని అనాదియందురగుటచే నిందులకు సందేహ మణుమాత్ర మైననూలేదు గాని, భౌతికవస్తుజాలము యందు స్వతంత్రముగా కదలిక యెట్లు సంభవించును ? పరిణామదశ యెటుల ప్రాప్తించ గలదు ? దాని విభాగములను వొకచో కలుపువారెవరు ? కాబట్టి:- పరమాత్మాంశమై ప ర గి ప్రకాశమానుడై యున్నట్టి సూర్యుని గాంచుచుండియు; వాడు ప్రసరింపజేయు వెలుతురుతో పనిని గొనక జీవితమునే గడుపజాలకుండియు; ఆత్మయొక్క ప్రకటనా స్వరూపమే! ప్రకృతియని తెలియజాలునంతటి ప్రజ్ఞలేక; వెలు తురులో గుడ్లగూబవలె క ను లు కలిగియుండియు గ్రుడ్డిదానిగ వాకొనునట్లున్నట్టి దీనిని:- వికటవాదమునకు లొంగి మోసగించు సిద్ధాంత మనవలసియుండును.

నాలుగవ సిద్ధాంతము:- ఒకేనొకతత్త్వము తప్ప మరేదియు లేదనుటయేగాక అద్దానిని బ్రహ్మమని పేర్కొనుచు, "ఏకోబ్రహ్మ ద్వితీయోనాస్తి" యను ఈ సిద్ధాంతము జగత్తున ప్రబలమైనదేను. దీనిని సత్యమనుటయు నిస్సందేహమే! నిజముగ ఉన్నదొకటే తత్త్వము. ఈ ఏకతత్త్వప్రకటనాస్వరూపమే ఈజగత్తంతయును. ఇందలి ప్రకృతికి ఉనికియే లేదు. ఇయ్యది, ఊహననుసరించి యింతవరకు సత్యమేయైనను; మాయకు ప్రత్యేకమైనట్టి ఉనికి లేకున్నను; సామాన్య నరునికిది బోధపడజాలని సిద్ధాంతము. ఏలయన ప్రపంచ అస్తిత్వము వీనియొక్క దృక్పథమున నిజముగ గోచరించుచున్నది గదా! మఱియు బ్రహ్మము ఏకమేగాని, ఆ ఏకముయందు మాటలాడుటకు వీలులేదుగదా! ఇద్దరుంటేనేగదా ఒకరితో మరొకరు మాటలాడుకొనుటకు వీలుండును. ఇందుచే, దీనిని నిరూపించ జూచువారు సామ్యమును గైకొనక యెటుల తప్పగలదు? గైకొనుచో ద్వంద్వమేర్పడి అస్సలు సిద్ధాంతమునకే కొట్టుకలిగి, హారతికర్పూరమువలె ఏకత్వవాదము నామరూపములు లేకుండా యగుట తప్పదు. కావుననే! దీని నవలంబింప దలంచువారు, సందిగ్ధావస్థకులోనగు చున్నారలగుటచే యీ సిద్ధాంతము:- తమ వాదోపవాదములలో యుక్తులబన్ని గెలుపొంద జూచుట మాత్రముతో ముగియుచున్నది. ఇంతకు బ్రహ్మమనగా:- అభివృద్ధినొందు, మననను గావించుటయను రెంటితనమును కలిగి యున్నట్టి పరమతత్త్వము గదా!

ఈ నాలుగు మతసిద్ధాంతములేగాక ఐదవసిద్ధాంత మొకటి యున్నది. ఇయ్యది సహజసిద్ధాంతము. మఱియు సాధు, లేక సంత్ సిద్ధాంతము. దీనినే "సంత్‌మతము", లేక శ్రీగురుమత మందురని

తెలియవలయును. ఇది వాదోపవాదముల కిచ్ఛగింపదు. సహజముగా కలిగియున్న దాని నుండజూచుకొనజేయు నిజమైన ఆస్తిక సిద్ధాంతమిది. ప్రపంచకార్యము లొనర్చుచుండుచో కాలానుగుణ్యముగ తనయందే సత్యముయొక్క జాడ బోధపడగలదనును గాని మాటలతో, యుక్తులతో, చర్చలతో పనిగొని నిరూపింప నొల్లని మతసిద్ధాంత మిదియే నై యున్నది. అస్తిత్వమును:- బ్రహ్మః, ఈశ్వరః, సంత్, లేక గురుత్వమని తలంచుట కంగీకరించుచు, ఈ విధముగ జ్ఞాపకమందుంచుకొమ్మని ప్రబోధించును:- సత్, లేక అస్తియనునది ఆధారమాత్రమై యుండునదే యగును. ఒక వేళ, దీనిని బ్రహ్మమనుచో బ్రహ్మతనమును విడియెటులుండ గలదు? గురుత్వమనుచో గురుతనముతో యుండును కాదా? సత్ యనుచో, సత్‌యొక్క సత్తా (విశేషణ) భావము తనంతలదే తనలో పొడచూపును. నామముండుచో దాని వెనువెంట రూపమున్నూ కలిగియుండు నగుటచే, ఈ సత్తాయే విశేషణమన బడును. సంస్కృత శబ్దమగు దీని అర్థము "గుణ" మగును. ఈ విశేషణమనునదియే మాయ, లేక ప్రకృతియని వాడుకలో ప్రయోగింప బడుచున్నదే గాని; ఆధారముతో ప్రకృతీదార్ సదా వెలసియే యుండును. ఎటులనగా:-

మనము మనుష్యులమయ్యు మనుష్యతనమును వీడి యుండజాలముగదా! కాబట్టి అనుభవజ్ఞులగు సాధు, సంత్, లేక సత్పురుషులీ విధముగ ప్రబోధించి మతవిమర్శన మఱియు వివాదలకును తావివ్వక ఈ యంశము నిటుల సులభసాధ్యముగా నొనర్చియున్నారు. ఇంతకు దార్ ననుసరించిననే ఆధారము బోధ పడగలదగుటచే, విశేషణమగు ప్రకృతిని (ధార్‌ను) పొరపాటున

నైనా అగౌరవించరాదు. దానియెడ ఉపేక్షాభావము మాత్ర మత్య వసరము. ఏలయన, ప్రకృతియనునది సత్‌యొక్క మార్పునొందిన స్వరూపమే యగునుగదా! బలమునట్టుంని బలవంతుని ప్రత్యే కముగ గాంచజాలుదుమా! ఒకవేళః– సత్‌నుండి అస్తిత్వమును (విశేషణమును) వేరుపరచ జాలుదుమేని, అయ్యది నిర్గుణబ్రహ్మ మనబడును. గుణసంయుక్తముగ గాంతుమేని, సగుణబ్రహ్మ మగును. గనుక, సగుణ నిర్గుణముల సారాంశమింతయే నయ్యు న్నది. మఱియు, ఎటులైతే మనము మనయొక్క మనస్సుయందు సర్వవ్యాపకులమై యున్నామో, లేక మనమనస్సు పిండశరీరము యందు సర్వవ్యాపకమై నాటకమాడుచున్నదో! అటులే ఈ బ్రహ్మాం డాది నాథుడగు పరమేశ్వరుడు, ఏకమయ్యు సర్వకాల సర్వావస్థల యందును సర్వాంతర్యామియై యున్నాడని తెలియవలయును. ఇదిగో గమనింపుడుః–

బ్రహ్మముః– అధారము, ప్రకృతిః– ధార్, (ప్రకాశ, లేక కిరణప్రవాహము. ఈ ప్రవాహమెల్లప్పుడును వలయాకృతిన ప్రవ హించు చుండును) దార్ మఱియు అధారసంబంధమున చైతన్య గ్రంథులేర్పడును. ఇయ్యవియే జీవులనబడును. ఇందుచే, అధార మునుః– జాతి (విశేష్యము) అనియు; ధార్‌నుః– గుణము, లేక విశేషణమనియు తెలియవలయును. మన శరీరమునుండి శ్వాస ఎటుల వెడలునో, అటులే అధారమునుండి ధార్ వెలువడును. ఇదియే! ఈశ్వర, జీవ, ప్రకృతి సంబంధము. అసలు తత్త్వము ఒకటెయైనను, ఈ తత్త్వమూలముననే సమస్తరచన ఏర్పడు చుండును. అనగాః– ధార్ అధారముల కలయికచే ఈ జగత్తు ఏర్పడి వ్యాపించుచున్నది. దీనియొక్క గతి, స్థితి, దశ, లేక,

విలంబన సర్వవ్యాపకమైనది. ఎప్పుడైతే, థార్ తిరిగి ఆధారాభిముఖమగునో! అనగా:– ఇఱువైపుల ప్రభావమధ్యన కలయిక సంభవించుటవలన, జీవజంతువు లేర్పడునగుటచే నెంతవరకివి థార్ననుసరించి యుండునో! వీనికి జననమరణము లుండును. ఎప్పుడైతే ఆధారమునొంద గలుగునో జన్మరాహిత్యమగును. ఇంతకు జనన మరణములనునవి:– తన సత్యదృక్పథమును వీడి అహమ్మమలకు లోబడుటవలననే కలుగును. వ్యష్టి థార్ మఱియు ఆధారకలయికచే బుద్ధి ఏర్పడును. మనస్సు, చిత్తము, అహంకారము లనబడునవి ఈ బుద్ధియందిమిడి యుండును. దీని నుండియే జ్ఞానేంద్రియములు ఉత్పత్తియగును. వీటికి లోబడుట వలననే, నా నీ తనము జనించుచుండుననియూ గ్రహించవలసి యుండును. ఇక మహర్షివరేణ్యులయొక్క స్వానుభవ నిర్ధారిత నామములను, సంస్కృత కోశమునందలి వాటియొక్క అర్థముల నిచ్చుట గాంచుడు:–

(౧) ఓమ్:– ప్రాకృతి, లేక ప్రక్రియయొక్క సారాంశమగు అ + ఉ:– ఔ దీనియొక్క అర్థము నిస్స్వరము, లేక పరివ్యాప్తిత. మ:–మనన, లేక చింతనయగును.

(౨) బ్రహ్మః:–బ్రహ, లేక సంస్కృత వ్రః యనగా; అభివృద్ధినొందుట, లేక చైతన్యము. మ:– మనన, లేక చింతనయగును.

(3) ఆత్మ:– ఆ + అత్ యన కదలిక, లేక చైతన్యము. మ:– మనన, లేక చింతనయగును.

తెలిసినదా! అయితే, ఎచ్చట కదలికయుండునో, అచ్చట శబ్దమేర్పడును. (అది స్థూలమో, లేక సూక్ష్మమో యగుగాక

ఎచ్చట శబ్దముండునో, అచ్చట స్పర్శకలుగుటయు; స్పర్శవలన భావమేర్పడి స్వరూపము దాల్చుటయు, లేక ఒత్తడియగుచో, కాకనిచ్చుటయు సంభవించగలదు. తదుపరి అది యేలాటిదను రసము వేద్యమగును. దానిచే రుచి, లేక గంధము ననుభవింప నగునుకాదా? కావున ఈశబ్ద స్పర్శ రూప రస గంధములను తన్మాత్రలే! ఘనీభవించి స్థూలరూపమునొంది, ఆకాశాది పంచమహాభూతములుగా ప్రభవిల్లినవని తెలియవలయును. ఇయ్యవి:- సత్ యొక్క అస్తిత్వమగు సత్తా లేక ప్రకృతి (త్రిగుణాత్మక) నుండియే కలిగినవగుటచె, వాటియందవి పెనగొనియుంటయు సహజమే గనుక! ఇరువదినాలుగు తత్త్వములుగ నేర్పడి జగద్రచనాస్వరూపము దాల్చినది. ఈ ప్రపంచము:- మార్పునొందుతూ స్వరూపము దాల్చినదగుటచే, ఎల్లప్పుడును మారుచునేయుండును గాని; దీనికి నాశము లేదనియూ గ్రహించవలసియుండును.

పరమార్థమనగా:- పరమ అర్థము. పరమ అర్థమనగా:- ఉన్నతోన్నతమైన అర్థము. అదియే! ఆత్మ. ఆత్మాన్వేషణమునే పరమార్థమందురు. ఆత్మయేనై యుండువానికి సాధనే అవసరముండదుగాని:- ఆధార ఆశ్రయముగానున్నట్టి స్థూలశరీరమునే తాను అని అనుకొనువాడే జీవుడనబడును. కాబట్టి దేహము మార్పునొందున దగుటచే:- దీనిపోషణ మఱియు రక్షణలో స్వార్థాభిమానమేర్పడి, మనోబుద్ధీంద్రియముల మూలమున కోరికలు జనించి, చింతలు మఱియు దుఃఖములను భరింపవలసి వచ్చును గనుక:- ఈ జీవునికి నిత్యసత్యాన్వేషణ ప్రారంభమగును. అనగా:- అస్థిర దేహ జంజాటలోలమైయున్నట్టి మనోబుద్ధీంద్రియములను, ఆత్మాభిముఖమొనర్పజూచి, పరమాత్మాశ్రయము గొని సాధింపవలసిన

వాడగుననుట. ఈ సాధనా విధివిధానస్వరూపమునే మతమందురు. ఇదిగో:—

ఇచ్చట సర్. డాక్టర్ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్. ఎమ్, ఎ. గారి ప్రవచనమును గాంచుడు:— "శాంతోయమాత్మా" ఈ సత్య శాశ్వతస్వరూపు నేకమాత్రముని గ్రహింపవలయును. చీకటి మూలముననే! వెలుగు ప్రకాశించును. తాపబడిన యెడలనే! వజ్రమునకు కాంతికలుగును. అనారోగ్యమే! ధన్వంత్రియవసర మగుటకు కారణము. ఆరోగ్యవంతు డాయనను తెలిసికొనవలయు నని ఏల వాంఛించును? విషమును బట్టియే! అమృతమునకు విలువ ఏర్పడును. ఒకదానితో నొకటి సరిపోల్చినప్పుడే! ఇత్తడి బంగారములనొకటి హీనమును, మరొక్కటి ఘనమునగుట సంభ వించును. కావున, ఓ ఈశ్వరా! మేమున్నాము గనుకనే నీకు ఈశ్వరత్వము లభించెను. పచ్చని యాకులను చిగిరించు శక్తులే! ఎఱ్ఱని పూవులను బూయించుటకెట్లు కారణములగునో! అటులే జీవాత్మ కొంతయభివృద్ధి జెందినపుడు శక్తిరూపుడుగను; తర్వాత గుణస్వరూపుడుగను; ఆ తదుపరి సర్వాధారుడగు ఆత్మరూపుడు గను వానికీశ్వరుడు గోచరమగును. గనుక, ఎఱ్ఱని పూవులు పూర్ణ సత్యమును వెల్లడించుననియు; పచ్చనియాకులు పూర్తిగా సత్య శూన్యములనియును మనము నుడువజాలము.

ఓమ్ తత్సదోమ్



# 3 వ ప్రకరణము

# సామాజిక గురుమతములు

మానవుని వ్యక్తిత్వము, ఆత్మ మఱియు శరీరకలయికగా నేర్పడియున్నది గదా ! ఇందాత్మ మార్పులేనిదేయైనను, శరీరము మాత్రము మార్పునొందునది గనుక తాదాత్మ్యభ్రాంతివలన:– తనయొక్క కర్మఫలానుభావానుసారము తగుజన్మనెత్త వలసివచ్చి, జనన మరణాద్యవస్థల నొందుగతి దాపరించుచున్నది. ఇందుచే మనుజుడు:– తనయొక్క అమూల్యజన్మను తరింపజేసికొనుటకే ! ద్వివిధ సాధనోపాయముల నేర్పఱచుకొని యున్నాడు. ఇందులో నొకటి:– ప్రవృత్తి సహితమైనట్టి సామాజిక మతమనునది. రెండవది:– నివృత్తిపరమైన "సంత్‌మతము" లేక శ్రీ గురు మత మ ను న ది.

ఈ ద్వివిధమతములను తెలియుటకు మొదట సంసారిక జీవిత సులభసాధ్యమునకై ఏర్పడినట్టి ధర్మమనగా నేమిటో కనుగొందము:– మన శరీరము అనేకత్వ కూడికయగుటచే దీనియందు బంధము కలదు. మార్పునొందు దీనిననుసరించి యుండుటచే ఆత్మబంధియగును. ఇందులకు కారణము సంకల్పమే ! సంకల్పము వలననే స్వరూపమేర్పడినది. ఈ నానాత్వకూడిక కొరకైన సంకల్పము, నానాత్వముగలదై యుండుటయు సహజమేనగుటచే వికలత కలుగుచుండును. ఈ వికలత యను చంచలతవలన శక్తి క్షీణమై అజ్ఞానము ప్రాప్తించుచున్నది. అవస్థలనొందుగతి దాపరించుచున్నది. సంకల్పములను నెఱవేర్చుకొనుటలో, జంజాటమున చిక్కు

కొనుట సంభవించి నీ నా తనమేర్పడుచున్నది. ఈ నీ నా తనములో గల్లంతేతెంచకుండా నుండుటకే! అనగా:- తమయెడ వలదన్నదాని నితరుల కొనర్పకుండుటకే ! ధర్మమను దాని నవలంబింప నగును. ఈ యనువర్తననే సామాజికధర్మమని యందురు. ఇచ్చట జ్ఞప్తి యందుంచవలసిన దేమనగా:-

ఈ దినములలో మానవునకు, వేదోపనిషత్తుల మరుపుకలిగి నట్టులే ! వ్యవహారిక ధర్మశాస్త్రముల ఎడలనూ పొరపడుట సంభవించియున్నది. ఎటులయనగా:- దేశ కాలపరిస్థితుల ననుసరించి ఏర్పడియున్న ధర్మశాస్త్రములలో, ఇప్పటి తమ భావానుకూలమైన వాటిని చూపెట్ట సాహసించుటవలన వివాద లధికమగుచున్నవి. ఇందులకు కారణము:- హిందూధర్మశాస్త్రములనునవి యే కాలమున నిర్ణయించి స్థాపింపబడినట్టివో, వాటియందు చూపెట్టబడి లేకుండుటయేను. అయినను, ఆ యా శాస్త్రములయందు:- అంతకు పూర్వఋషిసత్తముల నామములు పేర్కొనబడియుంట జూడ నయ్యవి, కాలానుగుణ్యత ననుసరించి వెలువడినట్టివని తెలియుచున్నది. కావున, ప్రస్తుత మానవప్రవృత్తిని సంస్కరింప జేయదగువాటిని మాత్రము ఉపయోగించుకొన జూచిననే మేలొందగలరని తెలియవలయును.

సామాజికమతమనగా.- వేదములందలి బ్రాహ్మణవిభాగ సూత్రప్రవృత్తి మార్గము. వృత్తిసహితమై సాంసారికజీవితమున ఉన్న స్థితినుండి వున్నతికి దారిజూపునది. అపరవిద్యాప్రబోధకము. సౌలభ్యముగా నుండునదగుటచే దీనిని మానవుడు బాగుగా నెఱుంగగలిగినను, తనయొక్క నిజరూపమును మరుగుపఱచ గలట్టిదైనను, గౌరవనీయముగా నుండజేయునదిగా నుండినను!

దీని నవలంబించువారు పరాధీనత (దాస్య) భయ, చింత మొద లగువాటిని మాత్రము భరింపక తప్పదు. ఏలయనగాః- ఇది బహి ర్ముఖ వర్తనానుకూల స్వార్థపరమైనది గదా! ఇందులోననూ గురు వుండును గాని, గురుడు ఈశ్వరస్వరూపిగా నెన్నబడడు. ఆయన ఆచారవ్యవహార ప్రబోధకుడుగ మాత్రిమే నైయుండును. మఱియు దేహాత్మభ్రాంతితో! భౌతికలాలసత్వంతో! గౌరవమర్యాద సుఖసంపత్తుల నాశించు, బహిర్ముఖసంధ్య ప్రార్థన పూజార్చ నాదులు కలిగి; అడుగడుగున ప్రమాణోపమానములను చూపెట్టు పెద్దలను పేర్కొను ధర్మగ్రంథములపై ఆధారపడియుండునది. ఇంతేగాదు, అర్హతలయొక్క పాటింపులేక నీనాతనముల బ్రిక టించుకొను వాదోపవాదముల కాలవాలమై యుండునది. భౌతిక దృక్పథమున కలవడియున్నట్టి మనస్సును నిలుపుటకుః- సర్వాం తర్యామియైయున్న పరమేశ్వరునికి నామరూపములను కల్పించి, తమ స్వయంకల్పిత ఆ యా వాటియందు మనస్సు నిలువజాలక, భక్తియు కుదురకుండుటచే తమ ఇచ్ఛలు కొనసాగనందున, తమ కర్మానుభవ మిటులుండెననియో! ఈశ్వరుని పక్షపాతియనియో! మిడుకొ్కనుచు, గొణుకొ్కనుచు కాలము బుచ్చుజేయునది. కర్మ ధర్మజంజాటమున మునుంగజేయునది. కలిగియున్న ఇసుమంత ఆత్మశక్తిని సడలజేయునది. దాస్యత్వము గఅపునదగు సంసారిక మున మరింత పాతుకొనజేయునది. నరకమను భయమును, స్వర్గమను ఆశను పురికొల్పునది. ఇందులో పరోపకారము కలిగి యున్నను, భౌతికోన్నతి నాశించియే యుండును. లేక ఆత్మో న్నతిని ఆశించుటయన్ననో! ప్రతిఫలమును కాంక్షించుటగా నయ్యే యుండును.

ఇక శ్రీగురుమతమన్ననో:– వేదారణ్యకభాగమందలి నివృత్తి మార్గము. అనగా:– జ్ఞాన, లేక ప్రేమమార్గము దేహాత్మభ్రాంతిని పోనాడజేసి, కాలకర్మపాశముల దొలగించి, శాశ్వతానందపదవిని బడయుజేయు పరమార్థసాధన పరమైనది. ఆత్మపరమైనది. ఈశ్వర పరమైనది. లేక గురుబ్రహ్మ పరమైనది. సర్వాత్మలను ఏకరూపమున, లేక ఏకభావమున గని ఆత్మికప్రేమను జూరగొనజేయునది. నిత్యానిత్య వివేకపరిజ్ఞానముతో పనిగొనజేసి, స్వార్థరాహిత్యమున ఆత్మోన్నతినొందజేయునది. గురుస్వరూపద్వారా పరమాత్మైక్యతను సాధింపగల అనుభవమును గడింపజేసి, జననమరణావ్యవస్థలనుండి తొలంగజేయునది. ఇయ్యది అనుభవముపై ఆధారపడియుండునదే గాని, శాస్త్రగ్రంథములపై గాదు. దీనికి సాధనసంపత్తియే ముఖ్యముగాని, విద్యాజ్ఞానము కాదు. ఇది పరావిద్యతోగూడినట్టి ఆత్మవలననే! ఆత్మనుద్ధరించి, ఆత్మస్వాతంత్ర్యమును గలుపునది. మఱియ్యది కర్మానుభవము తొలగుటకు సమర్పణాబుద్ధిని కలిగించి, అంతర్ముఖమున పూర్ణత్వసిద్ధిని బడయుజేయునది. దేహమునందు పాతుకొనిన (కట్టుపడిన) తనమును (గ్రంథిని) వీడజేసికొనుటకై ఏకసంకల్పమునకు, ఏకాగ్రతకు, స్వరూపధారియగు ఏకత్వమునకు అనగా:– స్వరూపధారియగు గురుత్వమునకు కట్టుబడజేసి తరింపజేయునదే! మహర్షిమత రహస్యమను శ్రీగురుమతము. కాబట్టి నన్ను చేపట్టుమని, ఎవ్వారినైనను బలవంతపెట్టు మతము కాదిది. అర్హతగలవారికే బోధపడు మతమిది. మఱియు:– సుకృతదుష్కృత పాటింపును కలుగజేసి, వాదోపవాదములకు తావివ్వక, కలిగున్నదాని నుండజూపి, దేహమునంటియున్నంతవరకు ఫలత్యాగమున కర్మనొనర్పజేయునట్టి మతమిదియే నైయున్నది.

జ్ఞానమార్గమనగా:- ప్రేమమార్గము. ఇది ఆత్మను ప్రేమింప నేర్పునది. ఆత్మకొరకై దేహమును అహుతి గావింపజేయునది. ప్రతిఫలమునాశించక యుండి ప్రేమించునదే! నిజమైనప్రేమ యనబడగలదు. ఆశించుటయన దేనిని? దేహమునే యనవలసి యుండును. అప్పుడది వ్యామోహమనబడునే గాని ప్రేమయన జెల్లదు. కనుక తల్లిప్రేమయే నిజమైనప్రేమ యగును. ఎట్టుల యన:- తల్లి తనపిల్లల రక్షణకై ఎంతటి త్యాగమునకైనా ఓడిగట్టి ఎదిరించి, తన సర్వస్వము నాహుతిజేయ సాహసించును. గాని ప్రతిఫలమును కాంక్షించి, ఆశించుట కిష్టపడదు కాదా? అది వారి ఆత్మరక్షణ కొరకైనదిగా నుండునగుటచే ప్రేమమార్గములో ఇచ్చుకొనజూచుటయే గాని, గైకొనుప్రశ్నకే తావుండదు గనుక, ప్రేమమార్గము వ్యవహారికము కాదు. మఱియు ఎచ్చటనైతే కోరిక యుండునో, అయ్యది ప్రేమ యనబడజాలదు. తనయొక్క గమ్య స్థానమగు గురుని, లేక ఈశ్వరుని ప్రేమించుట యన, ఆశించు టకు గాదు. ఏలయన వాడు సర్వశక్తివంతుడైన నేమి? సర్వజ్ఞుడై యున్న నేమాయె! ప్రేమించువాడు మాత్రము వాని అంశము కాడా! ప్రేమకొరకు ప్రేమించి, ప్రేమలోమునింగి, ఆ స్వరూ పమునొంది ఏకమగుటయే ప్రేమయొక్క ఉద్దేశమై యుండును. ఇదియే సత్యమైనప్రేమ యనబడును. ఇది ఈశ్వరుని, లేక గురు బ్రహ్మపరమైనప్పుడా ప్రేమను భక్తియని పేర్కొందురు. ఈ భక్తి యొక్క పరియవసానమే జ్ఞానమనబడునగుటచే:-

కల్పితమునటుంచి, ద్వంద్వభావమును బోనాడి, నిర్భయ త్వమును గఱపి, త్యాగమును అలవరచి, సత్యపథమును జేర్చు నదే జ్ఞానమగును. భక్తియన:- హృదయమునంటియుండి వ్యవహ

రించునది. జ్ఞానము:– మేధస్సునంటి వర్తించును. మఱియు భక్తి ద్వైతము నాధారముగా గొని, తన్మయతను సిద్ధింపజేసి ఐక్యతను చేకూర్చును. జ్ఞానమో! అనిత్యమును పోవిడి, సత్యాత్మను దర్శింప జేయును. ఇందుచే:– శరీరాత్మల సంయుక్తుడగు సాధకునకు:– ఈ ప్రేమ భక్తి జ్ఞానములు అత్యవసరములేయగును. ఏలయన, స్వార్థమును వీడుటకు; వ్యక్తిత్వమును పోనాడుటకు; సత్యమును కనుటకు. మఱియు జ్ఞానముయొక్క అభిలాష:– తెలిసికొనుట, గ్రహించుటమాత్రమే గాదు అట్లగుట. అయిపోవుట యగును. ఇట్లనగా:– సత్యముగ ఏదైతే మనమైయున్నారమో, ఉంటిమో, ఉండగలమో, ఏదైతే మననుండి వేరై లేదో, వేరుగా నుండనూ జాలదో! దానిని గురించి మనకుగల సంకుచితకళంకము రహితమై విశాలత, లేక పరివ్యాప్తతనొందుట యగును. మఱియు ఈ పరివ్యాప్త, లేక సర్వవ్యాపియే పరిపూర్ణము. గనుక పూర్ణత్వము యందు ఏలాటికోరిక యుండనేరదు గదా! కాబట్టి, ఇయ్యదియే సత్యేమ యగును. లేక జ్ఞానమార్గాభిమతము. లేక జ్ఞానమగునని తెలియవలయును. ఇదిగో! ఉపనిషద్వాణిని తిలకించెదము:–

౧. సత్యం జ్ఞానమనంత మానందం బ్రహ్మః.

౨. సర్వవ్యాపీ సఃభగవాన్ తస్మాత్ సర్వగతః సఃశివః.

౩. ఈశాభాస్యెకం అధిసర్వం యత్కించ జగత్యాంజగత్.

౪. యద్యదస్కించ ప్రాణయజతి, నిశర్తం ప్రాణోవిరాట్.

౫. కోహిదదాన్యాత్ కాలపరాన్యాత్,

యదేశ ఆకాశ ఆనందోనాస్యాత్.

౬. యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాచః,
ఆనందంబ్రహ్మణో విద్వాన్ నిర్విభిభీతి కుతశ్చన.

౭. ఇహచైత్ అథా సత్యద్అస్తి, నాచైత్ ఇహ అవేదిత్
మహతి వినిశ్చితః.

౮. భూత్యేషు భూత్యేషు విచింత్య.

౯. తేన త్యక్తేనభుంజీ నమాగృధకస్యస్ విద్వమానమ్.

తాత్పర్యములు — (౧) బ్రహ్మము శాశ్వతుడు, శక్తిపూర్ణుడును, సర్వాంతర్యామియు. పూర్ణానందస్వరూపుడును. (౨) భగవానుడు సర్వాంతర్యామి గనుక అన్నిటియందును వ్యాపించియున్నాడు. (౩) ఈ జగత్తనబడునదంతయు ఈశ్వర ప్రకటన, లేక ప్రకాశస్వరూపమేనై యున్నది. (౪) ఈ చైతన్యస్వరూపమను ప్రాణమువలననే! సమస్తము సృష్టియైనది. మఱీప్రాణముచేతనే అన్నియు జీవించియున్నవి. గ ఏక ప్రాణమే విరాట్యై యున్నది. (౫) ఒకవేళ:- ఈశ్వరుడు పూర్ణానందాకాశమునందు పరివ్యాప్తమై కలిగియుండనిచో, జీవితము మఱియు మేలులను వాటియొక్క నామరూప జాడమాత్రమైనను కానరాకుండెడిదేను. (౬) వాణి:- బ్రహ్మమునుచేరి అసమర్థతతో తిరిగివచ్చును. మనస్సుగూడ యిదేవిధముగ యగును. ఎవరైతే:- వానిని వానియొక్క ఆనందమూలమున తెలియుదురో, వారు సంపూర్ణ భయరహితులగుదురు. (౭) వానిని తెలియుటయన:- నిజ, లేక సత్యముగుటయే యగుగాని వానిని తెలియకున్నచో, సర్వనాశనము నొందనగును. అయితే వానిని తెలియుటెటుల? (౮) వానిని:- ప్రతివస్తువు, లేక అన్నింటను సాక్షాత్కారవఱచుకొనుటచే! అదెట్లు? (౯) ఏదైతే నీయది కాదో, నీ కన్యమైలేదో, వాని ప్రసాదితమేనై యున్నదో, అద్దాని ననుభవించుటలో సంతృప్తినొందుటవలన. మఱియు మనస్సుయందు అనిత్యైశ్వర్యభ్రాంతికి చోటివ్వకుండుటచేతను.

ఇంత మాత్రమే గాదు, "స్వాభావిక్ జ్ఞాన బల క్రియాచః." అనగా:- జ్ఞానము (ప్రకాశము) బలము (అస్తిత్వము) మఱియు క్రియ (కర్మ) యనునవి మనయందు ప్రకృతిసిద్ధముగనే కలిగి యున్నవి. కావున:- "మిత్రస్య చక్షుసాస్మి క్షామహే" అనగా:- జగత్తు సర్వమును స్నేహ ప్రేమదృష్టితో చూడవలయుననియూ ఉపనిషద్వాణి విశదీకరించినది. అయితే, ఇచ్చట తెలియవలసిన దేమనగా:-

సత్, చిత్, మఱియు ఆనందములను విశేషణసంయుతుడే, లేక సచ్చిదానందస్వరూపుడే ఈశ్వరుడు. ఈయన పరిపూర్ణశక్తుల కాలవాలమై సర్వాంతర్యామిగ నున్నాడగుటచే, వానియొక్క విశేషణములద్వారా ప్రయత్నించిననే బోధపడగలడు కనుకనే, విశేషణసంయుక్తమైన స్వరూపమునే మొదట విశ్వసించవలసి యుండును. దీనిని ఆదర్శముగ నుంచుకొనగలిగిననే సత్యత్వము వేద్యమవగలదు. ఇటులనగా:- విశేషణసంయుతుడై యున్నట్టి గురునియందు గురిని కలిగించుకొనుట ద్వారానె! పరమార్థము నెరుంగుట మాత్రమేగాక, అనుభవమునూ గడించుకొన వీలగుటచే నిస్సందేహులవగలరు. మఱియు ఆధారము, లేక తోడ్పాటు యున్నూ అత్యవసరమౌ గదా! అంతేగాదు, "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనగా:- బ్రహ్మతత్వమును గుర్తెరుగగలుగువారు బ్రహ్మమే యగుదురను శ్రుతియున్నూ కలదు ఇది యిటులున్నప్పుడు:- గురువును బ్రహ్మముగ భావించియే సేవించవలసియుండును వీరి యందెంతటి ప్రేమభక్తులనుంతురో, అంతటి యనుభవమును గడించుట కర్హులగుదురు. కాబట్టి స్వభావమును, లేక

అహంకారమును, గురువిశ్వాసమున ఆహుతిగావించి స్వార్థరహితులు గావలసియుండును. మఱియు:-

గురుడు ఆపత్కాలబాంధవుడునై యున్నాడు. ఆపత్పురుషు లెల్లప్పుడును సత్యసంతులేగాక స్వార్థరహితులూనై యుందురు. అంధకారమున ప్రకాశమును కలిగింతురు. విద్యను అనుభవ స్వరూపానర్చి బంధమునుండి తొలగింతురు. గమ్యమును జేర్చగల శక్తియుతులై యుందురు. ఇందుచే దేహాభిమానమును త్యజించి, గురుత్వాభిమానమును కలిగించుకొనవలసి యుండును. ఈలాటప్పుడే గురుబ్రహ్మయొక్క శక్తులు తనసొత్తు కాగలవు. ఇంతకు గురుత్వమనగా:- తన హృదంతరవాసియైన ఈశ్వరత్వమే యగును. గురుని ప్రబోధ, మైత్రి, ప్రేమ, కృపలవలన హృదయ పొరలొక్కొక్కటి చీల్చబడుచు, అంతరికమున గురుత్వము వేద్యమగును. కనుక గురుడే! సచ్చిదానందస్వరూపుడు. ఇట్లని గుర్తెరిగి ఆదర్శముగ నుంచుకొనకున్నచో యిక కర్మ ధర్మ ధ్యాన జ్ఞానము లన్నియు హుళక్కియే యగును. ఏలయన; సంకుచిత దశలో యున్నవారు సామాన్యరూపద్వారానే అనుభవమును గడించ గలిగెదరు. ఇంతేగాక గురుదేవుని స్పర్శ, లేక ప్రభావమును, చిత్తరువును, సంస్కారములనున్నూ మనస్సున నాటజేసికొనజాలిననే వారి ప్రేమనార్జింపవీలై, "శిష్యుడు గురువాయె" అను యనుభవమును గడించుటకు, లేక భావైక్యతను వీలగును. ఇట్లగునప్పుడే! గురుడు తనశిక్షణకు లోబరచి, సంస్కరించి, అంతర్ముఖునిగా జేయుట కవకాశమేర్పడగలదు.

గురుడను ఆపత్పురుషవాణినే ఉపదేశమందురు (ఉపదేశ మనగా:- మంత్రప్రదానము, దీక్ష, సమీపస్థుడగుట). ఈ ఉప

దేశ్యనామము, లేక మంత్రము గురువరునిచే సాధింపబడినదై యుండును. గనుక, ఇయ్యది ఆధారసంభూతుని సహజనామమే యగును. కాబట్టి, దీనిని కల్పితమనుటకు వీలులేదు. ఇదియే ఆదర్శము, ఐష్టికము, గమ్యమునై యుండును. ఇది ఎచ్చటి నుండి, లేక యెందునుండి ప్రసాదింపబడియెనో! అదియే దాని యొక్క స్వరూపమగును ఈనామమనునది:— మానవునియందిది వరకే శబ్దించుచుండియు, కర్మబద్ధతవలన స్తబ్ధించియున్నది. దీనికి జీవాత్మయొక్క కలయికయైనచో, పరమార్థము దానంతలదే ప్రాప్తించుచుండగలదు. ఇంచుకైనను దీని స్పర్శకలుగునేని, అభిరుచి ఏర్పడి పరమాత్మాన్వేషణ దారి తెరువబడగలదు. చూపు మేరలో జీవితమున మార్పుకలిగి కళానైపుణ్యము మాత్రమే గాక, ఆనందమున్నూ ఉద్భవించగలదు. మఱియు దేహిక, మానసిక, ఆత్మికారోగ్యము లభించనూ గలదు. ఈ యుపదేశ మంత్రమూలమునే "శ్రీగురుమతమున" అభ్యాసము గావింపబడును. ఒకవేళ దీని తోడ్పాటు లేకున్నచో, పరమార్థసాధన కొనసాగనేరదనియు తెలియవలయును.

౧. మాహంబ్రహ్మ నిరాకుర్యాం, మా మా బ్రహ్మ నిరాకరోత్.

౨. యద్యత్ కర్మ ప్రకురు వియత్ బ్రహ్మణి సంన్యయత్.

అనగా:— బ్రహ్మము మనను విడచియుండదు గనుక, బ్రహ్మమును క్షణకాలమైనను మనము విడచియుండరాదు. (౨) మనమొనర్చు ప్రతి కర్మను బ్రహ్మార్పితముగా నొనర్పవలయును. ఈలాటి కర్మయే ముక్తి భాసగును. లేకున్నచో బంధనమునకు కారణమగును.

ఇందుచే, మనోవాక్కాయకర్మలను గురుబ్రహ్మార్పితముగా నొనర్చవలయును. ఈలాటప్పుడే జ్ఞానబలానందములు స్వతస్సిద్ధముగ బయలుపడగలవు. ఎవడు గురునిసాత్త్వ యుండునో! గురు డాతనివాడేనై యుండగలడు. ఎటులైతే, ఒక బిందువుయందున్నూ సముద్రమిమిడియుండునో; మఱెటులైతే ఒకకిరణము వెనువెంట సూర్యుడు కలిగియుండునో; అటులే గురుబ్రహ్మయొక్క సత్తా శిష్యుని వెన్నంటి యుండగలదు. కాబట్టి, ఈ జగత్తును గురుధ్యాన స్మరణదృశ్యథముతో కప్పియుంచవలయును. ఏలయన, హృదయమునిచ్చి హృదయస్థునియందు గురిని నిల్పగల్గుటను మించిన జ్ఞానముండజాలదు. ఇందే నిజరహస్యము కలదు. ఎటులయన; గురునే తన సర్వస్వమనుకొని, అన్నిటియందును వానినే దర్శించునంతటి భావైక్యతను కలిగించుకొనవలెను. ఈ విధానమునటుంచి, భౌతికలాలసత్త్వము గలిగియున్నంతవరకు వానిని సర్వత్ర కాంచజాలరు. మఱియు జగత్తును గురుమయి (బ్రహ్మమై) లేక గురుస్వరూపమని భావింపనూ జాలరు. ఇంతేగాదు; బ్రహ్మము తాను మునింగియుండి మనను వ్యక్తపరచినాడగుటచే, వ్యక్తిత్వముగనున్న గురుబ్రహ్మయందు మనము మునింగి వానిని వ్యక్తపరచుకొనవలయును. ఇదియే కర్మ భక్తి, లేక ఉపాసన, మఱియు జ్ఞానోద్దేశమై యున్నది. ఆ బ్రహ్మమే సహస్రారమందలి జ్యోతి నిరంజనుడు. వాడే త్రిపుటియందలి ప్రణవము. మఱియు బ్రహ్మాండమనస్సే ప్రణవమను ఓంకారము. దీని సహకారము, లేక శబ్దబ్రహ్మమగు శ్రీగురుత్వ సహకారము ననుసరించియే అన్నిసోపానములయందు విహరించవలసి యున్నది. ప్రతిచోటనూ దీని ప్రభావమే గాననగును. ఇదియే సర్వజ్ఞత. మఱిదియే సర్వమునైయున్నది.

"ఆత్మక్రీడః, ఆత్మరతి, క్రియావాన్" అనగా:- ఆత్మిక ప్రమోదము, ఆత్మానందము ననుభవించవలసినదని ఉపనిషత్తు గూడా మనను ప్రేరేపించుచున్నది. గనుకనే, బంధనమునుండి విముక్తియు, ముక్తియందు బంధింపబడుటనే సాధింపవలసిన వారమైనాము. బ్రహ్మము సర్వాంతర్యామియై యున్ననేమాయె! చంద్రునివలె సామాన్యరూపముతో నున్నాడు. వెన్నలలో చెడులు జరుగుచుండిన చంద్రుడు అడ్డపడకుండునట్లే వాడున్నాడు. గనుక విశేష స్వరూపధారియగు గురుబ్రహ్మతో ఆపని యగుటేగాక, సదుపాయమును జూపి గమ్యమును జేర్చగలడు. మఱియు సమజీవియే ప్రేమింపదగి యుండుననుట ప్రకృతిసంసిద్ధ విషయమైయున్నది గదా! ఇంతకు ప్రేమపరిపూర్ణత్వము నొందనిది ఉద్ధరింపబడుటెటుల? కాబట్టి:- గురుని తోడ్పాటు, దృష్టి, స్పర్శ మఱియు సంస్కారములను చేకొనగలిగిననే! సహజసంసిద్ధ భ్రమ ప్రమాదముల మోసమునుండి తప్పుకొనుటకు వీలున్నది. దీనిమూలమున సత్యానుభూతి యేర్పడి సంతోషానందములును చేకూరగలవు. ఈ కట్టుదిట్ట శిక్షణవలన తప్పక పూర్ణత్వసిద్ధియు సమకూరగలదని గ్రహించవలయును.

సీమిత, లేక పరిమితమునందు, అపరిమితత్వము వ్యాపించి యుండును గదా! ఒకవేళ పరిమాణముగలది కలిగియుండనిచో, పరిమేయము (అపరిమితము) యొక్క పరిజ్ఞానమెటుల కలుగుచుండెను? కావున గురుత్వమును పరిమితముగ జూడరాదు. ఏలయన, మన శరీరమునగల పంచకోశములందును ఆత్మతత్వము పరివ్యాప్తమైయున్నది. ఇయ్యవి సీమితములై యున్నంతమాత్రమున ఆత్మత్వమునకేమి కళంకము వాటిల్లును? అది యథారీతి

గనే యుండును. దీనిని తెలియుటకు విశాలదృక్పథము మాత్ర మవసరమగును. ఇందుచే:- తనయొక్క సర్వస్వమును సద్గురు చరణకమలములకు అర్పించుకొనుటలో సంశయింపక, దేహిక మనస్సును దేహదారి గురుత్వమున కర్పించుకొనవలెను. (ఇది కర్మ) సూక్ష్మమనస్సును సూక్ష్మ, లేక శ్రీగురుత్వమునకు నివేదించవలెను. (ఇది ఉపాసన) కారణమనస్సును సద్గురునకాహుతి గావింపవలయును. (ఇది జ్ఞానము) గాని, ఎవరిత్తురు ? గైకొను వారెవరు! అయిన నొకవేళ ఉన్నతినాశించుచో సత్యమైన పరార్థ, లేక స్వార్థరహిత ప్రవర్తన యవసరమగును. ఇయ్యది శిక్షణ వడయుటలోని సాలభ్యలక్షణము. నిజముగ పరికించి చూతుమేని ఇచ్చువాడే! శక్తిని గైకొనుచుండుట గాననగును. కాబట్టి తనదగు సర్వస్వమును, పరమ ప్రేమాస్పదాదర్శముపేర పరిత్యజించవలసి యుండును. ఇంతయేగాదు, త్రిమూర్తిగర్భిత గురుత్వమనగా సర్వాంతర్యామిత్వమే యగును. ఇదియే సర్వసమర్థ సంపూర్ణ విధానస్వరూపము. ఈతడే! ఐశ్వర్యయుక్త ఈశ్వరుడు, శక్తియుత బ్రహ్మ, నిజమైన అస్తిత్వమును కలిగియున్న సత్పథము. ఇచ్చోట పూజ్యపాదుడగు శ్రీ కబీరుగారి ఉపదేశమును గాంచెదము:-

౧. "కబీర్ ! రోడా హెూరహ బాట్ కా ! తజ్ అపా అభిమాన్,
లోభ్, మోహ, త్రిష్నాతజే, తాహీమిలే నిజనామ్.

౨. కబీర్ ! నిర్బంధన్ బంధ్ రహా, బంధ్ నిర్బంధన్ హెూవె,
కరమ్ కరే కర్తానహీం, దాస్ కహావె సోయ్.

3. నాబైరీ, నా కామతా, ఉప్జెధూప్ నతాప్,
హర్ష శోక్ వ్యాపేనహీం, తబ్ గురూ ఆపే ఆప్.

౪. భోగ్ మోక్ష మాంగూంనహీం ; భక్తీదాన్ గురూదేవ్ ,
ఔర్ నహీంకుఛ్ చాహియే ; నిసదిన్ తేరీసేవ్.

౫. సేవాఫల్ మాంగేనహీం , కరేసేవన్ ధిన్ రాత్ ,
కహేంకబీర్ తాదాస్‌పర్ , కాల్ కరేనహీంఘాత్.

౬. ప్రథమ్‌సిడీహై గురూభక్తి , గురూభక్తీ బిన్‌కాజ్‌నరత్తీ ,
ఔర్ ఉపావ్ అనేకన్ కర్తే , గురూభక్తీ కో ముఖ్యానరఖే.

౭. ఏక్‌జన్మ గురూభక్తీకర్, జన్మదూసేసే నామ్ ,
జన్మతీసేసే ముక్తీపద్ , చౌథే మేం నిజధామ్.

తెలిసినదా ! మఱియు నీ శ్రీగురుమతమున:— (౧) సత్సంగము. (౨) సద్గురు. (3) సత్‌నామము. అను మూడుసిద్ధాంతములు గలవు. ప్రప్రథమమున వీటియొక్క ఘనతను గుర్తెరుగవలసి యుండును. ఏలయన , ఈ మతము వీటిపైననే ముఖ్యముగ ఆధారపడియున్నది. ఇందలి సత్‌సంగమనగా:— సత్పురుష సాంగత్యము. సద్గురు అనగా:— సత్‌యొక్క అనుభవ ప్రబోధమంతయు మూర్తీభవించియున్న స్వరూపము. సత్‌నామమనగా:—సత్‌యొక్క దృక్పథముతో సాధించునట్టి పరిజ్ఞానమును నిశ్చయపరచునది. కావుననే ! ఇందులకర్హుడగు వానికి , లేక పరితపన కలిగియున్న వానికి:— సర్వసంరక్షకుడై యున్నట్టి స్వరూపధారి ఈశ్వరుడగు గురుడు స్వయముగనే లభించును. ఇది ప్రకృతిసిద్ధ శాసనము. ఆయన అంతటనుగలడు. ఆసక్తి ఇనుమడించుచో తప్పక లభించగలడు. ఇచ్చట తెలియవలసిన దేమనగా:—

లెక్కలన్నియు, ఒకట్లపైననే ఆధారపడియుండును. దేనిని గాంచినను అవధి మఱియు అనావధు లెల్లప్పుడును కలిగియే యుండును. ఎచ్చట అవధి కలదో అచ్చట మాయ కలదు. ఎచ్చట అనావధి యుండునో అచ్చట అస్తిత్వముండును. ఏది బ్రహ్మమో అదియే మాయ. ఈ దృష్టితో జీవుడు మఱియు బ్రహ్మము ఏకమేను. ఎట్లులైతే సముద్రము మఱియు అల, అగ్ని మఱియు మిణుగురు; సూర్యుడు మఱియు కిరణము వెనువెంట కలిగి యుండునో! ఇందుచే, ఏకత్వదృష్టితో అస్తిత్వము అనేక దృష్టితో మాయ వ్యక్తమగును. కాబట్టి ఏకము నందనేకము, అనేకము నందేకము కలిగియుండుట ప్రకృతిసిద్ధ విషయమై యున్నది. ఇక్కారణము ననుసరించి శ్రీగురుమతము:- బద్ధమైనది కాదు, లేక అబద్ధమైనదియు గాదు. ఇది, ఈ రెంటికిని మధ్యస్థమార్గమును అవలంబించి వ్యవహరించునదై యున్నది. అమూల్యవిలువైనట్టి ఈ మతమునకు, సుషుమ్నమార్గమను గౌరవనామమున్నూ కలిగియున్నది. ఇందలి బద్ధసిద్ధాంతమును ఇంగ్లీషులో:- డాగ్మెటిక్ (dogmatic) అందురు. అబద్ధసిద్ధాంతమును ఇంగ్లీషులో:- మైస్టిక్ (mystic) అని యందురు. మఱి శ్రీగురుమతమీ రెంటి ననుసరించి యుండుచుండుటయును కద్దు. అనగా:- సామాజిక పభ్యతలవరకే ఈరెంటి ననుసరించి యుండుననుట. ఎప్పుడైతే అంతరికానుభవ విషయములే తెంచునో, అప్పుడు స్వతంత్రముగ వర్తించును. ఇట్లని గుర్తెరుగజాలకున్నచో సాంప్రదాయాభిమానము నకులోనై సంకుచితులు కావలసివచ్చును. ఇందుచే:- బంధనమున నిర్బంధము, మఱియు నిర్బంధనమున బంధనమే! ఈ మతము యొక్క నైజస్వభావమని జ్ఞప్తియందుంచవలసి యుండును.

"పశ్చాయమ్నమల తాత్మాని, తపజో మ్యో అమృతమ్యయా, పురుషః సర్వానుభవః" (శ్రుతి) అనగా:- ప్రకాశము, జీవితము, ఇంద్రియములు మఱియు అస్తిత్వమున్నూ మనయొక్క ఆత్మల లోన గలవు. మనయందు ప్రతిదశయు గలిగియున్నది. మన యొక్క శరీరమునందయ్యా వాటియొక్క స్థానములు నిర్ధారితమై యున్నవి. ఈ స్థానములన్నియు పూర్వకర్మబద్ధతచే స్తబ్ధదశలో పడియున్నవి. గురుని కృపనువడసి, వారి ప్రబోధానుసారముగ సాధనయొనర్చి వాటికి వేడెక్కించుచో ప్రపుల్లమై, లేక వికసించి యాముల్లు విప్పబడునప్పుడు మనయందపారమైనశక్తి ప్రకటింప బడును. ఈ సముద్రస్నానమాడుటలో, అందలి జ్ఞానరత్నములను పైకితీయ గలిగెదమేగాక అప్పుడందులో, అడుగంట మునుంగు సాధన అలవడగలదు. ఇట్టివారు విరాట్పురుషశక్తికి భాగస్థులు, లేక ఉత్తరాధికారులు (వారిస్) కాగలరు. మఱియు వాని సహ కారమునందుచు, జాగ్రదావస్థయందలి వ్యవహారములను సహి తము అలసట లేక కొనసాగించు కొనగలిగెదరు. తదుపరి; అవ్యా కృత్, హిరణ్యగర్భ సోపానములు గలవు. వీటి తర్వాత, వీటన్నిటి కాధారభూతముగనున్నట్టి నాలుగవపథము, లేక పరమపదమను ధృపథమును చేరవలసియుండును. ఈ సాధనలో ఆ యాస్వరూ పములగుట కాదుగాని, వాటియొక్క జ్ఞానము నార్జింపనగును. ఈ జ్ఞానమే సత్‌పథమును జేర్చును. లేక వీటియందుజేర, మనస్సు నిశ్శేషముగ రహితమై యాస్థితి స్వయముగనే రాగలదు. కాబట్టి ఇచ్చట తెలియవలసిన దేమనగా:-

"1. Religion means to live & not to talk"

"2. Get rid of negativity beingness."

ఇట్లనగా:– "(౧) మతమనగా అనుభవము నార్జింపజేయు వస్తువేగాని, పలుకులపాటవమున కందు విషయము కాదు. ఇందుచే (౨) అనిత్యపదార్థ విచార కృత్యములలో నుండి విముక్తులవవలయును. మఱియు, శ్రీ కబీర్ మహాశయుని ప్రబోధము నున్నూ గ్రహింపజూచెదము:–

౧. ఎహకర్నీకా భేద్ హై, నాహీఁ బుద్ధీవిచార్,
కథనీచోడ్ కర్నీకరో, తబ్ పావ్ కుఛ్‌సార్.

※ ※ ※

౨. ఎహతన్ విష్‌కీ బేలరీ, గురూ అమృత్‌కీ ఖాన్.
శీస్ దీయియ్యే, జోగురూమిలేఁ తబ్‌భీసస్తాజాన్.

※ ※

౩. వస్తూకహీఁ ఢూండేకహీఁ కైసే ఆవే హాథ్;
కహేఁకబీర్! తబ్‌పాయియ్యే జబ్‌బేదీలీజే సాథ్.

ఓమ్ తత్సదోమ్



# ४ వ ప్రకరణము

# జగద్రచన

**సంత్**, లేక సత్పురుషులయొక్క శిక్షణ తేజోప్రకాశము వలె తేటగయున్నది. గాని, నైష్ఠిక సాధనసంపన్నులు కాజాలని వారికి మాత్రమిది బోధపడజాలదు. కనుకనే ! ఈ సహజశిక్షణా మృతమును అనధికారి, లేక అర్హులు కాని వారియెడ రహస్యముగా నుంచవలయునను కట్టుదిట్ట మెల్లకాలములందును కలిగియే యున్నది. చూడుడు:- పరమ పురుషుడగు శ్రీకబీరుమహాశయుడు గూడా, తన ప్రియశిష్యుడైన ధర్మదాసులవారికి శిక్షణగఅపుటలో యేమని నుడివియున్నాడో !

ధరమ్‌దాస్ తోహి లాఖ్ దుహాయీ,
సార్ భేద్ బాహర్ నహీం జాయీ.

ఇట్లనగా:- "ఓ ధర్మదాసూ ! నీకు లక్షప్రమాణములు. ఏలయనగా; ఈ శిక్షణ సారామృత రహస్యమును బైటపడనీయ వలదు సుమా !" మఱియు, సూఫీమత వరిష్ట పురోగామియగు మౌలానా జలాలొద్దీన్‌రూమీగారి హితోపదేశమేమనగా:- "ఒకవేళ వినదగువారు లభింపకున్నచో ఉపేక్షించుటయే మేలు. అనధికారి, లేక అర్హులుకానివారి తోడ (వద్ద) ఈ జ్ఞానరహస్యమును కప్పి యుంచుటయే శ్రేయస్కరమగును." అయినను ప్రపంచము నందు:- అర్హులగువారు బొత్తిగా లేకపోలేదు కావున, అలాటి వారి కొరకనియే; ఈ రహస్యమును గ్రంథస్థమొనరింప బడినదని గ్రహించవలయును.

సంత్‌మత, లేక శ్రీగురుమత శిక్షణానుసారము:— ఈ సృష్టి రచనయందు మూడు పెద్ద మండలములు కలవు. ఇందులో నన్నిటికి పైదగు గొప్పది:— ఆత్మికమైనది. అచ్చట ఆత్మతప్ప మతెద్దియునూ లేదు. ఇది పలుకుల కందునదియూ కాదగుటచే దెల్పపరచ వీలులేదు. దీనిని దయాళ్ దేశమందురు. అనగా:— ఆత్మయొక్క స్వస్థానము. దీనిని పరబ్రహ్మాండమనియును పేర్కొందురు.

రెండవ మండలము:— దీనిని కాల్ దేశమందురు. అనగా:— అస్తిత్వ, లేక ప్రకృతిదేశము. ఇది ఆత్మయొక్క మనోస్థానము. అతిసూక్ష్మమైనది. ఇచ్చట విశుద్ధచైతన్యము సూక్ష్మమాయ, లేక ప్రకృతితో కలసియుండును. గాని చైతన్యముచే మాయ అణచబడి యుండి, బ్రహ్మాండ మనస్సగు ప్రకృతికిరణప్రవాహము వివిధ ములుగ వ్యవహరించును. ప్రళయకాలమున మాత్రము ఐక్యత నొందుచుండును. ఏలయన, ఇది ఆత్మకు మిక్కిలి సమీపస్థమై యున్నది. దీనియందెడతెంపులేని ఆనందముండును గాని దీర్ఘ కాల మార్పు కలదు. దీనిని బ్రహ్మాండమనియును పేర్కొందురు.

మూడవ మండలము:— దీనిని మాయాదేశమందురు. ఇయ్యది స్థూలప్రకృతి, లేక మాయారూపొంది యున్నట్టిది. ఇచ్చట చైతన్యము విశుద్ధమయ్యే యుండును. గాని సమిష్టిమాయ పొర లచే అణచబడియుండును. ఇయ్యది వేగిరమార్పు నొందు చుండును. తదంశమేనగు వ్యష్టిమాయ మూలముననే గదా! మానవుడు కట్టుబడియుండి వ్యవహరించుచు, దుఃఖియై జనన మరణముల నొందుచుండును. ఈ వ్యష్టిమాయను మాత్రము పిండాండమని పేర్కొందురు. ఈ మూటిలో:—

దయాళ్ దేశమనగా కేవలరచన, లేక ఆత్మసామ్రాజ్యము. ఇచ్చట స్థూల సూక్ష్మ మాయకు తావులేదు. కాల్ (ప్రకృతి) మఱియు మాయాదేశములందు సంయుక్త, లేక మిశ్రమరచన కలదు. ఇందలి కాల్ దేశమున ప్రకృతి బలిష్ఠమై యుండును. మాయాదేశమున మాయ మాత్రమే బలయుతమై ఆత్మనణచి తానే రాజ్యమేలును. వీటియొక్క వివరమేమనగా:— ఇందొకటి ప్రత్యేకాత్మికలోకము. రెండవది ఆత్మ మఱియు ప్రకృతి సంయుక్త లోకము. మూడవది మాయాలోకమనబడును. ఇయ్యది జగద్రచన యొక్క క్లుప్తమైన వివరణము.

మాయాదేశవ్యష్టి, లేక పిండాండమను మానవశరీరము యందున్నూ ఈ మూడు వ్యవస్థానములు, లేక విభాగములుకలవు. అందొకటి దేహికాత్మ, లేక జీవుడు. రెండవది మనస్సు. (అంతఃకరణకూడిక) మూడవది శరీరము (స్థూలపంచభూత మఱియు కర్మ, జ్ఞానేంద్రియకూడిక) వీటినే! కారణ, సూక్ష్మ, మఱియు స్థూలశరీరము లందురు. జాగ్రదావస్థలో స్థూలశరీరము నందలి భ్రూమధ్యస్థానమున జీవుడుండి సుఖదుఃఖముల ననుభవించును. ఈ జీవ వృత్పథప్రవాహ వైఖరిననుసరించియే సుఖదుఃఖములను నవి యేర్పడుచుండును. స్వప్నావస్థలో సూక్ష్మదేహమున మనస్సు నంటియున్నట్టి హితానామి నాడియందు జీవుడుండి తలంపులచే వ్యవహరించును. సుషుప్త్యావస్థలో కారణదేహమున, జీవమాత్మతో కలసియుండుటచే తలంపులు, లేక సుఖ దుఃఖానుభవముండదు. (ఇది స్థూలసూక్ష్మదేహ పునాదిస్థానము) ఈ స్థూల సూక్ష్మ కారణ శరీరములు:— ఒకదానితో మరొకటి ఏర్పడినవేగనుక, గొలుసులోని కడియములవలె కలసిమెలసియే పఱగుచుండును. కాబట్టి:—

ఈ పిండాండ స్థూలసూక్ష్మ కారణపొరలజీల్చి తొలగించుకొనగలుగుచో; ఆత్మభాండాగారమునచేరి జనన మరణముల దప్పుకొన వచ్చును. గాని, ఇయ్యవి స్థూలేంద్రియాధారమున కానిపనిసుమీ! ఏలయన, వీటిసంబంధమే అజ్ఞానమునకు హేతువు. ఇందుచే వీటినిబొత్తిగా జారవిడవలసియుండును. ఈలాటప్పుడే, ఆగొలుసు త్రెంపబడి విఛ్ఛిన్నమగును. ఇందులకు స్థూలసోపానమునుండి మనస్సును పైకిలాగవలసియుండును. అనగా:- దేహిక మేధాను సూక్ష్మమునకేగాక ఆత్మికముగనూ మార్చవలసియుండును.

ఇక సమష్టి మాయాదేశవ్యష్టిగా వ్యక్తమైయున్నట్టి మానవ శరీరమను పిండాండము, బ్రహ్మాండము పరబ్రహ్మాండములందు గల ఆఱాఱు సోపానములను కనుగొందము:-

## పిండాండము

పిండాండమునందలి ఆఱుసోపానములను:- యౌగికసిద్ధాంతమున చక్రములు, లేక కమలములందురు. ఇయ్యవి నరముల కూడికావలయములయ్యొకచోట వుండి క్రిందిభాగమునకు ప్రవహించునవి. ఇందులో మొదటిది భ్రూమధ్యస్థానమునయుండు ఆగ్నేయచక్రము. ఇది జీవాత్మయగు చైతన్యనివాసస్థానము. దీనివే క్రింది ఐదుసోపానములకు బల సహకారములభించును. దీనిని:- మూడవస్థానము, శివనేత్రము, జ్ఞాననేత్రము, ఆత్మనేత్రమనియూ పేరొక్కందురు. దీనినంటియే సూక్ష్మనాదమగు ఓంకారముండును. ఇది రెంటిదళకమలముగ నుండియుండు శరీర ప్రధానస్థానము.

రెండవది:- కంఠస్థానమునయుండు విశుద్ధచక్రము. ఇది పదహార దళముల కమలముగనుండును. ఇచ్చట బ్రహ్మాండాకాశ తత్వచ్ఛాయకలదు. ఈ స్థానమునుండియే స్థూలశబ్దము ప్రకటన యగును. ఇది శ్వాసను స్వక్రమముగ నడపును. ఇందు పనిచేయు చైతన్యమును సంస్కారశక్తియగు దుర్గ, లేక భవానియందురు. వాసనలయొక్క స్వస్థానముమాత్రము ఆగ్నేయమని తెలియవలసి యుండును.

మూడవది:- హృదయస్థానమునయుండు అనాహతచక్రము ఇది పండ్రెండుదళముల కమలముగనుండును ఇచ్చట బ్రహ్మాండ వాయుతత్వచ్ఛాయకలదేగాక నియ్యది:- శ్వాసకోశయుక్త స్థూల వాయువుయొక్క స్వస్థానము. దీనిచె క్రింది మూడుకోశములకు బలముచేకూరును. ఇచ్చట పనిచేయు చైతన్యమును రుద్రుడు, లేక సదాశివుడందురు. (లయకర్తగనుక)

నాల్గవది:- నాభిస్థానమునయుండు మణిపూరక చక్రము. ఇది పదిదళముల కమలముగనుండును. ఇచ్చట బ్రహ్మాండాగ్ని తత్వచ్ఛాయకలదు. ఇయ్యది:- ఆహార పానీయములను జీర్ణించి శరీరమంతటను వ్యాపింపజేయునట్టి స్థూలాగ్నియొక్క స్థానము. ఇచ్చట పనిచేయు చైతన్యమును విష్ణువందురు. (పరిపాలనకర్త గనుక)

ఐదవది:- మూత్రస్థానమునయుండెడు స్వాధిష్ఠానచక్రము. ఇది ఆఱుదళముల కమలముగనుండును. ఇచ్చట బ్రహ్మాండ జలతత్వచ్ఛాయ కలదు. ఇయ్యది:- నానావిధ స్వరూపములను ప్రత్యక్షమొనర్చు స్థూలజలముయొక్క స్థానము మాత్రమేగాక,

ఏకత్వమునయుండి బహుత్వపరచు పనిముట్టు. దీనిని లింగచక్రమనియు పేర్కొందురు. ఇచ్చట పనిచేయుచైతన్యమును బ్రహ్మయందురు. (సృష్టికర్తగనుక)

ఆఱవది:— పురీషస్థానమునయుండు మూలాధారచక్రము ఇది నాలుగుదళముల కమలముగనుండును. ఇచ్చట బ్రహ్మాండ పృథివితత్వచ్ఛాయకలదు. ఇయ్యది:— పిప్పి చత్త చమారమును వెలువరచు స్థూలపృథివియొక్క స్థానము. ఇచ్చట పనిచేయు చైతన్యమును గణపతియందురు. (పద్ధతిగ జరుగవలసియుండును గనుక)

ఇదేవిధముగ బ్రహ్మాండమునందున్నూ ఆఱుసోపానములు కలవు. అయ్యవి మహాస్థూలములు. పిండాండమందుగలవి వాటి ఛాయలు మాత్రమేను. మఱియు తనయొక్క శరీరమునందు జీవుడు వ్యవహరించునటులే, బ్రహ్మాండమున పరమాత్మవ్యవహరించును. అనగా:— అంతర్యామిగ పనిచేయును. ఇచ్చట కోరికలనునవి యుండును కనుకనే! జనన మరణములనునవుండును. అచ్చట కోరికలేదుగనుక జననమరణములకు తావులేదు. కావున; ఈ ఆఱుచక్రములను సక్రమముగను నిధానముగను గ్రహించుట, లేక గుర్తెరుగవలసి యుండును. ఏలయనగా:— ఈ సృష్టిరచన సక్రమముగా పరివర్తననొందు రహస్యము బోధకురావలసియున్నదే గాక, తద్వారా స్థూలతత్వములు వ్యక్తమగు రహస్యముగూడా తెలిసిరాగలదు. మఱియు వీటితో, మన నిజస్వరూపమగు జీవాత్మకు ఏలాటి సంబంధమో! అనగా:— మనము భౌతికభూతాత్మకమైయున్నట్టి శరీరమాత్రములమేనా, లేక విశుద్ధచైతన్యాత్మలమో సులభముగా వేద్యమవగలదు. ఇంతేగాదు:—

ఈ ప్రతిసోపానముననూ నాలుగు అంశములు కలిగియుండును. (౧) మండలము, లేక వలయము. (౨) రూపము (3) ధుని, లేక ధని (అచ్చట పనిచేయునట్టికర్త) (౪) నామము అనునవి అనగా:_ తత్వసామగ్రిగల కోశమే వలయము, లేక మండలమగును. ఏచర్యననుసరించి అచ్చట నిలచియుండునో, తద్వ్యక్తీకరణమే దానిస్వరూపమగును. ఏశక్తి అందునిలచి దానిని సక్రమముగ నడపుచున్నదో! ఏదైతే ఆశక్తియొక్క దేహమో! దేనినైతే దేహము తెలియజాలదో! అదియే దానియొక్క ధుని, కర్త, మఱియు అధిష్ఠాతయునైయున్నది. ఈ అధిష్ఠాతకు నామము కలిగియుండును. ఆ నామముయొక్క తోడ్పాటుననే యది గ్రహింపునకు లేక తెలసిరాగలదు. ఈ ధునియను అధిష్ఠాతయే తనమండలము; సోపానము; లేక వలయమున వ్యాపించి, లేక అంతర్యామియునయ్యుండును. ఏదైతే పరమాత్మయొక్క అంశమగు క్రిమమైన కిరణమో, అదియేనందు నివాసియైయున్నది. ఇట్లని అధ్యాత్మిక దృక్పథము ననుసరించియే గుర్తెరుగవలసియుండును. ఏలయన తనయొక్క కర్తవ్యసాధనమున, అయ్యదే రూపమున వ్యక్తమైననేమాయె! నిజముగా నయ్యదాత్మచైతన్య ప్రవాహమునందలి కిరణరూపమో, లేక ఛాయయోనై వెలసియున్నది. ఈ సంధిగ్ధావస్థను పోనాడజేయుటకు బృహదారణ్యకోపనిషత్తు యిటుల విశదీకరించియున్నది. అద్దానినిచ్చట గాంచెదము:-

(౧) ఏదైతే! నేత్రము యందున్నదో; నేత్రము దేనినైతే ఎఱుంగజాలదో; నేత్రము దేనిదేహమో; ఏదైతే నేత్రమును క్రమముగ నడుపునో; అయ్యదియే నీయొక్క నిత్య, లేక శాశ్వతమైన **ఆత్మ** మఱియు అమృతము. (౨) ఏదైతే! ఆకాశము (శబ్దము)

యందున్నదో; దేనినైతే ఆకాశము ఎఱుంగజాలదో; ఆకాశము దేనియొక్క శరీరమో; ఏదైతే ఆకాశమును క్రమముగ నడుపునో; అయ్యదియే నీయొక్క నిత్యమైన, లేక శాశ్వతమైన ఆత్మయై' లేక అమృతమైయున్నది. ఇటువలెనే! యితరములన్నియు నని గ్రహించవలయును. ఏభూతమైనను, లేక తత్వమైనను, లేక మరెద్ది యైననూ చైతన్యమునువీడి నిలచియుండజాల దనియు; చైతన్యమే పరమ తత్వమనియు; సమస్తము చైతన్యముపైననే ఆధారపడియున్నదనియును; ఈ వివరమువలన మనకు స్పష్ట ముగ గోచరమగుచున్నది. కాబట్టి:—

ఈ షట్చక్రములను ఊహకల్పితములని భ్రమపడరాదు సుమా! వీటియందు సత్యతకలదు. ఇయ్యవి, విడివిడిగా నున్న వనియూ అనుకొనరాదు. మఱియు నొకచోటుండియునూ లేవు. గొలుసుయందలి కడియములవలె, ఒకదానితో మరొకటి మేరుదం డమున వరుసక్రమముగా కలసియున్నట్టివనియు; సుషుమ్నానాడి నంటి యుండినట్టివనియును తెలియవలయును. ఇందలి ప్రతి చక్రమునందును, ఏకము మఱియు సంయుక్తములను రెండు రూపములుకలవు. ఏలయన, వీటిలో ప్రతిదియు పురుష మఱియు ప్రకృతులయొక్క రూపమును ఛాయయునైయున్నవి. ఎటుల నందురా:—

ఆకాశము (శబ్దము) యొక్క ఏక మఱియు సంయుక్త ధారా ప్రవాహము చైతన్యముయొక్క తోడ్పాటుచే మర్దింపబడునప్పుడు దీనియొక్క నిజతత్వము ఆకాశమండలమునయుండి, దాని ఛాయ యొక్క దారక్రిందికిదిగి వాయురూపముదాల్చి, హృదయచక్రము

యందు నిలచును. తిరిగి వాయుతత్వముయొక్క రెండు ధారా ప్రవాహములు మర్దనమై, తనయొక్క స్వచ్ఛందతను అచట యుంచి; ఛాయయొక్క ధార క్రిందికిదిగి అగ్నిరూపముదాల్చి నాభిచక్రముయందు నిలచును. తిరిగి అగ్నితత్వముయొక్క రెండు ధారాప్రవాహములు మర్దనమై, తనయొక్క స్వచ్ఛందత నచ్చటయుంచి; ఛాయయొక్క ధార క్రిందికిదిగి జలరూపము దాల్చి మూత్రస్థానమగు ఇంద్రియచక్రముయందు నిలచును. తిరిగి ఇదేవిధముగ పృథివి రూపముదాల్చును. ఈ పృథివియొక్క నిజ తత్వముమాత్రము సృష్టిరచనకుపనిచ్చి, తచ్ఛాయయగు పిప్పి గుదా చక్రమునుచేరి వెడలిపోవును. ఏలయన ఈ పిప్పి, లేక చత్త యనునది రచనకు ఉపకరింపబడనేరదు గదా! మఱియు, ఇదేవిధముగ స్థూలబ్రహ్మాండరచన లోనూ కార్యము జరుగును. గాని దీనిని వివరించుటకై ప్రయత్నించదలంచుచో అనావస్థవృత్తి అనగా:- లేఖినియే కత్తిరింపబడగలదు. గనుక భావార్థమును గైకొనజూడవలయునేగాక, గురిని గలిగించుకొని తత్వపరిశోధన గావింప నుద్యుక్తులవ వలసియుండును. ఇదేవిధముగ బ్రహ్మాండాతీతసోపానముల గురించియు పరిశోధనాభావ మవసరమగును. అనగా:- తత్వములిదేవిధముగ బాంధవ్యమును కలిగియున్నవని తెలియవలయును. ఇచ్చట గుర్తెరుగవలసినదేమనగా:-

ఆకాశము: తనమండలమున స్వచ్ఛంద సూక్ష్మరూపమున యున్నదనియు; క్రింది సోపానములలో దానియొక్క ఛాయా మాత్రములైన, వాయువగ్ని జలపృథివియనునవి స్థూలరూపములై యున్నవనియు; తత్వపరిశోధనాదృక్పథమునకు మాత్రము ఇవి యన్నియు ఆకాశమేనై యున్నవనియు; ఆకాశము వీటన్నిటిలో

పరివ్యాప్తమై యున్నదనియును. మఱియు నొకవేళ, చైతన్యము నుండి ఆకాశమనునదెటుల జనించినది అను సంశయము కలుగుచో:- చైతన్యమునుండియు ; పురుష ప్రకృతులయొక్క ఏక మఱియు సంయుక్త ధారాప్రవాహమందేర్పడు శబ్దమువలననే యని గ్రహించవలయును. ఈ రెంటిలో నొకదానిని రయి, రెండవ దానిని ప్రాణమనియందురు. ఈ రెండున్నూకలసి మర్ధింపబడుట వలననే ఆకాశముద్భవించును. కావుననే! పిండాండమున చైతన్య మాగ్నేయమునందుండి, ఆకాశాంశము దీనికిదిగువన యుండును. ఇందుచే:-

ఆకాశమును విశాలమైన బయలనుకొను భ్రమకు లోబడి యున్నవారికిమాత్ర మాకాశమొక తత్వమని తెలియుట కష్టమైన పనేయగును. వారలీవిషయము, లేక అంశమును ఎటుల గ్రహింపగలరు ? ఇట్టివారు, సత్యదృక్పథ పరిశోధనను అనుసరించి యత్నించగలిగిననే! స్థూలసూక్ష్మవ్యవస్థలు బోధపడగలిగి సత్యము తెలిసిరాగలదు గాని, పలుకుల జంజాటమున, లేక వాక్చాతుర్యమున చిక్కియున్నంతవరకు నిజము బోధపడు ననుకొనుట శుద్ధ భ్రమయేనగును. ఇంతకు తత్వములు బహురూపధారులుగానుండు గదా! ఎంతవరకు వీనిని వివరింపనగును ? చూడుడు:- ఒక జలతత్వమే ఆవిరి, మంచు, నీరుగనూ యుండుచుండునుకాదా? మఱియునొకే ఆకాశము మిగత తత్వములలో నెటుల పరివ్యాప్తమై యున్నదో ! అటులే చైతన్యము ప్రతిచోట, ప్రతివస్తువునందున్నూ సర్వాంతర్యామిగా నున్నదని తెలియవలయును. ఇంతవరకు ఇది షట్చక్రములయొక్క స్పష్టమైన విశదీకరణము.

—: పిండాండప్రళయము :—

కాల్ కియా జబ్ తన్‌ప్రవేశ్, జీవ్‌చలా తజ్ ఎహప్రదేశ్
మూల్‌ద్వార్‌పృథ్వీకాబాస్, ఖిచావహాఁసే స్వాంస్‌ఔర్‌భాస్
ఖిచ్కర్‌ఆయాఇందీ్రద్వార్, వహాఁసేపాంచానాభ్‌మఁఝార్.
నాభీసే ఖిచ్ హృదేఆయా, హృదేసే ఫిర్ కంఠ్ సమాయా.
పృథ్వీజల్ అగ్ని ఔర్‌పౌన్, కంఠ్‌మాహీఁలగీ రౌంధన్‌హౌస్
చారోఁతత్త్వ భాస్ ఔర్‌స్వాన్స, యహాఁసె చలే ఖిచెఆకాశ్.
దోదల్ కమల్ కాల్‌కేదేశ్, కరమ్ అనూసార్ ఖాఁపవేశ్.
(సార్‌బచన్ శ్రీరాథాస్వామి)

# బ్ర హ్మాం డ ము

కాల్‌దేశమనబడు బ్రహ్మాండమందలి అణుసోపానములను కనుకొందము:— మానవమానసము యందు రేకెత్తుచుండు తలంపులయొక్క సారాంశము, వాని ముఖమునందు ప్రతిబింబస్వరూపమున స్పష్టముగ కాననగుచుండుట సహజమే గనుక మానవుని ముఖము:— వాడు విశ్వసించియున్నట్టి విషయముల జూపెట్టు అద్దము, లేక తెరువబడియున్న గ్రంథమువంటిదేను. సంతానమునందుగూడా వీని స్వభావము వ్యక్తమగుచుండును. ఇదియొక ప్రకృతిసిద్ధ శాసనము గనుకనే! ఛాయాస్వరూప పిండాండమున కాధారముగ పరివ్యాప్తమై యున్నట్టిదానినే! బ్రహ్మాండమందురు. బ్రహ్మమనగా:— బ్రహ్మాండమునందు మనస్సే యగుగాని మరేద్దియునుకాదు. ఏటులైతే, ఈ బ్రహ్మాండమనస్సు కలదో, అటులే తచ్ఛాయారూపమనస్సు పిండాండమునగలదు. ఇందలి పిండాండమనస్సు శరీరముతోకలదు. మఱియు బ్రహ్మాండమనస్సు బ్రహ్మాండ

మున వెలసియుండును. ఎటులైతే, మానవునితలంపులు వాని యొక్క ముఖమునందున్నూ ప్రతిబింబించు చుండునో; అటులనే బ్రహ్మాండమనస్సు, లేక బ్రహ్మముయొక్క తలంపులు బ్రహ్మాండ ములో తనఛాయను ప్రసరింపజేయుచుండును. ఎన్ని సోపానములు మనయందుకలవో; ఇటులనే బ్రహ్మాండము నందున్నూ వెలసియే యున్నవి. స్థూల సూక్ష్మభేదము మాత్రము కలిగియుండును. ఉండవలసినదేగదా! గాని, నిజత్వమునమాత్రము భేదములేదు. ఇంతేగాక:—

మనయొక్క శరీరముయందలి క్రింది ఐదు చక్రములు, లేక సోపానములకు పైనగల చివరచక్రమగు ఆగ్నేయమునందలి జీవాత్మనుండి చైతన్యము మఱియు బలమెటుల ప్రసాదింప బడునో! ఇదేవిధముగ బ్రహ్మాండముయొక్క పైభాగము, లేక శిఖరమునగల ధుని, లేక కర్తవలన దిగువనగలవాటికి చైతన్యము మఱియు బలము ప్రసాదింపబడుచుండును. మఱెటులైతే మన శరీరమందలి గుదాచక్రము:— చత్తను బయలుపఱచునో! అటులనే బ్రహ్మాండ క్రిందిభాగమున జరుగుచుండును. అయినను శ్రీగురు మతానుయాయుల సత్సంగసేవకులు కానివారికిని; సురతశబ్ద మార్గాభ్యాసులు గానివారికిని; ఈ రహస్యము బోధపడుట కష్ట సాధ్యమేయగును. మఱియు:—

ఈ బ్రహ్మాండముయొక్క ధుని, లేక కర్త మహాశూన్య మను నామముగల స్థానమున నెలకొనియుండును. దీనిమూలము ననే దిగువ సోపానములకు నిజచైతన్యము, బలమున్నూ ప్రసా దింపబడుచుండును. మఱిదియే! పైభాగమునకుపకరింపని చైత న్యమును, మనయొక్క గుదాచక్రమువైపు పడవేయునదియును.

ఈ మహాశూన్యమను సోపానము, మనయొక్క మస్తిష్క పైభాగ చివరకలదు. దీనికి దిగువన శూన్యమను సోపానముగలదు. ఇది మనయొక్క కంఠచక్రమునకు పోలిన, లేక అనురూపముగ నుండును. మఱియు వేటినైతే పురుషప్రకృతులందురో! అయ్యవి ఈ స్థానమునుండియే ప్రకటింపబడును. దీనియొక్క ఛాయా రూపభావము మన కంఠచక్రమునందుండును. ఈ శూన్యసోపాన మునకు క్రిందిభాగమున త్రిపుటినామిస్థానముకలదు. ఇచ్చటనే:— మనశరీరమునందలి హృదయ, నాభి, ఇంద్రియచక్రములయొక్క నైజస్వరూపము వెలసియుండును. మఱీ సోపానమున నిజబ్రహ్మ విష్ణుమహేశ్వరులు వెరసియుందురు. వీరలు:— హృదయ, నాభి, ఇంద్రియచక్రములందు ఛాయామాత్రులైయుండి వ్యవహరింతురు. కావుననే! దీనియందు మూడు ధారాప్రవాహములున్నవి: ఇయ్యవి కల్గియుండు కారణముననే! దీనికి త్రిపుటియను నామమేర్పడి నది. దీనికి దిగువనగలది సహస్రారమను సోపానము. ఇంతేగాక:—

పిండాండసోపానములందలి ఛాయాచైతన్య ధారాప్రవాహము వలెనే! బ్రహ్మాండసోపానములందలి నిజచైతన్యము, ఒకదానితో మరొకటి లంకెగాను; ఏకమఱియు సంయుక్తముగను ప్రవహించు నని తెల్లియువలెను. మఱియునెటులైతే మనో బుద్ధి చిత్తాహంకార స్థానము హృదయచక్రమో! అటులే బ్రహ్మాండమున బ్రిహ్మము (ఎవడైతే బ్రహ్మాండమనస్సనబడునో!) ను:—చైతన్యుడుగా నుండ జేయునట్టి ధారాప్రవాహము అంతకు పైనుండివచ్చును. ఇందలి చైతన్యప్రభావమతి సూక్ష్మమైనదని జ్ఞప్తియందుంచవలెను. ఇచ్చట పిండబ్రహ్మాండసోపాన స్థాన, భూత, ధని, తత్వములను గాంచుడు:—

| పిండాండము | | | | | బ్రహ్మాండము | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| సంఖ్య | సోపానము | స్థానము | భూతము | ధని | సంఖ్య | సోపానము | స్థానము | తత్వము | ధని |
| ౧ | మూలధార చక్రము ద,౪ | గుదా | పృథివి | గణపతి | ౧ | సహస్రారము (ద, ౧౦౦౦) | మస్తిష్క ప్రారంభము | గంధము | జ్యోతినిరంజన్ (విరాట్) |
| ౨ | స్వాధిష్టాన చక్రము ద, ౬ | ఇంద్రియ | జల | బ్రహ్మ | ౨ | త్రిపుటి. (అ) | ,, | రసము | శబ్దబ్రహ్మము లేక |
| ౩ | మణిపూరక చక్రము ద,౧౦ | నాభి | అగ్ని | విష్ణు | ౩ | త్రిపుటి. (ఉ) | ,, | రూపము | అంతర్యామి |
| ౪ | అనాహత చక్రము ద, ౧౨ | హృదయ | వాయు | శివ | ౪ | త్రిపుటి. (మ) | ,, | స్పర్శ | ,, |
| ౫ | విశుద్ధచక్రము ద, ౧౬ | కంఠ | ఆకాశ | దుర్గ | ౫ | శూన్యము | ,, | శబ్దము | హిరణ్యగర్భ |
| ౬ | ఆగ్నేయ చక్రము ద,౨ | భ్రూమధ్య | జీవుడు | ఆత్మదేవ | ౬ | మహా శూన్యము | మస్తిష్క చివర | మహా తత్వం | పరబ్రహ్మము |

—: బ్రహ్మాండ ప్రళయము :—

దేహీ కారజ్ పృథ్వి హెూయి , పృథ్వీనే గర్సీపన్ సోయి
పృథ్వీ ఘోలి జల్ నే ఆయె , జల్ కో సూఖా అగ్నీ ఖాయె.
అగ్నీ మిలీ పవన్‌కే రూప్, పవన్ హుయీ ఆకాశ్ సరూప్.
ఆకాశ్ సమాన మాయామాః, తమ్‌రూపా దేఖే కుఛ్‌నాః.
మాయారలీ బ్రహ్మమేఁ జాయే , శక్తీ శివ్‌మేఁగయీసమాయె.
శివ్‌పాంహ్చే ఓంకార్‌మఁఝార్ , ఓంకార్ సమానె సున్న్‌కేద్వార్
సున్న్‌క్యా మహాసున్న్‌నివాస్ , భంహర్‌గుఫా మహాసున్న్‌కాబాస్.
యహాఁతక్ ప్రళయ్‌కభి కభీ హెూయి , సత్తలోక్‌కా ద్వారాసోయి.
ప్రళయ్ గతీ ఆగేనహీఁ భాయి, సత్‌లోక్ మేఁ కభీ నజాయి.

# పరబ్రహ్మాండము

ఇఁక దయాళ్‌దేశమను పరబ్రహ్మాండ వివరమును కనుగొన జూచెదము:- ఈలోకవివరము ; బ్రహ్మాండవివరమునకన్న కష్టతరమైనది. ఇదనుభవైకవేద్య విషయమైనను పలుకులకందునంతవరకు తెల్పబడుచున్నది. సర్వసామాన్యముగ మానవులు ; మనస్సు మఱియు దేహమునే సర్వస్వమనుకొందురు. మఱికొందరు మనస్సునే! ఆత్మయనుకొందురు. ఆత్మయను పేరెత్తినచో, అది యొక భ్రమయందురు. గాని మహాఋషులు మనస్సునాత్మ కాదని స్పష్టముగ నిరూపించియున్నారు. ఆత్మను సచ్చిదానందమనియు వ్యక్తపరచి యున్నారు. మఱియు శక్తి , పరికరము , పనిజరుగు స్థానమనునవి ఎల్లెడల గానబడుచునే యుండును గదా ! ఇందలి శక్తియే ఆత్మ. పరికరమే మనస్సు. స్థానమే శరీరమగును. కాబట్టి పరబ్రహ్మాండము , బ్రహ్మాండము , మఱియు మాయాండమను

మండలములు గల వనుటలో సంశయ ముండరాదు. ఇందొక లోకము ఆత్మది. రెండవది మనస్సుది. మూడవది భూతములదని అంగీకరింపవలసి యుండును. Electric current అనబడు విద్యుశ్శక్తి:– పరికర తోడ్పాటుచే ప్రవహించి కార్యసాధన కుపక రించుచున్న విషయ మందరకును తెలిసియున్నదే గనుక, ఈ పెనగొనియున్న ముప్పరికి ఆధార మఱియు సారవస్తుస్వరూపమే! నాలుగవపథము; లేక సత్పథ మనబడునని గ్రహించవలయును. ఇంతేగాదు:–

ఎటులైతే పిండాండము బ్రహ్మాండముయొక్క ఛాయయో! అటులే బ్రహ్మాండమున్నూ మఱియునొక శక్తియొక్క ఛాయ యగును. ఆ శక్తియే పరబ్రహ్మాండ మనబడును. ఇందుచే మానవ శరీరము మఱియు మానవకార్యక్రమము; బ్రహ్మాండము, మఱియు బ్రహ్మాండకార్యక్రమము ఎదుట పనికిమాలినదగును. ఇటువలెనే, బ్రహ్మాండము మఱియు బ్రహ్మాండ కార్యక్రమము ; పర బ్రహ్మాండము మఱియు పరబ్రహ్మాండకార్యక్రమము ఎదుట పనికి మాలినదే యగును. ఏలయన, సత్తే ఆధారము. మిగతవి దాని యొక్క ఛాయాస్వరూపములు మాత్రమే యగును. కాబట్టి ఈ సత్తను అదిస్థానమూలమున వెలువడినట్టి సృష్టియొక్క రచనలో, ప్రతిచోటనూ భాండాగారమే భాండాగారముగ వ్యక్తమైయుంటచే, పరమాత్మాంశములు, లేక వాని కిరణములతోగూడినట్టి భాండా గారము మనకు గోచరమగుచున్నది. మఱియు:–

ఎటులైతే పిండ మఱియు బ్రహ్మాండసోపానములు వివరింప బడినవో యటులే, అనుభవజ్ఞులగు సంత్ సత్పురుష ప్రవచనాను

సారము పరబ్రహ్మాండముయొక్క సోపానముల నిచ్చటగాంచుడు. ఒకటవ సోపానము:– భుంహర్‌గుఫా. రెండవ సోపానము:– సత్. మూడవ సోపానము:– అనామి. నాల్గవసోపానము:– అలఖ్. ఐదవ సోపానము:– అగమ్. ఆఅవదానిని గమ్యస్థానము, సత్పథము, మఱియు ధృపథములందురని తెలియవలయును.

| సంఖ్య | సోపానము | స్థానము. | తత్వము | ధ ని |
|---|---|---|---|---|
| ౧ | భుంహర్‌గుఫా | ప్రారంభమేథా | ఆత్మ | సోహింగ్‌పురుష్ |
| ౨ | సత్ | ,, | ,, | సత్పురుష్ |
| 3 | అనామి | ,, | ,, | అనామిపురుష్ |
| ౪ | అలఖ్ | ,, | ,, | అలఖ్‌పురుష్ |
| ౫ | అగమ్ | ,, | ,, | అగమ్‌పురుష్ |
| ౬ | సత్‌పథము | ,, | ,, | ధృపథము |

ఈ పరబ్రహ్మాండ రచనావైఖరిని వివరింప నుంకించుచో:– ఇయ్యది కల్పకల్పాంతరములును, యుగ యుగాంతరములును సాలెపురుగు, లేక సాలీడు తన నోటినుండి పాదొట్టు (బూసి) లేక వలనల్లియును తిరిగి మ్రింగునటులే సాగిపోవుచుండును. ఏలయన, ఆ బూసి దానినుండియే వ్యక్తమయ్యు ఐక్యమగుచున్నట్లీరచన ఏర్పడి లయించుచున్నది. దీనికంతటికిని మూలకారణము సర్వ సంరక్షణ కర్తయగు పరంధాముడేనై యున్నాడు. అభ్యాసము, లేక సాధనసంపత్తివలన ; స్వభావపొరలు చించిత్రెంచబడి విశాల దృక్పథమేర్పడునప్పుడు మాత్రమే దీనిగుట్టు బోధపడును. గాని ;

వివరించుటకు:— పలుకులకలవిగాక, దృష్టికందక పొందకుంటచే విధిలేక సామ్యమును గైకొనక తప్పుటలేదు. అయిన నీ సామ్యమును గైకొన్నను వొకవైపునే చూపెట్టును. గనుక పరిభ్రమకు లోబడక, ఆవరణ కంటక, అతి నిధానముగా పరికించవలసి యుండును. ఎటులనగా:—

ఈ జగద్రచనయొక్క దృశ్యము:— సముద్ర పోటుపాటుల సామ్యముగ యుండును) ఇట్లే ఉపనిషత్తులందును సామ్యముగ ప్రయోగించియున్నారు. యోగులనుష్ఠించు రేచక పూరక కుంభకములవలె, లేక మనము శ్వాసను లోనికి బయటికి నడపునటుల. ఇట్లనగా:— ఎప్పుడైతే చైతన్యప్రవాహము బహిర్ముఖమగునో సృష్టి యగును. అయ్యదంతర్ముఖమైనప్పుడు ప్రళయముసంభవించును. అది నిలచియుండునపుడు స్థితియనబడును. ఐన నాద్యంతముల గనిపెట్టుట కష్టతరమే యగును. కావున; అసలుద్దేశమును కనిపెట్టి జూడవలయుగాని, పలుకుల జంజాటమున చిక్కరాదు సుమా!

**మరియు:—**

చైతన్యప్రవాహ మెల్లప్పుడున్నూ వలయాకారమున ప్రవహించుచుండుట కద్దు, లేక సహజమగుటచే చైతన్యధారాప్రవాహ మొక కేంద్రమునుండి మరియొక కేంద్రమునకు ప్రవహించుటలో ముళ్లు, గ్రంథులు లేక చక్రములుగ ఏర్పడుచుండును. ఇయ్యవియే, లేక ఈ గుండ్రని ఆవరణలే! రచన ప్రకటింపబడుటకు కారణములు. గనుకనే, రచనలో ఏద్దానిని చూచినను గుండ్రము గనే యుండుచుండుట గాననగును. యోగులు:— సూక్ష్మమనస్సున్నూ వలయాకారముగ నుండునని వాదెదరుగాని, ఘనము

సంకుచిత దృక్పథులమగుటచే మిక్కిలి విశాలప్రదేశమును గాంచ జాలక నయ్యది గుండ్రనిదని తెలియనేరకున్నారము. అయినను; యోగులు దీనిని కుండలియని పేర్కొన్నారు. ఏదైతే మూలాధార చక్రస్థయై పైస్థానమునందు, అనగా:- ఎచ్చటనైతే ప్రకాశప్రకటన యగునో! ఇట్లనగా:- సహస్రారమునందు దీనిమూతి తెరువ బడును. కాబట్టి :-

ఈ జగద్రచన యనునదొక ఉద్దేశమునువీడి లేదని తెలియ వలసియుండును. చైతన్యప్రవాహము ఆత్మికముగా బ్రహ్మాండ పిండాండములందు ; నిజ మఱియు ఛాయాస్వరూపములతో పని చేయుచున్న దగుటచే:_ ఏ స్థానమును పరికించి చూచినను క్రమ బద్ధము కానవగును. ప్రకృతి యనబడునది:_ చైతన్యశక్తిని అనుస రించి , లేక అంటియుండియే నడచుచుండును. ఇందువలన , ఎచ్చట గనిపెట్టినను మూడు పరిస్థితులు గోచరమగును అందొకటి సౌందర్యము. రెండవది తెలివి. మూడవది అవసరము , లేక అక్కరనునది. చూడుడు:- ఏనుగుతొండము మఱియు ఒంటె మెడయున్నూ పొడావుగ కలవు కలిగియున్నవి. ఏలయన; ఇయ్యవి మరొకవిధమున నున్నచో వాటి యవసరములు నెరవేరజాలవు గదా! గనుక:_ ఉన్నదొకటె తత్వమైననూ, మనయొక్క స్థూల దృష్టికది రెండుగ గానబడుచున్నది. గాని ప్రకృతి , మాయ , లేక జగత్తుయొక్క సృజన ఏకే యేకైకచైతన్యకర్త, లేక ఆత్మవలననే కలుగుచున్నదనుట సుస్పష్టము. అయ్యది రెండు పార్శ్వములుగ గానబడుటచే వీటిని ; ఇంగ్లీషులో "Positive & Negative" అందురు. ఇయ్యవి కలసిమెలసి వ్యవహరించుటచేత , రచన ఏర్పడుచుండునని తెలియవలసియుండును.

సంత్, సత్పురుష, లేక శ్రీగురుమతము యొక్క ప్రవచ నానుసారమీ రచన:- రెండు విధములైన మండలములు కలవు. ఇందొకదానియందు; అస్తిత్వముయొక్క ధారాప్రవాహము సంఘీభూతమై ఘనీభవించియుండును. రెండవ దానియందు సంకుచితముగ పరివ్యాప్తమై యుండును. ఈ రెండు మండలములున్నూ కలయికగా నుండు కారణమున అస్తిత్వ ధారాప్రవాహము; ఒక దానినుండి రెండవ దానియందు రాకడపోకడ కలిగియుండును. గనుక, ఈ వచ్చిపోవుటలయొక్క నామమే! "జగత్" అన బడును. ఇందులో మొదటిమండలము:- సత్‌పురుష శిరమనియు; రెండవదానిని పాదములనియు పేర్కొందురు. సనాతనమత పురోగాములు:- మొదటిదానిని దివ్, దివ్వ, లేక దివి యనియు; రెండవదానిని భూమి యనియును; ఈ రెండింటి మధ్యస్థమును అంతరిక్షమనియున్నూ పేర్కొనియున్నారు. దివియందు సత్తా ఘనీభవించి యుండునట్టిదానిని; ఇంగ్లీషులో:- "Polarisation of energy" యందురు. కావున, మనయొక్క శిరము మఱియు పాదముల నీ మండలములతో సరిపోల్చవచ్చును ఎటులన; మన యొక్క సత్తా శిరస్సువైపునుండి ధారాప్రవాహరూపమున క్రిందికి దిగి, దిగువ భాగములకు బలమును చేకూర్చుచుండును కాదా? ఆ చైతన్యము రాకున్నచో ఈ అవయవములు, శవ రూపమును దాల్చును గదా! ఇందుచే, ఈ రెండు మండలములయొక్క పరిస్థితిని గ్రహించగలుగుచో; ప్రారంభమున పేర్కొన్నట్టి మూడు మండలముల, లోకముల, లేక దేశములయొక్క పరిస్థితియును సులభముగా బోధకు రాగలదు.

అస్తిత్వము:— సత్లోకము, లేక మండలమునుండి దిగువకు ప్రవహించి స్వచ్ఛమైన చైతన్యము సూక్ష్మప్రకృతితో భుంహర్ గుఫాను చేరి (దానికిదియొక నాక, నిర్గమస్థానము, లేక విడది) మహాశూన్యస్థానమునుండి, శూన్యద్వారా త్రిపుటి మఱియు సహస్ర దళకమలముయందు పనిచేయుచు బ్రహ్మాండరచన గావించును. తదుపరి:— ఈ బ్రహ్మాండమునకు ఉపకరింపజాలని, లేక అందులో లయింపనేరనట్టి చైతన్యధార్ పిండప్రదేశమునకు దిగి, ఇచ్చటి రచనలో నిమగ్నమగును ఈ రచనలో వ్యవహరించునట్టి:— చైతన్య ధారాప్రవాహమునందేర్పడు వలయములే! జీవ, లేక ప్రాణికోటుల యొక్క ఉనికి స్థానములు, లేక జీవకోటులై యున్నవి. ఇందలి అస్తిత్వము, లేక చైతన్యము; ప్రస్తుత జీవపరిస్థితికి తగ్గదిగానుండి మూడు స్వరూపములతో వ్యవహరించుచుండును. మఱియును:— ఇందలి చైతన్యము ఊర్ధ్వమునకు ఆకర్షింపబడినప్పుడు పీనుగ రూపొంది, ఇందలి భూతములు (మసాల) దేని మండలమునకది చేరుకొనుచుండును. కావున చైతన్యధారాప్రవాహము దిగుటనే రచన, లేక సృష్టి యందురనియు; అది పైకి ఆకర్షించి లాగబడుటనే ప్రళయమందురనియు; ఈ రెంటికిమధ్యస్థ వ్యవహారమునే స్థితి యందురనియును గుర్తెరుంగవలయును.

అస్తిత్వమును కలిగియుండునదే! సత్ అని యనబడును. మఱియు, అస్తిత్వము తన్ను ప్రకటించుకొన కెట్లుండగలదు? కాబట్టి:— ప్రప్రథమమున సర్వాధారమైనట్టి సత్యమ్, లేక ఆత్మత్వము తప్ప యిదియులేదు, అది యనునదియు లేక సర్వ శూన్యనిరాలంబ ఉన్మని సమాధ్యావస్థగా నుండెననవచ్చును. ఆ స్థితినుండి చైతన్యధారాప్రవాహము; నానావిధరంగులతో బయలు

దేరెను. అందులో ముఖ్యమైనవి:— ౧. తెలుపు ౨. పసుపు. ౩. నలుపువని తెలియవలయును. తెలుపువి:— చైతన్యధార్, లేక కిరణములు. పసుపు, లేక భూరారంగువి:— ప్రకృతి, లేక మాయా కిరణములు. నలుపు, లేక బూడిదరంగువి:— మనో కిరణములు. గనుక మాయామనస్సులు స్వతంత్రముగ రచించజాలనివగుటచే, చైతన్యధార్ తోడ్పాటు నాధారముగాగొని, లోక లోకాంతర సూర్య చంద్రాదుల ప్రకటించెను. ఎటులైతే మనయొక్క ఇంద్రియములు దేనికవే పనిచేయుచున్నను, చైతన్యము యేకమేనయ్యు అన్నిటి యందును పనిచేయుచున్నదియో! అటులే ఈ సర్వమునందును చైతన్యము కలిగియున్నది. సూక్ష్మాతి సూక్ష్మ మండలముల యందును, చైతన్యనాటక రచన కలదు. మనము సంకుచిత దృక్పథులమగుటచే నయ్యవి, వేరువేరుగా నున్నటుల గోచర మగుచున్నది. గాని రచన యందవన్నియు:— మనయొక్క శరీర మందలి ఇంద్రియములలో దేనికది ప్రత్యేకసామర్థ్యముతో పని ముట్లుగా పనిచేయుచు నొకేశరీరమునకు సంబంధించియున్నట్లు; ఏకే యేకైకకుటుంబ పరివారమునకు చెందియున్నవి. అనగా:— మన శరీరములో భాగములెన్నియో కలిగియున్నను, అన్నింటికిని నొకే చైతన్యమువలన ప్రాణము కలిగియుండి యొకేజీవితమునకై ప్రత్యేకముగ కృషి నొనర్చుచున్నట్లు; మండలములన్నియు గొలుసు యందలి కడియములవలె కలసియేయున్నవి. ఇందలి చైతన్యము మాత్రము; అ జ రా మ ర యవినాశియై యున్నది. మఱియు, మార్పులన్నియు క్రింది తరగతులలోనే కలవు. గాని, పైభాగమున మార్పు అనునది నామకార్థమైననూ లేకుండుటయే గాక ప్రళయ మున్నూ కలుగదు. మనయొక్క ప్రాణము, ఆ సముద్రమందలి

యొక బిందువు మాత్రమే ! దీనికి చావనునది లేదు. చచ్చిపోతా నని ఉరినిపెట్టుకునువారు చావడములేదు గాని, తమ శరీరమును మాత్రమే చంపుకొనుచున్నారు. ఇట్టివారలు అప్పటిపరిస్థితిని తప్పు కొన జూచినందులకు శిక్షగా, మరొక శరీరమును దాల్చి రెట్టింపు ననుభవింపక తప్పదని తెలియవలసియుండును. ఇదిటులుండగా:—

పిండ బ్రహ్మాండ సూర్యచంద్రాది నక్షత్రములన్నియు:— వీటన్నిటికి భాండారమైయున్న బలవత్తరకేంద్రము చుట్టుతిరుగు చుండుటయు సహజమే నైయున్నది. ఇందేదైన గోళము:— ప్రకాశ మానము, లేక కాంతివంతమైన గోళమున కభిముఖమై కలయిక సంభవించుచో, దీనియందొక విధమైన మార్పు, లేక ప్రత్యేక బలమున్నూ చేకూరును. ఇంతేగాదు; ఈ సందర్భమున అందలి రమణీయ, లేక పవిత్రప్రాణులు క్రింది గోళమున చేరుకొనుటయు కద్దు. అవి తమస్పర్శవలన అచ్చటిజీవులకు మేలొనగూర్చుటయు జరుగుచుండును. ఇటువలెనే ! పవిత్రజీవులు ఈ భూమండలము యందును జన్మించుచు, ప్రయత్నమెద్దియును లేకుండానే జ్ఞాన ప్రపూర్ణులైయుండి, అసంఖ్యాకజీవుల నత్యద్భుతముగా నుద్ధరించి తరింపజేయుచుందురు. వీరియందు బిజిలీ లేక ఎలక్ట్రిక్ కరెంటు వలె ఆకర్షించగల శక్తియు కలిగియుండును ఇట్టి వీరినే:- సంత్, సత్పురుషులు, మహాత్మురుషు లందురు. అధ్యాత్మిక దృక్పథము కలవారు; వీరియొక్క మేధాసంపత్తికి అచ్చర్వొందుచుందురు. ఇతరులు ఇద్దానిని విశ్వసింపక ఎగతాళి చేయవచ్చును గాని; చారిత్ర్యక పరిశోధకుల కిది క్రొత్తవిషయము కాదుగదా! ఇందు లకు సామ్యమును చూపెట్టవలయునన్నచో:— **మొన్న మొన్ననే అంతర్ధానమైనట్టి శ్రీ గాంధీ మహాత్మునినే గాక.! శ్రీ రామకృష్ణ**

వివేకానంద, మహర్షి శివబరతులను జ్ఞాపకమునకు తెజూచినచో సత్యము సువేద్యమవగలదు.

## జగత్ సృష్టి

సబ్‌కీ ఆదికహూఁ అబ్‌స్వామి, అకః అగాధ్ అపార్ అనామి.
తిన్‌సే అగమ్‌పురుష్ ప్రగటాయె, అగమ్‌లోక్‌మేఁ ఆసన్‌లాయె.
అలఖ్‌పురుష్ కా హువా ఉజాలా, అలఖ్‌లోక్ ఇన్ చౌకీడాలా
ఫిర్ సత్నామ్‌పురుష్ సత్‌సోయీ, సత్యసత్యరచ్నా జహాఁహుయీ.
సత్యలోక్ వొహధామ్ సొహేలా, హంసకరేఁ జహాఁ అచరజ్‌ఖేలా.
ఇన్ లోకన్‌కీ మహిమాభారీ, కహూఁకహా అద్భుత్ బిస్తారి.
సహస్ అఠాసీ దీప్‌నివాస్, హంస్‌కరేఁ జహాఁ సదా బిలాస్.
సుఖ్‌కా ధామ్ సదాసుఖ్ వహాఁ, దుఃఖ క్లేష్‌కా నామ్ నవహాఁ.
నయినయిలీలా సదా ఆనంద్, హంస్‌కరేఁ నిత్ పరమానంద్.
అమీ అహార్ భోగ్‌ప్రచండ్, సచ్ఛ్‌ఖండ్ వొహధామ్ అఖండ్.
తహాఁసే భుహర్‌గుఫా రచ్‌రాఖీ, సోహింగ్‌పురుష్‌నామ్ కహభాఖీ.
మహాసున్న్ ఏక్ రచాఠికానా, దీప్ అచింత్ మహామైదానా.
తిన్‌కే నీచే సున్న్‌బిలాస్, అక్షర్‌దీప్ రకార్ ప్రకాశ్.
వహాఁసే రచా త్రికుటీధామ్, ఓంకార్ కా జహాఁ బిస్రామ్.
వేద్ కుతేబ్‌కా యహీమొఖామ్, త్రిలోకీకా కారణ్‌ధామ్.
ఝుంజరీదీప్‌కీ రచన్‌రచాయి, త్రిగుణ్‌కాల్‌కీ జహాఁరక్రాయి.
గుణ్‌తీనోఁ యహాఁసేఉత్పానే, బ్రహ్మ విష్ణు మహేశ్ కహానే.
యహాఁసే సర్గుణ్ రచా పసారా, చార్ ఖాన్ ఉత్పత్తి బిస్తారా.

— (సార్‌బచన్ శ్రీ రాధాస్వామి)

# జగదోత్పత్తికాల నిర్ణయము

జగదోత్పత్తియనగా:— సృష్టిరచనయగుట. ఇట్లనగా:— ముక్త ప్రకృతియొక్క పరస్పరసంఘాతము, లేక పరమాణువులయొక్క సమిళ్లితరచన యేర్పడుటయగును. ఈ రచన ప్రారంభమై, పృథివిగనేర్పడి గడచియున్నట్టి అయుఃపరిమితిసంఖ్యలో; ప్రపంచ మందలి వైజ్ఞానికుల నిర్ణయకాలమును ప్రప్రథమమున గమనింతము:— ఈ వైజ్ఞానిక పరిశోధనయందలి (౧) సూర్యతాపమునను సరించి; ౧. కోటి. ౮౦. లక్షలనుండి రెండుకోట్ల సం॥ ల వరకనియు (౨) భూతాపమునను సరించి; ౨. కోట్లనుండి ఆఱుకోట్ల సం॥ వర కనియు. (3) సముద్రజలముద్వారా; ౧౦. కోట్ల సం॥ వరకనియు (౪) భూగర్భశాస్త్ర మఱియువికాసవాదులు(Evolution theory) ౧౦. కోట్ల సం॥ వరకేయనియు. (౫) రేడియోయక్టువిటి. (Radio activity) ననుసరించి; 3౭. కోట్ల సం॥ ల వరకనియునిర్ణయించియున్నారలు. ఈనిర్ణయములు:— నానాప్రకారములుగా నుండుటచే విశ్వాసయోగ్యము లనబడజాలకున్నవి.

ఇంక భారతవర్షమునందలి ఆర్యులన్ననో:— పృథివియొక్క సృష్టివ్యవధిలో, చాతుర్యుగ కాలపరిమితి సంఖ్యను; ౧౨౦౦౦. దివ్యవర్షములు, లేక దేవసంవత్సరములని తమ పరిశోధనాపరిగణనయందు నిర్ణయించియున్నారు. మఱియు, భౌద్ధులు; పౌరాణికులు; పారశీకులు; (Percion) బేబిలోనియనులు; (Babylonian) ఈరానీయులు, లేక స్కండినేవీయనులు (Scandenavion) నూ తమతమ పరిశోధనాసంఖ్యను, ఆర్యులవిధముగనే కనపఱచియున్నారని తెలియవలయును. ఇదిటులుండగా:—

ఈ యుగసమస్యను, బహువిచిత్రవైఖరితో శతపథ బ్రాహ్మణ మందలి అగ్నిచైనప్రకరణము ; (౧౦-౪-౨-౨౨)లో:— ఋగ్వేద మునందలి అక్షరములతో ప్రజాపతి. ౧౨౦౦౦. దివ్యవర్షములను బృ హ తి శ్ఛ ం ద స్సు (౩౬. అక్షరములుగల) లుగా నొనర్చెను. అనగా:— ౪౩౨౦౦౦. అక్షరములగును. మఱి యజుర్వేద. ౮౦౦౦. మఱియు సామవేద. ౪౦౦౦. కలసి. ౧౨౦౦౦. వేలకన్నియే! అనగా:— ౪౩౨౦౦౦ అక్షరములగును. వీటినొకవేళ పఙ్క్తిశ్ఛందస్సు (౪౦ అక్షరములుగల) లుగా నొనర్చుచో; ౧౦౮౦౦. ఛందస్సు లగును. మఱియు మొదటి ఋగ్వేదాక్షరములకున్నూ ; వీటన్ని ఛందస్సులేయగును. ఇంతేగాదు, ఒక సంవత్సరమునకు. ౩౬౦. దినములని. ప్రతిదినమునకు ౩౦. ముహూర్తములగుటచే, ౧౦౮౦౦ ముహూర్తము లగుననియుగలదు. ఇందు ఈ ముహూర్తములనుండి సంవత్సర, యు గ, చతుర్యుగాదులయొక్క సంఖ్యలనున్నూ చూపెట్టబడియున్నవి. మఱియు, అథర్వ, వే (౧౦-౭-౯) లో:—

కీయతాస్కంభః ప్రవివేశభూతం, కియద్ భవిష్యదన్వాశయేస్య,
ఏకంయదంగమ్ కృణోత్సహస్రదా కియతాస్కంభః ప్రవివేశతత్ర.

ఇట్లనగా:— ఇందలంకారముతో, భూతభవిష్యత్కాలగృహము సహస్ర స్తంభములచే నిర్మింపబడినదని కలదు. అనగా:— ఒక కల్పమునందు సహస్రచతుర్యుగములు కలిగియుండునని వర్ణింప బడియున్నది. ఇందులకుసంక్షేపముగా అథర్వ, వే. (౮-౨-౨౧)లో:—

"శతంతేఅయుతంహాయనాన్ద్వేయుగే త్రీణిచత్వారిక్రిణ్మః."

అనగా:— శతఅయుతవర్షములకు (అయుతమునకు పదివేలు) మొదట. ౨, ౩, ౪. సంఖ్యలను చేర్చుచో కల్పసంఖ్య వెడలును

అనియుగలదు. అనగా:— ౪౩౨౦౦౦౦౦౦౦, సంవత్సరములగును. ఇదియే సహస్రచతుర్యుగసంఖ్య. దీనినే! ఒక బ్రహ్మదినము, లేక కల్పసంఖ్యయందురు. మఱియు, యజుర్వేద (౩౦-౧౮)లో:—

"కృతాయాదిన్వదర్శం, త్రేతాయ్యై కల్పినమ్,
ద్వాపరాయాద్ధికల్పినమ్, అస్కందాయ సభాస్థాణ్ణుమ్."

అనగా:— నాలుగు యుగనామములను తెల్పుచు, మఱియు నాలుగుకలయుగ సమ్మిళ్లిత సంఖ్యయొక్క నామమే కృత, లేక సత్యుగమనియు, మూడు కలయుగములువెరసి త్రేతాయుగమగుననియును, రెండుకలయుగములు కలసియున్నట్టిదే ద్వాపారమనబడుననియును. ఇట్లనగా:— కలయుగము పదిపర్యాయములు గడచిననే! ఒక చతుర్యుగము, లేక మహాయుగమగునని కలదు. ఇంతేగాదు, కర్మఫలితము వలననే, యుగ సం॥ ల సంఖ్యలు క్షీణించుచుండుననియున్నూ కలదని తెలియవలసి యుండును. మఱియు వాల్మీకి రామాయణములోన; (ఇది రచియింపబడి. ౧౨౬౯౦౩౦. మఱిదియే! (శ్రీరామచంద్రానందకుందునికాలము.) మఱియు మహాభారతమునందున్నూ యుగవర్ణన యిదేవిధమున కలదు. ఇదిగాక తైత్త, బ్రా (౩-౯-౨౨) లోననూ:—

"ఏకంవా యేతద్దేవానా మహాయుత్సంవత్సరః" ఇట్లనగా:— మనయొక్క సంవత్సరమనునది, దేవతల యొకదినమగును. ఒక దివ్యవర్షమునందు మనయొక్క ౩౬౦. సం॥ లగునని; మఱియు ౧౨౦౦౦. దివ్యవర్షములకు మనయొక్క, ౪౩౨౦౦౦౦ సం॥ లగుననియుగలదు. ఇదియే! మహాయుగసంఖ్య. దీనికి మూడుశూన్యములను చేర్చుచో సృష్టికాలము తేలుననియు గలదు. పారశీకుల

యొక్క జిందభాషలో:- "ఏతచ్ఐరమ్ ఈయ్యా, అయంతేయత్ యరే." దీనికి సంస్కృతమీవిధ మగును:- "తేచఅహరమ్ మనీయంతే యద్వర్షమ్" అనగా:- దివ్యవర్షమొకటి, మనయొక్క ౩౬౦. వర్షముల సమానమని కలదు.

ఇంతవరకు నాలుగుయుగములయొక్క దీర్ఘసమయ వర్ణనమును:- వేద, బ్రాహ్మణ, ఉపనిషాది ప్రాచీన ఆర్షగ్రంథముల యొక్కయు, విదేశీయులనబడుపార్సీ, ఈరాని, బేబిలోనీయుల పరిశోధనాపరిగణను గూడా వివరించుకొంటిమి. ఇక జ్యోతిష సిద్ధాంతమూలముననూ గమనింతము:-

"అస్మిన్ కృతయుగ్యాయంతే సర్వేమధ్య గతాగ్రహాః,
వినాత్పాదమందోచ్చా నమీశాదౌ తుల్యేతామితాః."
(సూర్యసిద్ధాంతము, ౧-౫౭)

అనగా:- గ్రహములు, తారతమ్యమగుటను అనుసరించి యుగము ప్రారంభమగును. లేక ప్రతియుగారంభ సమయమందు సప్తగ్రహములు సంయుత (ఏకముఖ) మగును. కృతయుగాంతమున, లేక త్రేతాయుగాదిన, అనగా:- యుగారంభములో గ్రహములన్నియు, పాదమందోచ్చమునువీడి మధ్యస్థానమగు మేష రాశిన చేరుననికలదు. మఱియు:- యూరఫీయ ప్రసిద్ధ జ్యోతిష్కుడగు బేల్లీ (Bailly) యను మహాశయుడు పరిశోధించి తెల్పిన దేమనగా:- ఈ కలియుగారంభము, క్రీ. శ. (ఈసవికి) పూర్వము ౩౧౦౨ సం॥ ఫిబ్రవరి, ౨౦ తేది రెండుగంటల. ౨౭. ని॥ ౩౦. సె॥ ల వేళకు సంభవించినదని. కాబట్టి:- ఏతదంశ ఛాయాస్వరూపుడగు ఆర్యావర్త హిందూమానవుడు; తనకు ఆధారభూతుడైయున్నట్టి బహ్మముయొక్క స్వరూపమగు జగదోత్పత్తిలోని యుగ

సంవత్సరగణనను, అనాదికాలముననే కనుగొనియున్నారు. అదె టులన, ప్రాణముచలించి వ్యవహరించుటలో త్రిగుణాత్మక యన బడు మనస్సేర్పడుచున్నది. గనుక దీనిననుసరించియే! దేశ కాల నిమిత్తముల యొక్క పరిజ్ఞానము కలుగుచున్నదని. తెలిసికొని, తన మేధాసంపత్తితో మాత్రమేగాక సూర్య చంద్ర నక్షత్రాది గ్రహ గణము వ్యవహరించుటలో, తనయొక్క విజ్ఞానానుమాన ప్రమాణ ముల తోడనున్నా పనిగొని, జ్యోతిశ్శాస్త్రగణితమును కనిపెట్టి నిర్ణయించి వివరించియున్నారు. మఱియు, ప్రారంభమానవుని నుండి పదునాలుగు మనువులని వారి నామములనీ విధముగా పేర్కొనియున్నారు. అయ్యవియే:-

౧. స్వయంభూః, ౨. స్వరోచ్చః, ౩. ఉత్తమి, ౪. తాయమ్సి, ౫. రేవత్, ౬. చాక్షసి, ౭. వైవస్వత్, ౮. సావర్ణి, ౯. విక్షావర్ణి, ౧౦. ధర్మసావర్ణి, ౧౧. రుద్రసావర్ణి, ౧౨. బ్రహ్మ సావర్ణి, ౧౩. రోచ్యసావర్ణి, ౧౪. ఇంద్రసావర్ణి యనువారలు. మఱియు:-

బ్రహ్మముయొక్క ఒకదినములో; పదునాలుగు మన్వంతర ములు కలిగియుండుననియు. (మన్వంతరమనగా:- మనువుయొక్క ఆద్యంతకాలము) ఒకమన్వంతరములో; డెబ్బదియొక చతుర్యుగ ములు కలిగి యుండుననియును. (చాతుర్యుగమనగా:- కృత త్రేతా, ద్వాపర, కలయుగములనునవి.) మఱియు, చాతుర్యుగ ములో (చాతుర్యుగమునే మహాయుగమందురు) బ్రహ్మముయొక్క దివ్యవర్షములను. అనగా:- సంవత్సరముల వివరమును ఇచ్చట గాంచెదము:-

కృతయుగమునకు దివ్య సం॥ ౪౦౦౦. సంధి ౪౦౦. సంధ్యాంశము ౪౦౦ = ౪౮౦౦. త్రేతాయుగమునకు:— దివ్య సం॥ ౩౦౦౦. సంధి ౩౦౦. సంధ్యాంశము ౩౦౦ = ౩౬౦౦. ద్వాపారయుగమునకు దివ్య సం॥ ౨౦౦౦. సంధి ౨౦౦. సంధ్యాంశము ౨౦౦ = ౨౪౦౦. కలయుగమునకు దివ్య సం॥ ౧౦౦౦. సంధి ౧౦౦ సంధ్యాంశము ౧౦౦ = ౧౨౦౦ మొత్తము సంఖ్య ౧౨౦౦౦ దివ్యవర్షములగును. ఇందులకు:— ఒకదివ్యవర్షమునకు ౩౬౦ సం॥ లను మానవుడేర్పఱచుకొనియున్నాడగుటచే, ౧౨౦౦౦ × ౩౬౦ = ౪౩౨౦౦౦౦ అగును. ఇదియే! చతుర్యుగ, లేక మహాయుగ సం॥ సంఖ్యయనబడును. మఱియు, ఒక మన్వంతరములో ౭౧. చతుర్యుగములున్నూ కలిగియుండునగుటచే, ౪౩౨౦౦౦౦ × ౭౧ = ౩౦౬౭౨౦౦౦౦ సం॥ లగును. ఇంత కాలమువరకు ఆఱు మన్వంతరములు గడచిపోయియుండుటచే, ౩౦౬౭౨౦౦౦౦ × ౬ = ౧౮౪౦౩౨౦౦౦౦. సం॥ లగును. ఇక, ఏడవ మనువగు వైవస్వత మన్వంతరములో:— ౨౭. చతుర్యుగములు గడచి, ౨౮. వ చతుర్యుగములో కృత, త్రేతా, ద్వాపార, కల యుగమునందు(౫౦౫౧సం॥ల) ప్రథమభాగమున్నూగడచినట్టి సం॥ ౧౨౦౫౩౩౦౫౧. తోడకలసి, ౧౯౬౦౮౫౩౦౫౧. సం॥ లు అగును. ఇందులోనుండి కలయుగసంధి, మఱియు సంధ్యాంశము పోగా:— ౧౯౬౦౭౮౧౦౫౧. సం॥ లగును. ఈసంఖ్య శా, శ:— ౧౮౭౨. నాటికగును. అనగా:— క్రీ, శ: ౧౯౫౦ వరకని తెలియవలయును. మఱీ సం॥ముల సంఖ్యయే! మనుష్యోత్పత్తినుండి మనయొక్క కాలక్రమ సంవత్సరపట్టిక యైయున్నది. కాబట్టి, ౧౪. మనువులకాలము:— ౪౨౯౪౦౮౦౦౦౦. సంవత్సరములని. జగదోత్పత్తి ఆద్యంత కాలము:— ౪౩౨౦౦౦౦౦౦౦. సంవత్సరములనియున్నూ గ్రహించవలయును.

ఓమేతత్సత్ శ్రీగురుబ్రహ్మణోర్ద్వితీయ పరార్ధే, వైవస్వత మన్వంతరే, అష్టావింశతి కలయుగ ప్రథమపాదే, ఆర్యావర్తాం తర్గగత భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైల్యుత్తర ప్రదేశే, కృష్ణా గోదావరియోర్మధ్యదేశ భాగ్యనగరే, తెలంగాణ ప్రాంతీయ నీలగిరిమండలాంతర్గత భువనగిరి నివాసే, "తం. ధర్మాచార్య" నామధేయరచయితామ్ విక్రమ, శ. ౨౦౦౬ వికృతినామసంవత్సరే శుభమ్ భవతు.

ఓమ్ తత్సదోమ్

# సోపాన సర్వస్వము

| సంఖ్య | పిండాండము | బ్రహ్మాండము | పరబ్రహ్మాండము |
|---|---|---|---|
| ౧ | మూలాధారచక్రము | సహస్రారము | భుంహర్గుఫా. |
| ౨ | స్వాధిష్టానచక్రము | త్రిపుటి. (అ) | సత్. |
| ౩ | మణిపూరకచక్రము | త్రిపుటి. (ఉ) | అనామి. |
| ౪ | అనాహతచక్రము | త్రిపుటి. (మ) | అలఖ్. |
| ౫ | విశుద్ధచక్రము | శూన్యము. | అగమ్. |
| ౬ | ఆగ్నేయచక్రము | మహా శూన్యము. | ధృపథము. |

## నిర్ధారిత ద్వాదశ చక్రములు

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మూలాధారము | స్వాధిష్టానము | మణిపూరకము | అనాహతము | విశుద్ధము | ఆగ్నేయము | సహస్రారము | త్రిపుటి | శూన్యము | మహాశూన్యము | భుంహర్ గుఫా | సత్యము |

## యోగాంగములు

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|
| యమ | నియమ | ఆసన | ప్రాణాయామ | ప్రత్యాహార | ధారణ | ధ్యానము | సమాధి |

## అష్టసిద్ధులు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అనిమ | మహిమ | గరిమ | లఘిమ | ప్రాప్తి | ప్రాకామ్య | ఈశతా | వశతా |

# ౫వ ప్రకరణము

# సప్తలోకములు

వైదిక మతధర్మమునందలి యౌగిక నిర్ధారితమైన, లేక యోగులయొక్క సిద్ధాంతమందలి:- ఏడు లోకములు, మండలములు, సోపానములు, లేక సప్తభూమికలను నయ్యావియే! భూర్భువస్సువః, మహ, జనః తపస్సత్యములనున వగుటచే, వీటియొక్క పరిస్థితిని పరిశోధనావృష్టితో పరికింతము:-

ఒకటవది సత్, లేక సద్లోకము:- ఏదైతే ఊర్ధ్వలోకమున కలిగియున్నదో, అదియే, అధోలోకముననూ కలదు. పైన సత్తు మఱియు క్రింద భాగమున తచ్ఛాయ కలదు. ఎవరిభావ మెటులున్నను, అస్తినుండి అస్తిత్వము కలుగును గాని నాస్తిత్వము కాదు. ఇందొకటి సత్, రెండవది దానియొక్క ప్రకాశము, లేక అస్తిత్వము. అదెటులనగా:- ప్రకటింపబడనేరని దానిని, అస్తియన జెల్లదుగదా! ఇందుచే:- ఈ అస్తియను సత్యమునే! ప్రకటనా పరిస్థితి ననుసరించి పరబ్రహ్మమని, బ్రహ్మమనియు, లేక ఆత్మ యనియును పేర్కొందురు. ఇందలి ఆత్మ యనగా; అత్:- కదలికగల, లేక చైతన్యము. మఱియు మః-మనన, లేక చింతన యగును. కాబట్టి, ఈ అమృతాత్మయొక్క ప్రత్యేక మూల పదార్థమగు సత్పురుష స్థానమునే! సత్యలోకమనియందురు.

రెండవది తపోలోకము:- సత్‌యొక్క ప్రకటిత స్వరూపమే అస్తిత్వమని తెలిసికొంటిమి. ఈ అస్తిత్వమని పేర్కొనబడు తేజము

తపనయగుట వలన ప్రకాశము , తద్వారా కిరణములు ఏర్పడుట యును , మఱియ్యవి ఉజ్వలముగ వ్యాపించుటయును సహజమే గదా ! ఇటులెచ్చట జరుగునో , అద్దానినే తపోలోకమందురు. ఈ గోళమునందలి ప్రాణులు తపి , లేక తపస్వి యనబడును.

మూడవది జనలోకము:- కిరణ ప్రసారమర్ధనము వలన , జనించుతన మేర్పడి ప్రాణులు కలుగును. మఱియు పుట్టుతనము, పుట్టుక , పుట్టించుట లనునవి తపనమునుండియే ఏర్పడును. ఎటుల యన తపించనివారికి , విజయమనునది నామకార్థమైననూ సంభ వింపజాలదు గదా ! ఇందుచే, జన యనగా:- పుట్టు, పుట్టించుట లగును. మఱీగోళమునందలి ప్రాణులు, తత్సంబద్ధులనబడుదురు.

ఇంతవరకీ మూడు గోళములు , లేక మండలములు దివ్య లోకములనబడును. మఱియు , వీటియందు సత్ , లేక సత్యమే సత్యము. తేజమే తేజము. ప్రకాశమే ! ప్రకాశము కలదు. ఇయ్యది ప్రకృతియొక్క నిజనాటక ప్రదర్శనము. లేక , అత్యంత రమ్య ముగా వేద్యమగు సత్యాత్వదృశ్యమే యిది. కనుక, ఈ పరిస్థితులు:- జ్ఞానప్రకాశతనొంది యున్నవారికి మాత్రమే బోధపడగలవు. ఇంత వరకు ; వీటియందలి కిరణములు చక్రాగా వ్యాపించి వలయా కారముగ తిరుగబడుటచేత , ఛాయాస్వరూప గోళములు ప్రభ వించెనని తెలియవలయును.

ఇక ఛాయాస్వరూపములలో మొదటిది సువర్లోకము:- ఇయ్యది, ప్రకాశముయొక్కయు మఱియు ఛాయయొక్కయు కలయి కానందమండలము. కలయికవల్లనే సంతోషము కలుగును కాదా ? కనుక ఇది జనలోకమును పోలిన, లేక అనురూప మండలమగును.

రెండవది భువర్లోకము:– ఇది తపోలోకమునకు పోలిన, లేక అనురూపమండలము. ఇయ్యది తపన యగుటవలన భూలోకము ప్రభవించెను.

మూడవవదగు భూలోకమున:– ఛాయాసృష్టి, లేక నకిలీ ప్రాణులయొక్క పుట్టుకలు కలిగియున్నట్టి లోకము. గనుక, ఇదన్నిటికిన్ని క్రిందిలోకము. ఇయ్యది సద్లోకమును పోలిన, లేక అనురూపమండలమని తెలియవలయును. కాని:–

ఇచ్చట పొరపడరాదు సుమా! అతినిధానముగ గమనింపవలసియుండును. ఏలయన:– దీపముక్రింద చీకటియనునది కలిగియుండుట సహజమే గదా! ఇందుచే సత్ మఱియు అసత్ యనునవి రెండున్నూ వెనువెంట కలిగియుండుటయు సహజమే యగును. ఇయ్యవి నిజా నిజములు; అనగా:– ఇందలి మొదటి మూడు సత్; లేక సత్యస్వరూపములు. తర్వాతవి నకిలీ లేక ఛాయాస్వరూపములు. అదెటులన:– నీటియొడ్డునగల చెట్టు యొక్క స్వరూపదృశ్యము, ఆ నీటియందున్నూ కనబడునటులే! కిరణములు చక్కగా ప్రసరించి తిరుగబడినప్పు డేర్పడినట్టి రూపములే నియ్యవి మూడు.

మనమింతవరకు, అఱులోకములను మాత్రమే తెలిసికొనియుంటిమి. ఇంక ఊర్ధ్వాధోభాగ, ఉభయలోకములకు మధ్యస్థమున కలిగియున్నట్టి దగు మహర్లోకమునుగూడ కనుగొందము:– ఇయ్యది పైలోకముల మఱియు దిగువలోకముల యొక్కయు ఛాయలు కలసికొనియున్నట్టి, ఇట్లనగా:– సరస్సుతీరమున నున్నట్టి చెట్ల యొక్క ఛాయలు నీటియందునూ కనబడుచు, నిజ మఱియు

ఛాయాస్వరూపములయొక్క వేరులు కలసియుండునటుల గోచర మగు లోకమిదియేను. ఇది మిశ్రమస్థానము, లేక సోపానమగు టచే దీనిని అంతరిక్షమందురు. ఈ మండలమున:- వివేచన, లేక పుణ్యాపాప విచారణ గావింపబడును. దీనియొక్క మహిమయు అపారమైనదే! ఏలయన, ప్రళయము సంభవించిన తదుపరి గూడా ఇచ్చట ప్రాణులుండియే యుండును. మఱిద్దానికి దిగువ లోకము వరకే ప్రళయమనునది వాటిల్లును. దీనికి పైనగల మండలముల యందప్పుడు, ప్రళయమునకు మారుగా ఐక్యతనొంది యుండుట మాత్రము కద్దు. ఇచ్చట నిధానముగ గమనించవలసి యుండును:-

లోకములైతే ఏడు మాత్రమేగాని, మధ్యస్థ మహర్లోకము నందు, ఊర్ధ్వాధో లోకములయొక్క ఛాయలాఱింటితో వెరసి పంద్రెండు లోకములగుచున్నవి. ఇట్లనగా:- సత్, దివ్య, లేక చైతన్యలోకములను మూటియొక్కయు; మఱియు మాయ, పృథివి, లేక పాతాళలోకములను మూటియొక్కయు ఛాయలను నవి ఆఱు కలసి:- అంతరిక్షము, లేక హృదయప్రదేశమందలి జడ చైతన్య ఛాయాగ్రంథిగాగల లోకములగును. గనుక, ఈ పండ్రెం డింటిలో:- ఊర్ధ్వభాగమందలి ముల్లోకములు వెరసి, సత్య, లేక దివ్యదేశమని; అధోభాగమందలి ముల్లోకములు వెరసి పృథివి, లేక పాతాళదేశమనియు; మధ్యస్థ హృదయప్రదేశమునందలి ఆఱు లోకములయొక్క కలయికాస్వరూపమును "అంతరిక్ష" మనియును పేర్కొందురు.

ఈ పదిరెండింటిని, శివశాక్తేయ మతధర్మపరాయణులు:- ద్వాదశచక్రములు, లేక అర్ణములందురు. మఱియు, వీటియందు

పరమేశ్వరు (శివభగవాను) ని పంద్రెండు జ్యోతిర్లింగములు (తేజోవంత ధారాప్రవాహములు) గలవనియు నిరూపించెదరు. ఇట్లని ఊహించుట, లేక వాకొనుటలో విభేదమున్నను, విషయము మాత్రము సత్యమని బోధపడుచున్నది. గాని:- ఈ ద్వాదశచక్ర ఆంతరిక సాధనావిధానము ఈమతములందు కలిగియేయున్నను; ఇయ్యవి గాయత్రీరహస్య సావిత్రి, తేజోనిరంజన్, లేక సూర్య భగవానుని పండ్రెండు రాసులకు సంబంధించిన వయ్యున్నను వీరలు:- బహిర్ముఖ అర్థ, లేక లింగమూర్తులయొక్క అర్చన మఱియు పూజాపద్ధతుల సాంప్రదాయము నేర్పఱచుకొని; అమరనాథ్, విశ్వేశ్వరనాథ్, వైదనాథ్, రామేశ్వర్నాథ్ మొదలగు పది రెండు యాత్రాస్థలములను భారతవర్షమున, ఏర్పఱచుకొనుట మాత్రముతో సంతృప్తులై యున్నారలు. మఱియును ఇయ్యవి:- బ్రహ్మాండాంశమగు పిండాండస్వరూపుతో, పరమాత్మాంశు జీవాత్మలమగు మనయందునూ కలిగియున్నట్టివి. కాబట్టి, ఇచ్చట జ్ఞప్తియందుంచవలసిన దేమనగా:-

మహర్షివరేణ్య సాధితానుభవ స్వరూపములనదగు, ఉపనిషద్గ్రథిత ఉద్గీథకు సంబంధించిన ప్రాణాయామము; అనగా:- బ్రహ్మండ షట్చక్రములను భేదించు, లేక అంతకుపైకి గొంపోవు ప్రాణాయామ సాధనోపాయము కలిగియున్నను:- ఇటీవల కేవల దేహికషట్చక్ర సంబంధమైన, రేచక పూరక కుంభక శ్వాసాయామముతోడ సంతృప్తులైయుండి; శరీరారోగ్యముకొరకైననూ దాని నుపయోగించుకొన జాలకుండుటజూడ విచారకరముగానున్నది.

ఇంతేగాదు, ఉపనిషత్ప్రబోధము నందెల్లెడల:- నిజమైన పరమార్థికే! ఈ రహస్యము నుపదేశింపదగుననియు; మఱియ్యది

హృదయవిద్య యగుటచే గురుశిష్యప్రణాళిక ననుసరించి, అంత రాన్వితముగ అర్హతగలిగియున్నవారు మాత్రమే చేపట్టి అనుభవ మును గడింప జెల్లునను కట్టుదిట్టము కలిగియున్నది. గాని; నేడది మరొకవిధమున సాగిపోవుచు, భౌతికదృక్పథము మిన్నంట ప్రబలి, మానవజీవితమనర్థముల పాలగుచుండుట విచారణీయము.

మానవజీవి:— సద్లోకమునుండి భూలోకమునకు దిగజారి, తనయందు సర్వపరిస్థిత సోపాన స్పర్శలు సంభవించి కలిగి యున్ననూ; అవిదితుడై వలయాకార అర్ధభాగ ప్రయాణమును మాత్రమే సాగించియున్నాడు. తిరిగి సద్లోకమును చేరగలిగిననే, మానవజన్మోద్దేశము పరిపూర్తి నొందగలదు. కావున యిందులకు క్రిందుమీదు, అనగా:— తలవైపేగు దారిని చేపట్టి సాధించిననే, మిగతార్ధభాగప్రయాణము ముగిసి గమ్యమునుచేరి తరించగలడు. మఱియు, సర్వజీవులందు ప్రకృతిసిద్ధముగా శాశ్వతత్వమునే వలయునను వివేకియగు మానవజీవజన్మోద్దేశము:— అవిదితమును విదితపఱచు కొనుటయే విధ్యుక్తకర్తవ్య సాధనమగు గదా!

ఈ మార్గోద్దేశము:— సత్, పరమసత్యము, నిజమైనట్టి నైజత్వము, లేక పరిపూర్ణత నొందుటయేగాని; ద్వైత, అద్వైత, ద్వైతాద్వైత, శుద్ధాద్వైత సాంప్రదాయాభిమానమునకు లోనై మిడుకొ్కనుటకుగా భావింపరాదు. ఇద్దానిని సూత్రప్రాయమున ఈశోపనిషత్తునందలి పదియాఱవ మంత్రము స్పష్టముగా ప్రబోధిం చియున్నది. ఇదిగో! తిలకింపుడు:—

ఓ పుష్టినొసంగు పోషకుడా! ఓ నియమబద్ధముగ ప్రవర్తింప జేయు యమా! ఓ ప్రభాకరుడగు ప్రజాపతీ! నీ తేజోప్రకాశ

కిరణములను సమీకరించి (ఏకపఱచి) నన్ను:- నీయొక్క మహి మాన్విత రమ్యవైభవస్వరూపమును గాంచనిమ్ము. ఊర్ధ్వభాగమున గలట్టి నీవే! నేను గనుక ( సో హ మ స్మి )

ఓ మ్ త త్స దో మ్



| సంఖ్య | బ్ర. సోపానములు | పిం. సోపానములు | తత్త్వములు |
|---|---|---|---|
| ౧. | ఓం భూః. | మూలాధారము. | పృథివి. |
| ౨. | ఓం భువః. | స్వాధిష్టానము. | జలము. |
| ౩. | ఓం సువః. | మణిపూరకము. | అగ్ని. |
| ౪. | ఓం మహ. | అనాహతము. | వాయువు. |
| ౫. | ఓం జనః. | విశుద్ధము. | ఆకాశము. |
| ౬. | ఓం తపః. | అగ్నేయము. | జీవాత్మ. |
| ౭. | ఓం సత్యమ్. | సహస్రారము. | పరమాత్మ. |

# ౬ వ ప్రకరణము

# మానవ పరిస్థితి

సంసారమనునది తలంపులపుట్టయేను. మానవుడు తలంపులవలననే తనయొక్క జగత్తును నిర్మించుకొనును. సత్యస్వరూపమే లేకున్నచో, ఛాయ మఱియు పరిస్థితులుండుననుటయు అసంగత ప్రలాపమేయగును. గనుక:- ఇంతవరకు మనము తెలిసికొనినట్టి, ఇంక తెలిసికొనబోవునట్టి పరిస్థితినంతయు అతి నిధానముగా గమనింపగలుగుచో, మన యొక్క అజ్ఞానమునకు మఱియు బంధనమునకును మనమే! కారకులమని బోధపడక మానదు. కాబట్టి:- పరితపనతో సాధనసంపత్తి నార్జింపనొడంబడుచో, బంధనమును చించి త్రెంచివైచి నిజస్వరూపము నొందనగును. మఱియు ఈ పిండాండమను మనయొక్క శరీరమునందు:- సూక్ష్మస్వరూపముతో బ్రహ్మాండ, పరబ్రహ్మాండములును కలవనియు దెలిసికొంటిమిగదా! ఇయ్యవి; గొలుసుయందలి కడియముల వలె సుషుమ్నయనునాడిని అంటియున్నవనియూ కనుగొంటిమగుటచే, ఈ నాడిననుసరించి సాధన నొనర్తుమేని గమ్యస్థానము సులభసాధ్యమవగలదు.

మానవుని సంసారము కర్మక్షేత్రమేనైయున్నది. దీని వ్యవహారమంతయు జాగ్రదావస్థలోనే జరుగుచుండును. మఱియు దీనియొక్క ఫలితము, స్వర్గ నరకములలో పొందనగును. ఎప్పుడైతే పిండాత్మ మనస్సునంటియుండునో! యాఫలక్షేత్ర వ్యవహారము స్వప్నదశలోనడుచును. గాని, ముక్తిస్థానముమాత్రము యీ రెంటి కవ్వలయుండును. ఈ ముక్తి యనునది; సుషుప్తిదశతో సంబంధించి

యుండును. ఈ విషయమును పరిమితుడును, వికారియు నగు పిండాత్మతుల్యదృష్టితో చూపబడుచున్నదగుటచే నిట్టిపరిస్థితులలో జీవాత్మను:– విశ్వ, తైజస, మఱియు ప్రాజ్ఞులందురు. ఇవే పరిస్థితులలో బ్రహ్మాండాత్మయగు బ్రహ్మము:– విరాట్, అవ్యాకృత్, హిరణ్యగర్భుడనబడుచుండియు అవికారియై యుండునని తెలియవలయును.

ఇందువలన:– సృష్టి మూడుమండలములను కలిగియున్నట్లే ఈ మనయొక్క శరీరమునందున్నూ మూడుసోపానములుకలవు. (౧) స్థూలశరీరము:– ఇయ్యది స్థూలమనస్సు, మఱియు ఇంద్రియములతోగూడియుండి, పంచభూతములవలన జీవాత్మ వ్యవహరించు సోపానము. ఇది జాగ్రదావస్థ. ఇందలి జీవునిని విశ్వుండందురు. (౨) సూక్ష్మశరీరము:– ఇయ్యది సూక్ష్మమనస్సు, అంతఃకరణము (మనోబుద్ధి చిత్తాహంకారము) తో జీవాత్మ వ్యవహరించుసోపానము. ఇది స్వప్నావస్థ. ఇందలి జీవునిని తైజసుడందురు. (3) కారణ శరీరము:– ఇయ్యది జీవాత్మ స్తబ్ధించియుండుసోపానము. ఇది సుషుప్త్యావస్థ. ఇందలిజీవుని ప్రాజ్ఞుడందురు. కావుననే! జాగ్రదావస్థలో మనస్సు భ్రూమధ్యస్థానమున నిలిచియుండి పనిచేయును. స్వప్నావస్థలో మనస్సు కంఠస్థానమునగల హితానామినాడియందు నిలచియుండి పనిచేయును. సుషుప్త్యావస్థలో మనస్సు హృదయ స్థానమున, (రొమ్మునకు ఎడమభాగమునకలదు.) ఏపనియులేక నిలచియుండును

ఈ త్రిపుటీసోపాన సంయుక్తావరణమునందు:– ఎనుబది నాలుగులక్షల యోనులలో జన్మించెడు దశలున్నూ కలవందురు.

కనుక, జీవుడు ఈ సోపానముల ననుసరించియుండు వైఖరినిబట్టి, అన్నివిధములుగా జన్మించవలసియుండునని దెలియవలసియుండును. ఇంతవరకిది జీవునిభౌతికవిహారమే నైయున్నది. మఱియు పిండాండమగు మనశరీరము:- మాంసాస్థికల కలయికరూపము మాత్రమేగాని, ఈశ్వరునియొక్కశరీరము బ్రహ్మాండమైయున్నది. కాబట్టి దివి, లేక స్వర్గమే! వానియొక్క శిరస్సని. మర్త్యమే! (అంతరిక్షము)వానికడుపని.పాతాళమే! వానిపాదములని శాస్త్రము వాకొనును. ఎటులైతే మనదేహముయందు జీవులుపుట్టిచచ్చుచున్నవో, అటులే వానిదేహమగు బ్రహ్మాండమునందును జీవులు పుట్టిచచ్చుచున్నవి. మఱెటులైతే మనముంటేనే! అయ్యావి కలిగియున్నవో, అటులే వాడుండియుంటేనే మనమందరమును కలిగియున్నారము

బ్రహ్మముయొక్క శ్వాసనే వేదములందురు. ఏవైతే త్రిగుణాత్మకములై వెలసియున్నట్టివో! ఇదేదశ కారణమున, వేదములు మూడు ఒప్పుదలైయున్నవి. ఈ వేదములయొక్క మూడునామములే! కర్మకాండ, ఉపాసనాకాండ, మఱియు జ్ఞానకాండలనునవి. శ్వాసబైటికివచ్చుటయే! కర్మ, లోనికి ఏగుటయే ఉపాసన, శ్వాసనిలుచుటనే జ్ఞానసాధనలందురు. ఇకనాల్గవవేదము తదుపరి యేర్పడి ప్రకటింపబడి యున్నట్టిది. ఇట్లని చారిత్ర్యకముగా వ్యక్తమగుచున్నదని తెలియవలసియుండును.

ఇచ్చటయొక విషయమునుగ్రహించి తదనంతరము మన కథకేగవచ్చును:- రాజుయొక్క రాజ తనమును మఱియు ఫకీరుయొక్క ఫకీర తనమునున్నూ లాగుకొని వారిని మనము కనుగొందుమేని; ఇద్దరును సచ్చమానమైన మానవత్వమేనై యుండునట్లే!

బ్రహ్మత్వమును మఱి జీవత్వమునున్నూ తొలగించి, తత్వదృష్టితో వారిని పరికింపగలమేని ఏకత్వమే నిలచును. కనుక వేదాంతము దీనినే తలకెక్కించును, లేక ప్రబోధించి అనుభవమునందు గాంచ జూడుమనుటతో నిలచిపోవును. అదెటులయనగా:— "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" ఇట్లనగా, ఇది యాత్మ బ్రహ్మములను ఏకమనునేగాని జీవేశ్వరులను యేకమనదు. ఏలయనిన:— విచారణ, లేక మేధాసంపత్తి ఇంతవరకే పనిచ్చునుగదా!

మనమిదివరకు మానవునందుగల జాగ్రత్స్వప్న సుషుప్తిదశలను మాత్రమే కనుగొంటిమి. ఇక యంతకుపైదశల నిచ్చటగాంచెదము:— (౧) తురీయము (౨) తురీయాతీతమనునవి. వీటితో కలసి మానవునియందు ఐదుదశలు నిర్ధారితమైయున్నవి. తురీయమనగా:— సుషుప్తిదశయందు, ఇతరమెద్దియులేక ఆనందమును మాత్రమే అనుభవించుటయగును. ఇయ్యది; పవిత్రహృదయులగు స్త్రీ పురుషులకును సహజముగానే! కలుగుచుండును. గాని, సామాన్య దశయందున్నవారు తమసాధనయందు మూడుఅవస్థలను దాటగలిగినచో, అనుభవమున వేద్యమగును. ఈ దశననుభవించువారు:— బ్రహ్మండసత్యవిషయములను తెలుపుచుందురగుటచే:— ఆత్మికము నెఱుంగజాలనివారు వీరిని; దైవావేశము గలవారనుచుందురు. ఇక తురీయాతీతము అనగా:— బ్రహ్మండాత్మయొక్క మూడు అవస్థలను, అనగా:— విరాట్, అవ్యాకృత్, హిరణ్యాగర్భ యనువాటిని (ఇట్లనగా:— సాధకదశలో విశ్వ తైజస ప్రాజ్ఞయను దశలను దాటినచో ఏర్పడునది) తెలియుచుపోగా కలుగు బ్రహ్మనందానుభవమని గ్రహించవలెను. ఇయ్యది ఋషులకును, మునులకును, పరమహంసలగు వారికిన్ని సహజముగనే కలుగునది. ఇది

కలిగియున్నవారికి:—ఆకాశవాణియనుదైవవాణి విననగుచుండును. ఈ వాణినమభవమున గాంచువైఖరి ననుసరించియే ! మతకర్తలు సిద్ధాంతములను ఏర్పఱచుచుందురు. వేదములనునవి ; ఈ వాణి వలననే నిర్మింపబడినవి. ఇక వేదసారాంశమేయుపనిషత్తులస్వరూపమున వెలసియున్నదని గుర్తెరుంగవలెను. మఱియు:— మూడవ తురీయమనునదొకటియున్నది. ఇయ్యది సంత్ , లేక సత్పురుషుల యొక్క అనుభవస్వరూపము. దీనికవ్వలపొందబడునదే సత్పథము లేక పరమపదమనునది. ఇది యే ! మన గమ్యస్థానము. దీనికి దిగువ తురీయములయందేదో యొకదానిలో నిలచిపోయి అంతకు పైకేగలేక , అదియే సిద్ధాంత రాద్ధాంతమనువారు కలిగియుండుట వలననే ! మతము లనేకము బయలువెడలుటకు ముఖ్యకారణ మని జ్ఞప్తియందుంచుకొనవలసియుండును. మఱియు , ఈ చివర తురీయమనునది:— పరబ్రహ్మాండముయందలి అగమ్ సోపానమున ప్రాప్తించునదని గ్రహించవలయును. మఱియును:— వేదశాస్త్రము లందు చూపెట్టబడియున్నట్టి ఏడు భూమికలనునవి ; ఈ తురీయ మునకు దిగువనవెద్యమగు తురీయమువరకుమాత్రమే జెంది యున్నట్టివని తెలియవలయును.

ఇక మనయందు కలిగియున్నట్టి పంచకోశముల వివరమును గాంచెదము:— (౧) అన్నమయ (౨) ప్రాణమయ (౩) మనోమయ (౪) విజ్ఞానమయ (౫) ఆనందమయములనునవి. ఈ కోశముల కొరకేర్పడియున్నట్టి యోగ వివరణమును గూడా గమనింపుడు:— (౧) హఠయోగము (౨) ప్రాణయోగము (౩) మానసికయోగము (౪) విజ్ఞానయోగము (౫) ఆనందయోగము లనునవి. ఇందలి హఠ , మఱియు ప్రాణయోగములు:— స్థూలశరీరమునకు చెందిన

వనియు ; మానసిక యోగము:- సూక్ష్మశరీరమునకు చెందిన దనియు ; విజ్ఞానానందయోగములు:- కారణశరీరమునకు చెందిన వనియును తెలియవలెను. ఇందలి ఆనంద కోశమనగా:- సత్వ, లేక కారణశరీర, సుషుప్తి; జ్ఞాన్; మఱియు పంచకోశాంతర్గత యని గ్రహించవలయును.

ఇక ప్రకృతియనగా; ప్ర:- ప్రథమ్య, లేక ఆరంభ. కృతి:- కార్య. ఇట్లనగా:- చైతన్యశక్తి, లేక సత్వ:, రజ:, తమోగుణ సామ్యావస్థ యగును. ఈ గుణప్రకటనా స్వరూపమే మాయ. దీనినే మనస్సందురు, లేక చింతనశక్తి కలిగియుండుటనే మనస్సందురు. మఱి ప్రకృతియందావేశము కలుగుచో పంచభూతములు జనించును. దీనియందు మొట్టమొదట కలిగినవి అంతఃకరణములు. ఇట్లనగా:- మనోబుద్ధి చిత్తాహంకారములు. ఇందులో సాంఖ్యులు బుద్ధిని, వేదాంతులు అహంకారమును మొదటి తత్వమందురు. ఇందులో వేదాంతులదే నిజమన నొప్పును. ఇందలి అహంకారము వలన సూక్ష్మభూతములు ; అనగా:- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు కలిగిన తదుపరి స్థూలముగ యేర్పడినవి. ఇట్లనగా:- ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివిగా నయ్యెను. ఇందలి మనస్సను ప్రకృతి వీనిచే నటించుచుండును. ఈ నాటకము పేరే సృష్టి, లేక బ్రహ్మాండమని తెలియవలయును.

మనయొక్క మనస్సనునది ఈ ఆటలో నిమగ్నమైనప్పుడే, దాని వైఖరినిబట్టి సుఖదుఃఖములయందు చిక్కుపడ నగును. ఈ దశనే! బద్ధ, లేక బంధనమందురు. సాధనమునొనర్చి దీనినుండి విడివడుటనే ముక్తియందురు. మనము, సత్వ రజ స్తమోగుణ

సామ్యావస్థనే "ప్రకృతి" యందురని తెలిసికొంటిమిగదా ! ఇందలి సత్వగుణమునందు:- ప్రకాశము (తేజము) మఱియు ఆనందము (సంతోషము) కలదు. రజస్సులో:- చపలత్వము మఱియు అస్వాస్థ్యములనునవి కలవు. తమస్సుయందు:- సోమరితనము, నిద్ర మఱియు మఱపులు కలిగియుండును. మనస్సనునది త్రిగుణాత్మకయగు ప్రకృతి వలననే ! కలిగినదగుటచే నియ్యదొకప్పుడు సూక్ష్మముగను, మఱొకపుడు స్థూలముగనూ యుండుటయే గాక; ఇంకొకపుడు స్థూల సూక్ష్మకలయిక స్వరూపముతో నుండుటయు కద్దు. ఇంతేగాక:-మనయొక్క ఆదర్శగ్రంథములగు పురాణముల యందు:- ఈ త్రిగుణములను మూడు స్వరూపములుగ చూపెట్ట బడియున్నది. అందొకటవది విష్ణు. (౨) బ్రహ్మ. (3) శివయని. ఏలయనగా : బ్రహ్మాండమునందుననూ మూడు గుణములతో పని జరుగును. కనుకనే ! పిండాండమునందును, జీవాత్మలనబడు మానవులేగాక పశువులున్నూ అదేవిధస్వభావము కలిగియున్నవి.

ఇందులో:- కారణముగనున్నట్టి సత్వగుణమును, ఇంగ్లీషు వారు:- సూపర్ కాన్షస్ (Super conscious) అనియు; స్థూల సూక్ష్మసంపుటియగు రజోగుణమును, కాన్షస్ (Conscious) అనియు ; కేవలస్థూలమగు తమోగుణమును, సబ్కాన్షస్ (Sub conscious) అని యందురు. మఱియు:- మనయందు కారణముగ పనిచేయునట్టి సత్వగుణియగు మనస్సును:- ఇంగ్లీషులో "సూపర్ కాన్షస్ మైండ్" అందురు. ఇయ్యది కమలమువలె కోమలమై యుండునదేగాక, దైవవాణికిది ప్రధానమైనది. ఏలయన:- మానవుడు సాధించి పైభాగమున కేగుచో దైవికదృష్టాంతరములను కాంచనై, అదృశ్యజ్ఞానమున్నూ కలుగును. ఇయ్యది ఋషులకును,

మునులకును ప్రత్యేకింపబడినట్టిది. (౨) మనయందు స్థూలముగ పనిచేయునట్టి తమోగుణియగు మనస్సును:- ఇంగ్లీషులో "సబ్ కాన్షస్‌మైండ్" అని యందురు. ఇయ్యది:- మనము భుజించెడు అన్నము కుతికెనుండి క్రిందికిజాఱిన తర్వాత జీర్ణించి, రక్తముగ నొనర్చి మనకు తెలియకుండానే శరీరమంతట వ్యాపింపజేయును. దీనియొక్క ఆవరణ విశాలమైనది. (౩) మనయందు స్థూలసూక్ష్మ కలయికతో పనిచేయునట్టి రజోగుణియగు మనస్సును:- ఇంగ్లీషులో "కాన్షస్‌మైండ్" అని యందురు. ఇయ్యది, మనము అన్నమును నమలి తిని రుచినెఱుంగుటకు మాత్రమే పనిచ్చును. దీని యావరణ సంకుచితమైనది. కావున తెలియవలసిన దేమనగా:- మనస్సనునది ఏకమేనయ్యు, అది వ్యవహరించు పరిస్థితులననుసరించి అద్దానికి మూడు ప్రధాన స్వరూపములేర్పడి యున్నవి. మఱియు, ఈ మూటియంతర్గతముగ ఎన్నియో స్వరూపములనది దాల్చుచుండుటయును మనకు కానబడుచుండును.

ఇక బ్రహ్మాండమున:- (౧) సత్వగుణిగ పనిచేయు కారణ మనస్సునే! పరిపాలకుడైనట్టి విష్ణువందురు. ఏలయన, ఈయన కోమలుడగుటచే ప్రతివస్తువును సక్రమముగను, సౌందర్యముగను ఉంచును. మఱియు విశ్రాంతి, శాంత్యానందములనున్నూ ప్రసాదించును గనుక. (౨) రజోగుణిగ పనిచేయు సూక్ష్మస్థూల కలయికగా యుండు మనస్సునే! బ్రహ్మయందురు. ఏలయన, ఈయన స్థూల సూక్ష్మకలయికగా నుండుటచే సృష్టించువాడుగ నున్నాడు. రెండు స్వరూపములుంటేనే గదా! మూడవది కలుగుట. కనుకనే, ఈ రజోగుణముయందు చపల వ్యాకులములు ఉండును. (౩) తమోగుణిగ పనిచేయు స్థూలమనస్సునే రుద్ర,

లేక శివుడందురు. ఏలయన, స్థూలమునందే మార్పుండునగుటచే ఈయన లయకర్తగ యున్నాడు. ఈ తమోగుణమునందు వ్యాకులత, అజ్ఞానములు కలిగియుండును. కావుననే! చచ్చువారు తికమకతోను, చింతలతోను మడియుచుందురు. ఇదిటులుండగా:—

మనయందు మనస్సునిలచి పనిజేయుస్థానముల నిదివరకే కనుగొనియుంటిమి గదా! అదేవిధమున, బ్రహ్మాండమనస్సున్నూ నిలచి పనిజేయును. బ్రహ్మాండముయొక్క ఛాయనేగదా పిండాండము. అదో అపరిమితమైనది. ఇది పరిమితముగనుండి పనిచేయునట్టిదై యున్నది. మనము మూడు శరీరముల గలిగియున్నట్లే! మన ఈశ్వరుడును కలిగియున్నాడు. అదియు మిశ్రితమైనదేనై యున్నను, వానికిని మనకు స్థూల సూక్ష్మభేదము మాత్రమే కలదు. వాడు సర్వజ్ఞుడు, మనము అల్పజ్ఞులము. వాడు పూర్ణుడు, మనము అపూర్ణులము. వాడు బ్రహ్మాండుడై మనము పిండాండులమగుటచే, మనకు సుషుప్తిదశలో యేమియు దెల్యదు. వానికి సర్వము తెలిసియే యుండును. మనము పరిమితావరణలో వ్యవహరింతుము. వాడు అపరిమితావరణలో వ్యవహరించును. వానికి మనకింత మాత్రమే భేదము. మఱియు, మనయొక్క అంతఃకరణముయుక్త పదునాల్గు ఇంద్రియములు వాని ప్రభుత్వమునకు లోబడియున్నవి. వానికిన్నీ:- ఈలాటి ఇంద్రియములు కలవు. వాటిని సూర్యచంద్రాది దేవత (శక్తు) లందురు. అయ్యవి తమతమ యావరణలో పనిచేయుచుండియు, ఆయనకు అవయవములుగా నున్నయవి.

ఈ బ్రహ్మాండియనబడు మనస్సు భ్రూమధ్యస్థానమున నిలచునప్పుడు దానిని విరాటందురు. అనగా:— జాగ్రదావస్థ. కంఠ

స్థానమున నిలచునప్పుడు, అద్దానిని అవ్యాకృతందురు. అనగా:- స్వప్నావస్థ హృదయగుహ్యయందు నిలచినప్పుడు దానిని, హిరణ్య గర్భయందురు. అనగా:- సుషుప్త్యావస్థయందు గలవాడనబడును. మనయందున్నట్లే వానియందును కలవగుటచే, ఈ విషయమును బాగుగా పరిశోధించుకొనగలిగినచో, సందేహమున్న అవలీలగా తొలగిపోగలదు. గాని, మనయొక్క మనస్సును దేహికస్థానముల నుండి జరిపి, లేపి వానియొక్క స్థానములందు నిలుపవలసి యుండును. దీనినే, అభ్యాసమందురు. మనము ఈశ్వరప్రతిబింబ ములమేగదా! మనస్సు, ఏకాగ్రమగుచో నియ్యవి సాధ్యమగు టయేగాక, ఇంతకు పైస్థానములున్నూ స్వాధీనమవగలుగునని తెలియవలయును:-

మానవునియొక్క స్థూలదేహిక పిండాండమునగల ఆత్మ మఱియు మనస్సులకు ఈశ్వరుడెటులైతే నిర్వాహక ప్రేరకుడుగా నున్నాడో! అటులే సూక్ష్మబ్రహ్మాండ (ప్రపంచ) భాగమునందునూ బ్రహ్మాండిమనస్సు మఱియు విశుద్ధాత్మతో కలసియుండి ప్రేరక కార్యకర్తగయున్నాడు. ఇటులే! కటాక్ష, లేక కారణప్రపంచాత్మ యందునూ, ఆత్మికమైనమనస్సు మఱియు పవిత్రాత్మయొక్క ఇంద్రియస్పర్శకలిగి ప్రేరక కార్యకర్తగా నున్నాడు. ఈ మూటి యందును, ఆత్మ మఱియు మనస్సులుకలవు. కనుక, ఈ మూటిని "శ్రీగురుమతము" యొక్క సిద్ధాంతమున:- ఆత్మదేశము (కారణ) ప్రకృతిదేశము (సూక్ష్మ) మఱియు మాయాదేశము (స్థూల) అని యందురనిమనమిదివరకే తెలిసికొనియున్నాము. కాబట్టి, పిండాండ మగుశరీరమునందలి షట్చక్రములు; అనుభవస్వరూపములైయున్న

నయ్యవి స్థూలములు. బ్రహ్మాండ పరబ్రహ్మాండ చక్రములు, లేక సోపానములగు పండ్రెండును; స్థూల సూక్ష్మతనములేనివయ్యు, ఆ సూచనలు మన మేధస్సున కలిగియే యున్నవి. ఇందులో:– బ్రహ్మాండచక్రములు; పచ్చని బిందువులు. చైతన్యఖండ సోపానములు తెలుపు రంగుగాగల గుర్తులని తెలియవలయును. ఇందుకు సందేహముండునేని, అనుభవజ్ఞుడైయున్న యొకడాక్టరునడిగినచో సువేద్యమవగలదు.

ఇంతకు మానవజీవితమునందు:– ఉన్నతి, అధోగతులు; వృద్ధి, క్షయములు; శ్రేయ, అశ్రేయములు; మేలు, కీడులు; ఫలా ఫలములనునవి:– తనయొక్క స్వభావమును అనుసరించినట్టి ప్రవర్తనను బట్టియే పఱగుచుండును. అవతారముగ నెన్నబడు శ్రీ బుద్ధభగవానుని సందేశము:– "ఎవడెటులాలోచించునో, అటులనే! పలుకును. ఎవడెటుల చింతనగావించుచుండునో, అటులనే! చేయును. ఎవడెటుల భావించునో, అటులనే! అనుభవించును." అనగా:– మనుష్యునియొక్క అనుభవ పునాది, వానియొక్క సంకల్పములయందే యిమిడియుండును. ఒకవేళ వీనికి సంకల్ప నిరోధ సాధనోపాయము లభించి సిద్ధుడవగలుగునేని, బ్రహ్మాసనము నైననూ ఆర్జింపజాలుననుట నిస్సందేహము. అదెటులయనగా:– జగత్సృష్టియన, శక్తిపరిపూర్ణునియొక్క ప్రకృతిసిద్ధ సంకల్పశక్తి పరియవసాన ఫలస్వరూపమే గదా! మఱియు; విశ్వామిత్ర ఋషి తనయొక్క సంకల్పశక్తిచే ప్రతిసృష్టి గావించుటను, పురాణకాలక్షేపమున తెలిసికొనియే యుందురు గదా! కావున, వివేకియగు మానవుడు గ్రహింపవలసినదేమనగా:–

లోపము, బాధ, భయము, అపాయము, మఱియు చావు అని పేర్కొనబడునట్టివి:- సర్వము, పూర్ణమునందు నామకార్థము అయిననూ యుండిలేవనియు; అయ్యవి భాగము, ఖండము, మఱియు ప్రత్యేకతయందు మాత్రమే సహజముగా కలుగుచుండు నవనియును. ఏలయనగా:- ఈ ప్రకృతిసిద్ధమైన ప్రపంచము, లేక జగత్తులో నెద్దియునైన నొక ఉద్దేశము, లేక ఇచ్ఛచే వీడియుండి లేదు. ఇచ్ఛయనునదియే! జీవితవ్యక్తము, లేక ప్రత్యక్షమగు టకు ప్రబల సాధనాపరికరము. మఱి ఇదియే! స్వార్థమనబడు చున్నది. స్వార్థమనగా; సంస్కృత ధాతువగు స్వః- తనయొక్క అర్థ:- ఉద్దేశము, లేక ఇచ్ఛయగును. ఇద్దానినే! వాసనయందురు. ఇయ్యది సంస్కృత"వస్"శబ్దమునుండి వెడలినది. (వస్:-కోరిక) ఈ యిచ్ఛతో నెల్లప్పుడు "ఆశ" కలిగియుండును. కోరికయనునది, మానవజీవితమునకు సంసిద్ధమైయున్నను, విశాలతనే వాంఛించు స్వాభావికయై వరలియున్నది. కావుననే! శాశ్వతానందము, లేక శాశ్వతపథము నొందువరకు సంతృప్తి కలుగకున్నది. ఇట్లని బోధ పడగల సుకృతాత్ములు, పరిపూర్ణునియందే గురిని ఏకాగ్రపరచి విజయవారిసు లగుచుందురు. ఇంతేగాదు; సంకుచిత దృక్పథము నకు లోనగుటవలననే! మానవాత్మ దుఃఖికావలసి వచ్చుచున్న దనియును జ్ఞప్తియందుంచుకొనియే వ్యవహరించవలసి యుండును. చూడుడు:-

"1. One who has seen the son, has seen the father."

"2. Man is the creator of circumstances; Man is not the creator of circumstances."

ఇందులకు దృష్టాంతరములుగా, మానవుడు పరిగ్రహించ వలసిన విషయములను వివరించుకొందము:-

పరమేశ్వర సద్గురువరేణ్యునకు:- పర, అపరయని పేరెన్నిక గన్నట్టి ద్వివిధపరిస్థితులు కలిగియున్నవి. సమిష్టిబ్రహ్మాండములో వీటిని:- ప్రకృతి పురుషులు, క్షర అక్షరములను నామములతో విజ్ఞులు తమవాడుకలో ప్రయోగించుకొనుచున్నారలు. ఇయ్యవియే! వ్యష్టిగా వెలసియున్న పిండశరీరములందు క్షేత్ర క్షేత్రజ్ఞ నామములతో పేర్కొనబడు చున్నట్టివి. ఇందలి పురుషుడనబడు నది ప్రాణమనబడుచు, బీజప్రదుడగు తండ్రిగా నొప్పుచున్నది. ఇఁక ప్రకృతియన్ననో:- స్వరూపమును ప్రసాదించెడు తల్లియన జెల్లుచున్నది. చూడుడు:-

"తాసాంబ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితాః."

కాబట్టి, ఈ ప్రకృతియన బరగియున్నదానిని:-అవ్యక్తమని, మూలప్రకృతియనియు, మాయ యనియునుగూడా వాడెదరు. ఇంతేగాక నిద్దానికి:-

భూమిరాపోనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ,
అహంకారయితీయంమే భిన్నాప్రకృతి రష్టదా అపరేయమ్.
(భగవద్గీత)

అనగా:-ఈ మాయగా నెన్నబడుదానికి పంచభూత, మనో బుద్ధి యహంకారములను విభిన్న అపర ప్రకృతులున్నూ కలిగి యున్నవి. ఇందలి పంచమహా భూతములవలన సంభవించినవే జ్ఞానకర్మేంద్రియములు. ఇఁక మూలప్రకృతియన్ననో: సత్వరజస్త మము లనబడెడు త్రిగుణగర్భితయై యున్నది. ఈ త్రైగుణములు

సామ్యావస్థ యందున్నపుడీ ప్రకృతి:- ప్రథానమనియు ; ఇందులో ప్రకోపము జనించునప్పుడు ; దీనికి మహత్తత్త్వమనియూ పేరు. ఈ పరిస్థితి:- సృష్టికి ఉన్ముఖమై యుండుటచేత ఇదియే మహద్ బుద్ధి, మహద్బ్రహ్మ మనబడుచున్నది. ఇదిగో:-

మమయోని మహద్బ్రహ్మ తస్మిన్‌గర్భం దథామ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతోభవతి భారత. (భ, గీ)

మఱియునీ మహత్తత్త్వమునుండియే:- ప్రత్యేకతకు మూల హేతుర్సంభూత మ గు న ప్పు డు , కారణస్వరూపమను మహ దాహంకారము ఉత్పన్నమై, గుణవిభేద వైఖరిలో సాత్వికమువలన మనస్సు మఱియు దేవతలు కలిగెను. రాజసమువలన ఇంద్రియ ములును, తామసమువలన పంచతన్మాత్రలను, సూక్ష్మభూత ములు సంభవించెను. భావనా ఘనీభవ పంచీకరణయోగముచే స్థూలములగుటతో నానావిధ రూప నామము తేర్పడినవి. ఇందలి చైతన్యాంశమే! భౌతిక విషయోపభోగముల అసక్తిచే, దేహాభి మాన వ్యామోహములను స్థిరపఱచుకొనుటతో బంధియై, వివిధ యోనులయందు పరిభ్రమించుచుండుటయును తటస్థించినది. చూ డ ం డి:-

"కారణం గుణసంగోస్య సద సద్యోని జన్మసు."

కాబట్టి, ఈ పరిస్థితి నధిగమించుటకే! శ్రీగురుమతము:- భౌతికవ్యామోహ విభ్రాంతులు గాకుండానుండి, జన్మసంసిద్ధ కర్మబద్ధ స్వభావమును బోనాడి, అసంగ స్థిరచిత్తులై యథా స్థానమునొంద గలందులకుగాను, ప్రప్రథమునసే! సమర్పణా

ప్రబుద్ధులుగానగు పాఠమును ప్రబోధించును. ఇచ్చట తెలియ వలసిన దేమనగా:-

౧. తత్రసత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశమనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన దేహినమ్.

౨. రజో రాగాత్మకంవిద్ధి తృష్ణాసంగ సముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్.

౩. తమస్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్ని బధ్నాతి భారత. (భ, గీ)

ఇందులకు తాత్పర్యములు:- (౧) సత్వగుణము నిర్మల మైనది. తేజోవంతమైనది. శరత్కాల మేఘమువంటిది. ఇయ్యది ఆధ్యాత్మిక జ్ఞానానందములయందు ఉపేక్ష వహించుచో దేహిని భ్రమింపజేయును. (౨) రజోగుణము:- సగముకురిసిన మేఘ మును పోలినది. మఱియు, కంటియందు ధూళి పడునపుడెటుల కానిపించి కాన్పించకనుండునో! అటులే, రజోగుణికి తత్వము తెలిసియు దెలియక యుండును. (౩) తమోగుణము:- అజ్ఞాన మూలకమేగాక మరుపు, సోమరితనము, నిద్ర, మొదలగువాటి యందుండజేసి వశత్వమును ఆపాదించును.

ఇందుచే:- ఈ గుణసంజాతము ప్రకృతీ సంబంధియనియు, తాను ప్రకృతికి పరుడననియును తెలిసికొని మానవుడు:- కర్తృత్వ భోక్తృత్వ విరహితమున సాక్షిమాత్రుడుగా గుణముల నతిక్రమించి, ఏవండైతే జీవితమును గడపజాలునో! అట్టివాడే నిర్వి కల్ప సచ్చిదానందమగు సద్గురుస్థితిని ప్రాపించి, బంధ విరహిత

స్వతంత్రుడై వెలుగొందును. ఇందులకై:- నిత్యానిత్య వస్తు తార తమ్యము నెఱింగి, స్థిరతనార్జింపనెంచు మానవునకు, ముప్విధ ముల జ్ఞానప్రకాశము తేర్పడును. అయ్యవియే:- (౧) ప్రత్యక్షము. (౨) అనుమానము. (3) శబ్దమనునట్టివి. ఇందులో నొకటవది:- జ్ఞానేంద్రియములచే సంభవించును. రెండవది:-చింతనాశక్తివలన లభించును. మూడవది:- ఆప్తుడగు గురుని ప్రవచనముతో ప్రకటింపబడునది. వీటికి మూలాధారము:- సమగ్రమనోబుద్ధులగును. కాని, తనయొక్క నిరీక్షణ మననములు మాత్రము అత్యవసర మగును. మఱియు, ఇందలి సంకల్ప వికల్పాత్మక మనస్సను నది ముత్తెఱంగుల వ్యవహరించును. ప్రవర్తనావైఖరిననుసరించి ఇయ్యది:- మనోబుద్ధి అహంకారములనునట్టి నామములతో పేర్గాన బడుచున్నది. అయినను, వివేక జీవియగు మానవునకు స్వానుభవమే అనుభావ్యమగును అనగా:- జ్ఞానములలోకెల్ల స్థిరమైనటి అభేదానంతమగు ఆత్మజ్ఞాన మూలవాలమగుగదా! ఇందులకు:-

భౌతికలాలసత్వలోలమై బంధియై పరగియున్నట్టి ఆత్మయే జీవాత్మయని, ఇట్టి బంధవిరహిత స్థితియందుండి సర్వాంత ర్యామిగా నున్నట్టి ఆత్మయే పరమాత్మయనియు గ్రహించ వలసి యుండును. ఈ ఆత్మ వస్తుతః:-సంపూర్ణ జ్ఞానము, పరిపూర్ణ ప్రేమ, మనోజ్ఞమైన ప్రశాంతనిధియగు సచ్చిదానందమైయున్నది. కనుకనే! ధ్యాన నిష్ఠాగరిష్టుడగువాడు; ధ్యేయ స్వరూపమున నున్న దీనితో నేకమై వ్యక్తిత్వ స్వార్థముల గోల్పోవు చున్నాడు. ఇందుచే:- జీవులన్నింటిలో సహజముగా సత్య శాశ్వతత్వములనే వాంఛించు స్వభావగర్భితయు, వివేకపరిజ్ఞానయుత జీవియునగు

మానవతాసిద్ధికి మతానుసరణము ముఖ్యాతిముఖ్యమే! యగు చున్నది. గాని:—

"పరిశోధనాపూర్వకముగా, అంతమును తెలియనిదెద్దియు నొనర్పరాదు." మఱియు "అనుభవమునకు అందిరానట్టి ఎద్దానినైనా విశ్వసించుట అజ్ఞానవిలసితము." మఱియు "నిన్ను నీవే స్వయముగా అర్థము చేసికొనుము." అనునట్టి ముక్తకంఠార్యోక్తుల ననుసరించి చూడగా:—

దుఃఖ విమోచనమునకు మూలకారణమేగాక, అమూల్యమై యున్నట్టి మానవ జీవితమునకు, కళ్యాణ సంధాయకమై వఱలి, నిష్పాక్షికముగ వెలయుకట్టుదిట్టమునే మతమనవలెను. మఱియు:- చింతనా శక్తి నుపయోగింపగా కొరంతను పూరింపదగు హృదయ సంబంధమై, దిన దిన ప్రవర్ధమాన యనుభవమును గడింపదగు మార్గదర్శకముగానుండి, వివేక జీవిత రహస్య ప్రబోధక సూత్ర గర్భిత విధి విధాన స్వరూపమే! నిజముగా మతమనజెల్లును. మఱియును:—ఈమత ధర్మానుష్ఠాన పరియవసానఫలము ఆత్మ సాక్షాత్కారమే నగుటచే; హృదయాంతరాళమున మనము పొందు అనుభూతియే సాక్షాత్కార నిరూపణమగును. గాని:— విచార ప్రవాహము నఱికట్టి, ఏదో యొక మనోజన్య సిద్ధాంత రాద్ధాంతమునే సత్యమని, అద్దానినే విశ్వసింపుమని తలరుద్ద జూడబడునది మత మన జెల్లదని తెలియవలసియుండును. ఇదిగో:—

౧. మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.
(భగవద్గీత. ౪-౧౧)

౨. యేతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి.
(బృహదారణ్యకోపనిషత్తు. ౪-౩-౩౨)

3. సదా తద్భావ భావితః. (భగవద్గీత. ౮-౬)

౪. విమోకః కామానభిష్వంగః. (బ్రహ్మసూత్రము)

౫. అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే.
(భగవద్గీత. ౬-3౫)

ఇందులకు తాత్పర్యములు:- (౧) మానవజీవితరంగ మహా సంరంభ ప్రయత్నమంతయు, తుదకు భగవానుని యందైక్యమగుటకే ఉద్దిష్టమైయున్నది. (౨) మన్మథ వ్యాపార సుఖము నందనుడు, లేక ఆనందలేశముగల తావులందెల్ల నిత్యానంద సద్గురాంశమే విరాజిల్లియున్నది. కాబట్టి:-(3) నిత్యానందస్వరూపుడగు సద్గురుని గూర్చియే! సదా చింతింపవలయును. ఇందులకు:- (౪) విషయముల వైపునకు ఇంద్రియము లేగకుండా నిగ్రహించి స్వవశ మొనర్చుకొనుటయే పరమార్థసాధన ప్రథానాశయము. మఱియు:- (౫) అభ్యాస వైరాగ్యములచేతనే మనోనిగ్రహము లభితమగును. ఇచ్చట గ్రహించవలసినట్టి విషయముల గాంచెదము:-

౧. సర్వదేవమయో గురుః. (భాగవత. ౧౧-౧౭-౨౭)

౨. ఆశ్చర్యోవక్తా కుశలోఽ స్యలబ్ధాః. ( కఠో , ఉ. ౧-౨-౭)

3. శ్రోత్రియోఽ వృజినోఽ కామహతో యో బ్రహ్మవిత్తమః ;
(వివేకచూడామణి. 3౪)

ఇందులకు భావార్థములు:- (౧) మానవులు కర్మబద్ధ స్వభావమును కలిగియున్నంతవరకు, భగవంతుని మానవ స్వరూపమునే! ఆరాధింపకుండానుండి సంస్కరింపబడజాలరు. ఏలయన, దేవతలన్నింటిలో గురుత్వము పరివ్యాప్తముగా వెలసియుండు

శ్రేష్ఠమైనది. (౨) ప్రబోధకుడైన గురుడాశ్చర్యకర శక్తియుతుడును, శిష్యుడు శ్రోత కుశల జిజ్ఞాసువై యుండుట అత్యావసరము. ఏలయన—(3) పరమార్థమును స్వయముగా గ్రహించుటకుగాని, ఇతరులకు బోధించుటకుగాని, చిత్తశుద్ధి, వినిర్మల ప్రేమ, హృదయ పవిత్రతలు ముఖ్యావసరములగును. ఇందుచే ముముక్షువు:– ప్రబోధ తత్పరుడును, పావనాత్ముడును, కోరికా రహితుడునైయుండవలయును. లేదేని శ్మశాన, ప్రసూతి, పురాణ వైరాగ్యములవలె:– "యథా తథం భవతు" అనగా, పూర్వ స్థితిలోనే యుండిపోయెదరు సుమా! ఇది యిటులుండగా:–

అవిద్యాయా మంతరే వర్తమానాః,
స్వయంధీరాః పండితం మన్యమానాః,
జంఘన్యమానాః పరియంతి మూఢా,
అంధేనైవ నీయమానా యథాంధాః.

(ముణ్డకోపనిషత్తు. ౧-౨-౮)

తా. అజ్ఞానాంధకారమున గోరాడుచు, పండితమ్మన్యులగుటతో, మాకంటె ధీరులులేరని విఱ్ఱవీగుచు మూఢజనులు:– గ్రుడ్డివాని మార్గదర్శకత్వమునకు లోబడిన గ్రుడ్డివానివలె, తొట్రుపాటునొందుచు సదా పరిభ్రమించుచుందురు.

కాబట్టి, ఇచ్చట జ్ఞప్తియందుంచవలసిన విషయము లెవ్వనగా:– ఎచ్చట భగవన్నామము వినబడునో, అదియే పుణ్యస్థల పుణ్యక్షేత్రపుణ్యతీర్థము. కనుక, భగవతత్త్వోపదేశము నొనరించు గురువర్యుని మహనీయతనెన్న తరమగునా! అహేతుక దయా సింధువులగు వీరే, మానవజీవితోద్యానవనము నందలి పారిజాత

ములు. ఎటులన, వీరిమూలముననే గదా! పరమేశ్వరు నొంద జాలుట. ఇందుకు, మానవుని తర్కవైఖరి బుద్ధికంటెను శునకము యొక్క సహజ విశ్వాసగుణసంపన్నతయే మేలనవలసియుండును. ఏలయన, తనయొక్క యజమాని దుస్తులు భేదించియుండిననూ ఇతరుడుగా భ్రమింపదు గదా! ఇందుచే:- మనయొక్క సావధిక స్వభావ ప్రస్తుతావస్థలో భగవంతునిగూర్చి మానవస్వరూపముననే గాని భావింపజాలమని తెలియుట ఉచితమగును.

అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ. (నా, భ, సూ. ౫౮)
సాత్వస్మిన్ పరమప్రేమరూపా. (నా, భ, సూ. ౨)
సానకామయమానా నిరోధరూపత్వాత్. (నా, భ, సూ. ౭)

తా. "పరమావధిని పొందుటకు:- భక్తియోగమే అత్యంత ప్రయోజనకర సులభమునైన మార్గము. కాబట్టి, సద్గురునియందలి పరమప్రేమయే నిజమైన భక్తియగును. ఈ దివ్యమైనప్రేమకు ఏలాటి ఐహికలాభమైననూ సరిరాదు. ఏలయన, భౌతికవిషయ వాంఛలను కలిగియున్నంతవరకు సత్ప్రేమ యేనాటికిని జనింప జాలదని తెలియవలయును."

ఈ కోరికయనున దెల్లప్పుడును అపరిపూర్ణతనే సూచించును గదా! ఇక్కారణమున, నిష్కామియై ప్రేమకొరకు మాత్రమే ప్రేమింపకుండా నుండుట తనకు స్వభావవిరుద్ధమగుటచే, ఉన్న తోన్నతాదర్శముననే నిజమైనభక్తుడు ప్రేమించుచుండును. ఇంతకు, అవ్యాజమైనట్టి ప్రేమయే! నిజమైనప్రేమకు ప్రథమ లక్షణమై యున్నది. నిర్భయత్వము ప్రేమకు రెండవలక్షణము. ఇదెటులన, మానసమున భయమునకు తావున్నంతవరకందు ప్రేమకవకాశ

ముండజాలదే గాక, సహజముగా ప్రేమయనునట్టిది భీతిని జయించును గదా! ఇంక కామితార్థమే, సర్వోత్తమ మనునది ప్రేమకు మూడవ లక్షణమగును. ఏలయన, ప్రతిమానవుని మహోన్నతాదర్శమునకే సద్గురుపరమేశ్వరుడని పేరుగదా! (చూడుడు:- బృ, ఉ. ౨-౪-౫) ఇంతకు, ఈ సమస్తవిశ్వమను ప్రపంచము:- నామరూపాత్మక భాషలో వెలువడుచున్నట్టి, నామ రూపాతీత విరచితమగు కావ్యము గదా! ఇందులకే, శ్రీ తులసీదాసను మహాశయుడీ రీతిన నుడివియున్నాడు:-

జహాఁరామ తహా కామ నహీ, జహా కామ తహా నహీరామ ;
దోనోఁ ఏకసాథ మిలత నహీ, రవి రజనీ ఏకఠామ.

అనగా:- రాముడేలు హృదయమున కాముడును, కాముడేలు హృదయమున రాముడు నుండజాలరు. ఎటులయన, సూర్యకాంతియు చీకటియు నొక్కచో నుండనేరవు కాదా? ఇందుచే, ఓయి మానవోత్తమా! ఈ మహానుభావుని రెండవ ఉపదేశమును కనుగొందము:-

సబసేబసియే సబసేరసీయే సబకాలీజియేనామ,
అజీ హాజీ! కరతేరహియే బైఠీయే అపనాఠామ.

ఇట్లనగా:- అందరితో కలసిమెలసి కూర్చుండుము. అన్నింటియందును కలిగియున్నట్టి సుధారసామృతమును గ్రోలుటకుగాను జౌనౌనని పల్కుటకిచ్ఛగించుముగాని, ఓ భక్తావతంసమా! నీయొక్క ఆసనమునమాత్రము నిష్ఠాగరిష్ఠసుస్థిరుడవుగమ్ము. దీని పర్యవసానఫలితముగ, పరిగ్రహించవలసినదేమనగా:-

ఆదర్శమనునది యొక అదృశ్యశక్తిమాత్రమేగాక, అసదృశ

శక్తియునైయున్నదని గుర్తెరుంగవలయును. ఏలననుచో:- వ్యక్తినేగాని, లేక జాతినైననూ ఉన్నతోన్నతి నొందింపజేయగల తగుపాటవమిద్దానికి మాత్రమే కలిగియుండును. కాబట్టి, సర్వోపగతుడగు మహత్తరాదర్శమును కలిగియుండనివారు నీరసించుట సహజమేనగును. ఇంతకు:_పల్లమునుండి మిట్టకు, చీకటినుండి వెలుతురునకు, జరామరణమునుండి అమృతత్వమువైపునకేగ నుత్సూతలూగుచుండుట మానవజీవితసహజప్రకృతియగుగదా! ఇందులకువ్యతిరేకించెడు బ్రతుకు పతనమగుట నిక్కువమే కాదా? గనుక నోయి వివేకపరిజ్ఞానయుత మానవజీవోత్తమా! నీయొక్క జన్మోద్దేశవిశిష్టలక్షణ మాత్మ సంయమమని తెలిసికొనుటయేగాక, దుఃఖభాజనమగు అనిత్యపదార్థ జోలిమాని:—సచ్చింత, సద్వాంఛ, సత్సాధనా ప్రయత్నములను మాత్రమే కలిగియుండి వ్యవహరించ జూడవలయుజుమా! జాగ్రత!! "జైహింద్"

ఓమ్ తత్సదోమ్

## ఓ మానవోత్తమా!

మిలీ నర్‌దేహ తుమ్‌కో । బనావ్ కాజ్‌కుఛ్ అప్నా,
పచోమత్ ఇస్ జగ్‌మేఁ । జానియో రైన్‌కా సుప్నా.
దేహ ఔర్ గేహ సబ్‌ఝూటా । భరమ్‌మేఁ కాహెకో ఖప్నా,
జీవ్‌సబ్ లోబ్‌మేఁ భూలే । కాల్ సే కోయీనహీఁ బచ్నా.
నహీఁ కోయీరాః బచ్నేకీ । జలేఁసబ్ నరక్‌కీ అగినా,
బినా సద్గురూ బినాకర్నీ । ఛుటేనహీఁ ఖాన్‌కా ఫిర్నా.

(సార్‌బచన్ రాధాస్వామీ)

# ప్రతీకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ౧ | పంచభూతములు:— | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
| ౨ | పంచతన్మాత్రలు:— | శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము |
| ౩ | అంతఃకరణ చతుష్టయము:— | | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| ౪ | పంచప్రాణములు:— | ప్రాణము | అపానము | వ్యానము | సమానము | ఉదానము |
| ౫ | జ్ఞానేంద్రియములు:— | శ్రోత్రః | త్వక్ | చక్షుః | జిహ్వాః | ఘ్రాణః |
| ౬ | కర్మేంద్రియములు:— | వాక్ | పాణిః | పాదః | ఉపస్థః | పాయుః |
| ౭ | పంచకోశములు:— | అన్నమయ | ప్రాణమయ | మనోమయ | విజ్ఞానమయ | ఆనందమయ |

## ౭వ ప్రకరణము

# సా ధ న సం ప త్తి

౧ సత్‌మండలము, లేక సత్యలోకము:– ఇయ్యది పర బ్రహ్మమునకు ఆధారసంభూతమండలము. ఇందలి మూలస్థాన మునే! "శ్రీగురు మతమున" సత్పథము, లేక ధృపథమందురు. ఇచ్చటికి మనస్సు, వాణి, మేధా, మఱియు వివేకములు చేర జాలవు. ఇది కారణలోకమయ్యు, మానవుని మేధస్సు ప్రారం భమునుండి శిఖవరకుకలదు. ఈ మండలమువరకు చేరువారిని:– పరమసంత్, సంత్, సత్పురుష, లేక మహాఋషులందురు.

౨ ప్రకృతిమండలము, లేక రజోలోకము:– ఇయ్యది శబ్ద బ్రహ్మము, ప్రణవము, లేక గగనమండలమనబడును. ఇది వేద ములయొక్క ఉత్పత్తిస్థానము. దీనినుండియే త్రిమూర్తి, లేక త్రిగుణములు; పంచమహాభూతములును సూక్ష్మరూపమున ప్రక టింపబడినవి. దీనిని, చిదాకాశమనియు, బ్రహ్మాండమనస్సని యును పేర్కొందురు. ఇది సూక్ష్మలోకమయ్యు, మానవుని భ్రూమ ధ్యమునుండి మేధాప్రారంభమువరకు వేద్యమగునది.

3. మాయామండలము, లేక తమోలోకము:– ఇయ్యది స్థూలపంచమహాభూత ప్రకటనముతో సమష్టిబ్రహ్మాండరూపమున వెలసియున్నది. దీనిని, అనందాకాశమనియును పేర్కొందురు. ఇది:– మానవస్వరూపమున వ్యష్టిగా వ్యక్తమయ్యున్నది. కాబట్టి మానవుడు:– తనయందు మూడవస్థానమనబడు భ్రూమధ్య

సోపానము నుండి ప్రతిబింబముగ ప్రాణమును ప్రవహింపజేయుటతో, నేత్రములందునిలచి, అనుభవ సరంజామునంతయు సమకూర్చుకొని, సూక్ష్మ స్థూలస్వరూపముల నేర్పఱచుకొనుచుండును.

ఇదియంతయు గమనించిన తదుపరి మానవస్వరూపమునందు:- సత్యలోకమునుండి భూలోకమువరకన్నియు, అన్నిటి స్పర్శలు, విలువలును ప్రకృతిసిద్ధముగ కలిగియున్నవని తోచుటయేగాక; ఈజీవి చాలా పైనుండి క్రిందికిదిగజారి ప్రకటింపబడినట్లున్నూ బోధపడగలదు. ఇందుచే మనుష్యునియందు కలిగియుండని పరిస్థితి, లేక వస్తువే! లేదనియు; ఇది సర్వసంపూర్ణ వ్యక్తిత్వమనియును తెలియవలసియుండును. గాని, ఈ శక్తులన్నియు, అజ్ఞాతమున పడియున్నవి. అయినను:- సోమరత్వము లేక సంకుచితస్వభావమునువీడి యించుక శ్రద్ధవహించుచో వీటిని అనుభవమున గాంచవచ్చునని తోచగలదు. ఇంతేగాక, మానవుడు సంకుచిత మఱియు విశాలతలకున్నూ మించియున్నవాడనియు గ్రహింపునకురాగలదు. వీడు పొందుటకర్హత, లేక అధికారమును కలిగియుండుటచేతనే సర్వభోగములను అనుభవించుటకై వేదములుసహితము అవకాశమును కలిగించియున్నవి. గాని, వాటి కొరకే! జీవించుమనుటలేదు. చూడుడు:-

యజుర్వేద (౪౦. వ) అధ్యాయ, ఈశోపనిషత్తునందు:- "ఈ జగత్తుయందుగల చైతన్యాచేతనము లన్నింటియందును, ఈశ్వరునిస్థాపించి తదుపరి త్యాగముతో భోగించుము. అత్యాశ, లేక పేరాస (లాలుచీ) మాత్రమువలదు. అదియంతయు నీయదికాదుసుమా!" అనియున్నను:- సర్వసామాన్యముగ అయా

వాటిని ఈశ్వరీయములని భావింపక, త్యాగాయుధమును చేగొనక లుబ్ధుడై (లోభియై) స్వార్థపరత్వమున భోగించుట కలవాటుపడి యున్నాడుగనుకనే! అజ్ఞానియనబడి, పశుజీవితము ననుభవింప వలసినగతి యీ మానవునకు దాపరించుచున్నది.

ఇదిగో పరిశీలనాదృష్టిని ఇటుద్రిప్పుడు:— శబ్దముచే లేడియు, స్పర్శవలన ఏనుగును, రూపముచేత శలభమును, (పతంగము) రసమువలన మీనమును, గంధముచేత భ్రమరమున్నూ; ఒకొ్క్కటియు నొకొ్కక్క ఆశవలన తమ జీవితముల బోగొట్టుకొను చుండగా! ఈ ఐదింటియందును ఆశగొను మనుష్యుని జీవితగతి యేమగునో కనుగొనుడు? ప్రస్తుతమున జాగ్రతపడిననే గాని భవిష్యత్తు దానంతలదే భద్రపడగలదు. కాబట్టి, కోరికలను పరి త్యజింపవలయును. ఏలయన తుపాకితో కాల్చుట క్షణముగాని దానిమందు తయారుచేసి దట్టించుటకెంత వ్యవధిపట్టునో పరికించు కొనుచో:— పరియవసాన ఫలానుభవము స్వయముగనే వేద్యమవ గలదు. ఇంతకు:— లోకంబునకు ప్రాణమొసంగినవాడు దానినెట్లు కాపాడవలయునో యెఱుంగకుండునా! దాని భారమతనిది కాని మనది కాదను సత్యమునెఱుంగి సాధనసంపత్తి నార్జింపజూడ వలయును. మఱియు తన్నుతానెఱుంగ గలుగుచో ప్రపంచ స్థితి గతులున్నూ తెలిసిరాగలవు. ఎచ్చట ఆత్మ యనునది యుండునో యచ్చట ఆనందముండియే! యుండునని తెలియవలయును. మఱియు, గురియందు నిష్కపట సంపూర్ణాత్మార్పణము కలి గించుకొనవలయును. ఒకవేళ, ఆత్మస్వరూపమును ప్రతిష్ఠించ వలయునను యిచ్ఛ జనించునేని, ఆలయమగు శరీరమును పవి త్రముగానుండ జూచుకొనవలసియుండునని గుర్తెరుగవలయును

ఇంతేగాదు:– ఆత్మార్పణము, ఆత్మనివేదనమున్నూ సంపూర్ణ మయ్యేవరకును పురుషప్రయత్నము అవసరమగుననియూ జ్ఞప్తి యందుంచుకొనవలయును.

తెలిసినదా! అయితే, ఆత్మోన్నతి నొందవలయుననగా యేమిటో కనుగొందము:– ఆత్మోన్నతి నాశించుటయనగా ;- నిత్యానిత్య వివేకముతో పంగొని, తాననగా శరీరమాత్రమే కాదగుటచే తనయొక్క మనస్సు, మేధస్సు, మఱియు శరీరమును, ఆత్మచే యణచియుంచి ; అధ్యాత్మికమును పెంపొరేపించుట యగును. ఆత్మయే:– దేహ మనః మేధస్సులను జీవింపజేయుచున్నది. అది కలిగియుంటేనే ఇయ్యవి కలిగియున్నవి. గనుక, జీవితము ఆత్మ యందున్నది. ఎటులైతే సూర్యునందు ప్రకాశమున్నదో! మఱియు సూర్యునివలననే ఈ జగత్తు ప్రకాశించుచు కాంతిమంతముగ నున్నదో! అటులే యన్నిటిని ప్రకాశింపజేయు టీశ్వరకటాక్షము. మఱియు దేహభాగములను జీవించి చలింపజేయుట ఆత్మకటాక్షమై యున్నది. ఇంక ఆత్మనెఱుంగుటెటుల యనునదే ప్రశ్నగా మిగులును. కాబట్టి సూర్యునితో ఏకముఖమై కన్నులరూపమున నిలచి సూర్యునిగాంచి, అనుభవమును గడించజాలినటులే! జ్ఞానము యొక్క పనిముట్టగు మనస్సును:– సాధనసంపత్తిచే నొక గురి యందు నిలపి, ఆత్మాన్వేషణమును సాగించి, తథానుభవమును గడింపవలసియుండును.

ఇందుకు మానవుడు :– క్రమముగా తనకు కలిగెడి అనుభవాదర్శములను, విశాలపఱచు కొనుచుండుటవలన నైనా స్వయముగా గుర్తెరుగవలెను. లేదా ; అనుభవజ్ఞుని యొక్క ఆశ్రయమునుగొని వాని కటాక్షమువలన నైనా! జ్ఞాననేత్రము

నార్జించి అనుభవమున తెలియవలసి యుండును. కాదా; మనస్సు నాత్మయందు లయపఱచగలుగుచో, ఇంక నేలాటి క్రియాకలాపముల తోడను పనియుండజాలదు గదా! అయినను:- మానవజీవితము అమూల్యమైనదేనై యున్నను క్షణభంగుర మగుటచే, కర్మబద్ధ స్వభావము కలిగియుండగా కాలక్రమానుభవము వలన గడింప జూచుటకన్న; అహంభావమును వీడి ఆదర్శ పురుషునియందాధార విశ్వాసములను కలిగించుకొనుట మూలమున అనుభవమునార్జింప జూచుటయే! శ్రేష్ఠమని అంగీకరింపక తప్పదు. కాబట్టి, ఈ యాదర్శస్వరూపమను దానినే గురుత్వమని గ్రహించవలయును.

గురూకరో ఖోజ్కర్‌భాయీ, బిన్గురూ కోయిరాః నపాయీ.
శబ్దబతావెసో గురూపూరా, ఉన్చరణనిక్క హెూజాధూరా.
శబ్ద భేద్లేకర్ తుమ్ ఉన్సే, కరోకమాయీ తుమ్ ఉన్సే.
ఔర్ పఛాన్‌కరోమత్ కోయీ, లక్షణక్షణ్ నదేఖో సోయీ.
(సార్‌బచన్ రాధాస్వామీ)

ఇంక ప్రాకృతము (మాయికము):- ఇది మనస్సునకు ప్రత్యేకింపబడినట్టిది. ఇంద్రియములన్నియు మనస్సుయొక్క పరికరము లేను. ఇవియన్నియు:- అనేకత్వయై బహిర్ముఖముగ నున్నవాటిని గురించి పనిచేయునవేనై, ఆ యభిరుచికి మరగియుండి నాటక మాడుచు, ఆత్మజ్ఞప్తిని మఱచియుండి లక్ష్యమును గానకున్నవి. గనుక, ఇయ్యవి అంతర్ముఖమగుట కానిపనియే! యగును. అయినను, ఆధ్యాత్మికాసక్తి గలవారిట్లని సంశయింపవలదు. మఱియు, క్రమముగా సాధింప ప్రయత్నింపవలయునే గాని జడియరాదు. ఏలయనః- పరమార్థము, లేక ఆత్మికమనియనగా నోటికబళము

కాదుగదా! గుటుక్కున మ్రింగుటకు. మార్పునొందెడు దేహిక కార్యమైననూ, పాటుపడక కొనసాగుటలేదు గదా! రుచిని అనుభవింపవలయు ననుకున్నచో, నోటితో పనిగొనవలయునన్న మాటే యగునని అందరికిని తెలిసియున్న విషయమే గదా! అటులే, ఏకముఖులై అభ్యసించి సాధించవలయును. ఎవరైతే, ఓపిక మఱియు పట్టుదలతో పనిగొనజాలరో! అవ్వారలకు ఈ జీవితమున, పరమార్థసాధనము హుళక్కియే కాగలదని గ్రహించవలయును. ఇదిగో! మహానుభావుడగు ఈ కలయుగాది సంత్ శ్రీ కబీరుగారి హితోపదేశము :—

౧. తీన్ గుణకీ భక్తిమేఁ భూళ్ రహా సంసార్,
కహేఁకబీర్! సత్‌నామ్ బిన్ కైసేఉత్రే పార్.

౨. జగమెచారోఁ రామ్‌హైఁ, తీన్‌రాం బ్యవహార్,
చౌథా రామ్ నిజసార్‌హై, తాకా కరో బిచార్.

3. అకార్‌రామ్‌దశరథ్‌ఘర్‌డోలే,నిరాకార్‌రామ్‌ఘట్టట్‌మేఁబోలే;
బుంద్‌రామ్‌కా సకల్ పసారా, నిరాలంబ్ సబ్‌సేహై న్యారా.

౪. తీన్ లోక్‌కో, సబ్‌కోహి ధ్యావే, చౌథదేవ్‌కా మరమ్ నపావే;
చౌథాచోడ్ పంజుమ్‌చిత్లావే, కహేఁకబీర్! హమ్‌రెఢింగ్ ఆవే.

ఇచ్చట జ్ఞప్తియందుంచవలసిన దేమనగా:— ఏకమునందనేకము, అనేకమునందేకము. అనగా:— పురుషునియందు ప్రకృతి, ప్రకృతియందు పురుషుడు. ప్రకృతియందు మాయ, మాయయందు ప్రకృతి. జాతియందు గుణము, గుణముయందు జాతి యను రెంటితనము కలిగియుండుటచేతనే! ప్రపంచము ద్వంద్వ జగత్తని పేరొంధియున్నది. ఇందుచే:— ఎచ్చట రెంటితనము కలిగి

యుండునో ! అచ్చట కట్‌పట్ తప్పక కలిగియే యుండుటయు ; దానిచే అహంకారమనునది ఆటలాడుచుండుటయు సహజమేనై యున్నది. మఱియు అహంభావమునకు లోబడుటచేతనే గదా, దేహజంజాటమున చిక్కువడి బంధియగుటతో జననమరణములు సంభవించుచున్నవి. ఈ అహంకార మూలముననే ప్రత్యేకి యగుటచే లోటుపాట్లెతెంచి దుఃఖము కలుగుచున్నది. ఇంతకు సంకల్పమే కారణము. సంకల్పముల వలననే, మనోచంచలత యేర్పడి అజ్ఞానము సిద్ధించుచున్నది. ఇంతేగాదు, ఈ చంచలమనస్సు అహంకారస్థానమున నిలచి:— క్రోధి, కామి, మోహి, లాలూచీగా జేయుచున్నదే గాక జరుగుచున్న నాటకమంతయు ఈ మనస్సుదే నైయున్నది. ఎటులయన, మనశ్శరీరములపై ఆధారపడుటచేతనే గదా ! జీవుడనబడి, తద్వారా నేను నాది తనముల నుపయోగించుకొనుచు, మానవుడు అహంకారి యనబడుచున్నాడు. ఈ అహంకారము:— ఉన్నతినొందుటకు ప్రబల విరోధియే గాక, గర్వమే అధఃపతితునిగా నొనరించుచు సర్వనాశనమునకు దారిజూపును. ఇందుచే మనస్సును:— చైతన్యమారు రూపగు అంతరిక శబ్దము నందు నిలిపిననే, దానికి ఆనందములభించి నిశ్చలమవగలదు. ఇంతకు సాధనావలంబియైనచో సత్యము స్వయముగనే తెలిసి రాగలదు. కాబట్టి, ఈ అహమ్మమలను నిశ్శేషముగ బోనాడుట వలన నిజత్వము, లేక ఆత్మత్వమేర్పడునని గ్రహించవలయును.

బుంద్ సమాన సింధ్‌మేఁ, ఎహ దేఖే సబ్ కోయ్ ;
సింధ్ సమాన బుంద్ మేఁ, బిర్లా జానే కోయ్.
బుంద్ సింధ్‌కారూప్ హై, సింధ్ బుంద్‌కారూప్ ;
బుంద్ సింధ్‌కేరూప్‌మేఁ ఝులేృ అగమ్ అనూప్.

పహలే బుంద్వ్రామాన్‌హై, పాఛే సింధ్‌కాజ్ఞాన్ ;
బుంద్ సింధ్ దనోంతజే, తబ్ పావే నిర్వాన్.
(కబీర్ పురుషోత్తమ్)

మనుజుడు:- సహజముగా మాయికమగు భౌతిక భ్రామిక ఛాయాస్వరూపముల వెంబడించి యుండు చుండుట వలననే! అంధకారమునుండి మరింత అంధకారములోనికే యేగుచున్నాడు. మఱియు సుఖాన్వేషణలో సంకల్పములకు గురియై, శాంత్యానుభవమును గాంచక దుఃఖియగుచున్నాడు. వీనికి ఈ స్వభావమును మనస్సే గదా! నిర్ణయించి నిర్దేశించునది. ఈ విధముగ మనస్సునకు బానిసయై వ్యవహరించు తొట్రుపాటు వ్యవధులనుండి వెలువడి రూపొందునదే! చరిత్రయనునామముతో ప్రవర్తిల్లుచుండును. ఇంతకు ఈ మనుష్యుడు:- నిజమైనట్టి తానగు ఆత్మజ్ఞానశూన్యుడై యుండుటచేతనే! మార్పులెన్నేని పరిగ్రహించుండిననూ దుఃఖానుభవము తప్పకున్నది. ఏలయన, ఆత్మజ్ఞానము లేనప్పుడయోమయమే గదా పరియవసానఫలము. కాబట్టి, దుఃఖకల్లోలము తప్ప మానవున కానందమెటుల అవిష్కృత మవగలదు ? సంకల్పములకు హేతుర్భూతమగు ఆశనిరాశలు, సంబంధాలనుండియే జనించుచుండును. ఈ సంబంధాలను కల్పించునది మనస్సే గదా! మఱియు, సంబంధాల కల్పనలోనే దుఃఖవిత్తనమును మనస్సునాటుచుండును. చూడుడు:- మానసిక చైతన్యములేని జీవరాశికి దుఃఖము లేదు. దుఃఖస్పృహయున్నూ లేదు. కనుకనే! వాటికి అనుభవజ్ఞానము శూన్యమైయున్నది. మానసిక చైతన్యమునకు బంధీయగు మనుష్యుడు మాత్రమే! తనయొక్క అనుభవములను కారాగృహములుగా చేసికొనుచుండును. పైగా, ఏ దుర్విధి

యాతనకు సంకెళ్లుబిగించి పీడించుచున్నదని మిడుకొ్కనుచు విలపించుటయు, ఆ క్షోభనుండి తప్పింపవలయునని ప్రార్థనలు సల్పుచుండుటయును పరిపాటి విషయమైనది. ఈ రీతిగ నేను అనబడుచున్నట్టి స్పృహకు, అది యనే జగత్స్పృహకు బాంధవ్యము నేర్పఱచి నిలబెట్టుకొనుటయే! మానవునకు జీవితముగా యేర్పడుచున్నది. మఱి విభిన్నస్పృహనుండియే వాంఛలు జనించుచున్నవయ్యేను. కాబట్టి, స్పృహలున్నంతవరకు జీవితము సంఘర్షణయుతము గాకెటులుండగలదు? ఎటులయన, అహంకార స్పృహయను ప్రత్యేక కించజ్ఞతలోననే గదా పూర్ణానుస్వారమను శూన్యత్వమిమిడియుండి లోటుపాట్లేతెంచు చుండుట. వీటని పూరించుకొనుటకే! ఆలుబిడ్డలు, ఆస్తిపాస్తులు, పాండిత్య ప్రకర్షణలను ఆర్జింప నగుచుండును. ఇందుచే:- సంబంధము లన్నియున్నా అహంకార బంధితాలే యనియు, అహంకారము దుఃఖ బంధితమనియును తెలిసి, జననమరణ ప్రవాహమునకు కుదురుగానున్నట్టి ఈ యహంకార స్పృహనుండి విడుదల నొందుటకే సాధన సంపత్తి నార్జింపవలసి వచ్చినదని:- వివేకజీవియగు మానవుడు గుర్తెరుంగవలయును. చూడుడు:-

౧. మన్ గయాతో జానేదే, మత్ జానేదే శరీర్,
నహీఛీంచేగా కమాన్ తో, కైసే జాయెగా తీర్.

౨. జహాఁ జహాఁ దేఖో తహాఁ తహాఁ సోయీామన్
మానిక్ఛేధియొ హీరా,
పరమ్‌తత్త్వ ఎహ గురూతె పాయో కహ ఉపదేశ్ కబీరా.

ఇంతకూ, సూర్యునియొక్క ఆధారమున కిరణములు ఉండునుగాక. సముద్రాధారమున అలలుండియుండునుగాక. నైజ

మున కిసుమంతేనిలోభము సంభవింపనేరదుగదా ! కాబట్టి, ఆత్మ యందే నిజమైనసుఖముకలదు. ఒకవేళ, ఎవరేని దేహమనస్సుల యందున్నూ సుఖముండియున్నదనియంటేనో ! అయ్యది దుఃఖ గర్భితరూపమని అనుభవముపై బోధపడగలదు. ఏటులనః గాఢ నిద్రనుండి మేల్కొని నేనిప్పుడు హాయిగా నిద్రించితిననుకాదా? అనగా:- దేహమనస్సులయందప్పుడు తాను లేకుండెనని తెలిపోవు చున్నది. ఇట్లనగా:- ఆత్మయగు తనయందే తానుండెనన్నమాట యగుచున్నది. ఇందుచే, నిజముగా ఆత్మంభరిత్వము, లేక అహంకారమును జాఱ వీడవలయును. గాని:- గాలిలోమేడను నిర్మించజూచినటుల, నేనుజాఱవిడిచినాననుకొనుట సరికాజాలదు. ఇందులకు సహజస్వభావమును వీడవలసియుండును. అనగా:- సమర్పణాప్రబుద్ధు డవవలయును. అయితే, ఎవరికి సమర్పించు కొనుట? గైకొని పరీక్షించువారెవరు? ఇందులకు సదుపాయ ములను ప్రబోధించువారెవరు? ఈ కారణముల ననుసరించి గురుత్వము నాశ్రయింపక తప్పదు. ఒకవేళ, ఇందులకు ముందడుగు వేయసాహసించజాలనిచో, ఇఁక "యథాతథంభవతే" యగునుసుమా ! దీనికింత పట్టుదలేలయనుచో:- కర్మానుభవము కొరకు నిర్మితమయ్యున్నట్టి స్వభావమును జాఱవీడుట కానిపని కనుకనే ! ఇది సత్పురుషాశ్రయమువలన మాత్రమే తొలంగును అనుటయేగాక, ఇందులకు మతధర్మానుష్ఠానపథమున్నూ యేర్పడినదనియు జ్ఞప్తియుంచుంచవలయును.

భవసాగర్మే భాటాఆయా, లహెర్ కా హేరాఫేరాహై.
బహ గయాజో ధార్ కిరాఃమేఁ డాలాఅప్నా డేరాహై.
చంచల్ మూరఖ్ అజానీ, చైత్ లే అభీ సవేరా హై.

మోహ భ్రమ అజ్ఞానవిద్యా, కెరే తుఝ్కో ఘేరాహై.
కెంకర్చున్నున్మహల్చునాయా, కహితాహై ఘర్మేరాహై.
నాఘర్ తేరా నాఘర్మేరా, చుడియారైణ బసేరాహై.
(మహర్షి శివ్)

ఇప్పటికిమనము:—ఆత్మయందే నిజమైనసుఖముండియున్న దని గ్రహింపగలగితిమి. ఇంక బ్రహ్మాండ పరబ్రహ్మాండాత్మయం దెంతటిసుఖమున్నదో అంచనవేసి చూడవలసియుండును. అప్పుడే లీలగా సాధనకు గడంగనగును. సాధనయు సుసాధ్యమవగలదు. ఇదిగో; పరమాత్మను సచ్చిదానందమందురు. (సత్, చిత్, ఆనందము) ఇందలి సత్తనగా:— అస్తి, నిత్య, అనుభవైక వేద్యము. చిత్తనగా:— చైతన్యము, తేజము, జ్ఞానము. ఆనందమనగా:— అహ్లాదము, నిజమైనసౌఖ్యము. సత్పాంతులగును. ఇందుచే, ఆత్మయే! నిజమైనజీవితము. ఆత్మయే! జీవితాదర్శము. ఆత్మయే యధార్థారోహణము. ఆత్మయే! సత్యమైన అభిలషితస్థానము, లేక గమ్యము. మఱిదియే పరిపూర్ణదశయు, ఉన్నతోన్నతమైనదియును. ఇంతేగాదు, కర్మ భక్త్యోపాసన ధ్యాన జ్ఞాన యోగములన్నియు ఇందు కొరకేనై యున్నవి. ఈ ఆత్మయొక్క బిడ్డలమే! అంశములమే! కిరణములమే! మనము. అదియే మనము, మనమే వాడు, ముమ్మాటికిని సత్యమేగాని:— ఇట్లనుకొనుట మాత్రంతోనుండుటకు సిగ్గిలవలసియుండును. ఏలయనగా, చిన్నదేహముతో కూడియుండి ఇద్దానినే తానని భ్రమయుచున్నారము గనుక. ఇందుకు సిగ్గుపడు టయేగాదు పొరుషపడవలసినది. అదేలయన, ఇంకను ఆత్మను చేరక జీవదశలోజిక్కియుండుట కిచ్ఛగించుచు, తమకంపే తమ

కింపని, తామింతపాడు గంతపాడు గనుకొనుచుండుట కలవడి సోమరులై "తందనాన తాన, తాన తందానే! తాన తందానే!!" అనిపాడుకొనుటమాత్రంతో అమూల్యజీవితముల నిరర్థకపఱచు కొనుచుండుటకు.

☞ ఇచ్చట విజ్ఞప్తిని గమనింపుడు:-(౧) ఆత్మయనగా:- అగాధజలధి. దానికొరకేర్పడినదేమతము. మతమనగా:-పరమార్థిక మైనది. ఇయ్యది, గురుముఖతనే! బోధకురాబడునట్టిది కనుకను. (౨) ఇది ధర్మమునుమాత్రము చూపెట్టెడి గ్రంథముకనుకను. (3) "గాయత్రీరహస్యము" యనుపేర అంతరికసాధనను గురించి మఱియొక గ్రథముప్రకటింపబడియున్నదికనుకను. (౪) ఇక్కాల నరునకు ఓపికతక్కువ కనుకను. ఈ ప్రథమభాగము నందనేక విషయములను జాఱవిడచి, సాధ్యమైనంతవరకు క్లుప్తపఱచ బడినదగుటచే వేసటకు తావీయరాదని మనవి.

౧. సోహంఅస్మి జబ్ హమ్‌నేకహా,
తబ్ సోహంగం హంకార్ బనా.
౨. తత్త్వంఅసీ జోముహసే నిక్లా,
వాచ్‌లక్షణ్ జంజార్ బనా.
3. మనన్ కియా మన్‌బినా చిత్తసే,
చింతన్‌కా సత్కార్ బనా.
౪. బుద్ధీనిశ్చయ్ ఆత్మక్ ఆయా,
జబ్‌హీ వివేక్ విచార్ బనా.
౫. ఏక్ అవస్థా నిర్మల్ సుందర్,
ఔర్ దోస్సే వ్యభిచార్ బనా.

౬. పురుష్హుయే తబ్ బనీ ప్రకృతీ,
కుల్ కుటుంబ్ పరివార్బనా.
౭. మేరే తేరే పనేకి ఇచ్ఛా
జబ్ ప్రగటీ సంసార్ బనా.
(మహర్షి శివ్)

జీవులన్నియు:- తను మనః ప్రాణేంద్రియములను, అహ ర్నిశముసుఖముకొరకే! వినియోగించుచున్నయవి. జన్మించుటయు సుఖముకొరకే! మరణించుటయును సుఖచింతలోనే సహజమై యున్నది. గనుక ప్రాణులయందు, సుఖాన్వేషణ ప్రకృతిసిద్ధముగా కలిగియున్నదని బోధపడుచున్నది. సుఖవిరుద్ధము ఏతెంచినపుడు ప్రాణమునైననూ, అహుతిచేయుటకు సంసిద్ధపడుచున్నవి గదా! అయినను, మనో మేధస్సు లేకముఖమైనప్పుడు దప్ప; ఈ సుఖ రహస్యము, దీనియొక్క వివరణ, జాడ, మఱియు విపుల విశదీ కరణయు బోధపడజాలదు. ఇది యిటులున్నను, పరియాచక పరి హాసములందున్నూ సుఖమనుదానిని. అనుభవింపజూచెదరు. గాని, ఉద్దేశము సంతృప్తినొందక తిత్తర్ బిత్తర్, లేక తికమక యగు చుండుటయు గాంచనగుచున్నది. ఇచ్చట యొక చిన్నకథను గమనించుడు:-

ఒకపాము సుండెలుకపై దాడిచేసిపట్టెను. తదుపరి, అది సుండెలుకయని తెలిసికొనెను. ఈ జాతిఎలుక యందొకవిధమైన దుర్వాసన కలిగియుండుటచే కుష్ఠురోగము కలుగునట. కాబట్టి తిందామా! పాముకు రోగముప్రాప్తించును. లేక విడుతమా! దాని కనులు గ్రుడ్డివగును. ఇదేవిధముగ, ధనేంద్రియ విషయాసక్తసుఖ

లాలసాన్వేషణములకథయు నుండును. ఇందువలనః– సుఖమను నది నీయందే, నీయొక్క ఆత్మయందే కలిగియుండ ; ఓమానవా! బైటవెతకుస్వభావ బేలతనము నీకేల ? యన వలసినస్థితి సంభవించుచున్నది. ఇంతేగాదు, జ్ఞానముగూడా ! మనయందే కలిగియున్నది. ఈ సుఖపరిశోధనలో మనము ప్రయోగించు అవయవములన్నింటిని, అంతర్ముఖపరచ గలిగెదమేని అయ్యది తెలసి రాగలదు. లేక ప్రకటింప, ప్రకాశింప బడనూగలదు. చూడుడుః– మహాబుషి సత్తముడగు యాజ్ఞవల్క్యుడు తన ధర్మపత్నియగు మైత్రేయికి ఏమని ప్రబోధించియున్నాడో !

ఓ మైత్రేయీః–వీణావాద్యనాదము నాప వలయునను ఇచ్ఛ కలిగియున్నచో, నాదమును బైటపట్టజూచుటకన్న వీణనే పట్టిన, లేక ఆపినచో నాదము తనంతలదే ఆగిపోగలదు. మఱియు, ఎటులైతే సముద్రము నీరునకుకేంద్రమో ! అటులే, స్పర్శలన్నిటికిని కేంద్రము ఒకేనొక త్వక్, లేక చర్మము.మఱియునుః-చిత్తవృత్తులు, లేక తలంపులన్నింటికి కేంద్రము మనస్సు, జ్ఞానములన్నింటికి కేంద్రము హృదయము. (బృహ, ఉ) ఇందులోగల రహస్యముః– ప్రతివస్తువుయొక్క ఆధారము, లేక మూలము ఆత్మయే! ఆత్మను తెలియుచో, లేక గుర్తెరుంగ గలిగినచో ఇవన్నియు తెలసి రాగలవు. ఇదియే ! మతము మనకు బోధించునది. కావునః– అభివృద్ధి, లేక ఉన్నతినొందజూటయే మన జీవితోద్దేశము. లేక జీవితము కలిగియుండుటకు గుర్తని గ్రహించవలయును.

మనము ఈశ్వర, లేక గురుభక్తిని ఏలచేయుదుము. ఇయ్యదీశ్వరునికొరకా ? లేక మనకొరకా ? మనకొరకేగాని శక్తిపూర్ణుడగు

వానికొరకు మనమేమి చేయవలసియుండును? ఇయ్యది మానవ జన్మోద్దేశము. ఇటులే, ప్రతివ్యవహారమునందునూ ఒక యుద్దేశము కలిగియుండును. ఉద్దేశమే కర్మనొనర్ప ప్రేరేపించునది. ఉద్దేశమే జీవితోద్ధారణ, లేక జీవితప్రసారమునకు కారణము. చూడుడు:— మహర్షి; మైత్రేయికింకేమని ప్రబోధించియున్నాడో! "భర్త:— భర్త దృక్పథముతో ప్రేమింప బడుచుండుటలేదు. గాని, ఆత్మిక దృష్టితో ప్రియుడైయున్నాడు. పుత్రిక:— పుత్రిక దృక్పథముచే ప్రేమింప బడుటలేదు. గాని, ఆత్మికదృష్టితో ప్రియమయ్యున్నది. జంతువు:— జంతు దృక్పథముతో ప్రేమింప బడుటలేదు. గాని, ఆత్మిక దృష్టితో ప్రియమైయున్నది. ఓ మైత్రేయీ! నిస్సందేహముగా ఆత్మ:— సాక్షాత్ శ్రవణ, మనన, నిదిధ్యాస చేయదగియున్నది. శ్రవణ మననచే ఆత్మనెఱింగినచో అన్నియు తెలిసిరాగలవు. మఱియు:— దేవతలను; ఆత్మకు భిన్నమయినవిగా చూచుచో దూరమున పడ వేయును. భూతములను; ఆత్మకువేరైనవిగా చూతుమేని మనను దూరమున పడవేయును. ఏలయన నియ్యవి, లేక ఈలాటివన్నియు ఆత్మజనితములు, లేక ఆత్మయొక్క స్వరూపములేను. ఇందుచే, తనతోడ, తనయందే కలయజూడవలయును. తనను:— తనయందే గాంచజూడవలయును. తనను, తనయందే అన్వేషించవలయును. ఈలాటప్పుడే; నిజమగు జీవితమును తనయందే! గాంచనగును." చూచితిరా, ఉపనిషణ్మృతము మనకు ఎంతటి ఆనందదాయకముగా ప్రబోధించియున్నదో!

ఇంక సాధననొనర్ప ముందడుగిడసాహసించుటకు మొదట:— జాగ్రదావస్థలో రుచులను, లేక సుఖముల ననుభవించునది శరీరమా? లేక జీవుడో! యోచింపుడు. స్వప్నమున కలలగనునే అది

మనస్సా ? ఇంద్రియములా ? లేక జీవుడో ! పరికింపుడు. సుషుప్తి దశలో హాయిగానిద్రించితిననునే అయ్యది మనస్సో, లేక జీవుడో ! గుర్తెరుంగగలిగెదరేని ; ఇవన్నియు తెలియునది పొందునది జీవుడే అనవలసియుండును. గనుక నిజమైనసుఖము జీవునియందే, లేక ఆత్మయందే ! యున్నదని యొప్పుకొనవలసి యుండును గదా ! ఇది యంతయు దెలిసిన తర్వాత, ఎదటి వస్తువులయందు సుఖానందములుండియున్నవన జూచుచో:- అదియొక వెఱ్ఱివైఖరియే అనబడగలదు. కాబట్టి మన అవయవ సామగ్రియంతయు, మనయందే నిజ సుఖముండియున్నదను పాఠమున్నేర్పు పంతులుగా నున్నదని తెలియుచున్నది. ఈ పాఠమునొల్లనివారిని, అయ్యది మార్పునొంది దుఃఖముల పాలొనర్చుట తప్పదు సుమా ! ఇందుచేత, మనయొక్క మనశ్శరీరేంద్రియములు మనకు పరికరములనియు ; వాటితో మనమేవిధముగ పనిని గైకొన్నను పనిచ్చునవి మాత్రమేననియు ; మనముండియుంటేనే, అయ్యవి జీవించియుండుననియు దెలసి:- మార్గదర్శిని ఆశ్రయించి, తన్నుతానెఱుంగు సాధనమునొనర్చి తనయధీశ్వరు నొందజూడవలయును.

జాగ్రదావస్థలో:- కర్మ కలదు. స్వప్నావస్థలో:- జ్ఞానము కలదు. సుషుప్త్యావస్థలో:- ఆనందము కలదు మానవజీవితము:- ఈ మూటితో గాఢసంబంధము కలిగియుండును. వీటినే సాధింపజూడనగుచుండును. ఎటులైతే:- కార్యసాధనము నంతయు, త్రిగుణాత్మకతనయొక్క సోపానమున నిలచియుండి యొనర్చుచుండునో ! అటులే, ప్రతివారును గుణముల వలననే కార్యముల నొనర్తురు. ఈ పనులలో కర్మ జ్ఞానోపాసనలు వెలసియే యుండును. ఘటయు,

ఎవరు ఈ సాధనలలో ఏద్దానిని అనుసరించియుండిరో ! వారు తమ సాధనలను ఆయా నామములతోనే పేర్కొన్నారలు. కావున శ్రీగురుమతము:- ఈ శబ్దలంపటమున చిక్కువడక, అర్థత ననుసరించి వీటన్నింటితోనూ పనిగైకొను గౌరవమును ఆర్జించియున్నది. అదెటులనగా:- ఏ సాధనసంపత్తి వలన జాగ్రదావస్థ యందున్నూ ఈ దశలుప్రాప్తించునో, అద్దానినే! "సురతశబ్దయోగ" మనియందురు. ఇదియే, సంత్ సత్పురుషులయొక్క సహజయోగము. మఱియు:-

జాగ్రిత్తులో:- ఇంద్రియజ్ఞానము కలిగియుండును. స్వప్నములో:- మనోజ్ఞాన ముండును. సుషుప్తిదశలో:- ఈ రెంటిజ్ఞానమభావమై యుండును. గనుక ; చైతన్యమే ! జ్ఞానము మఱియు జ్ఞానస్వరూపమునై ఉండియున్నదగుటచే, సమాధిస్థితి యనునది ఆంతరిక ప్రకాశదశయై యున్నది. ఎటులనగా:- జాగ్రదావస్థలో చైతన్యము ; దేహేంద్రియములకు కట్టుబడియుండెను. స్వప్నావస్థలో మనస్సునకు కట్టువడియుండి, ఆయా స్వరూపములను తానుగా భావించుచుండెను. అయ్యవి మార్పునొందు సహజత్వము గల వగుటచే, జీవి దుఃఖియగుచుండెను. సుషుప్తిదశలో వాటికి సంబంధించిలేక, తానుమాత్రమే ! ఉండియుండెనగుటచే సుఖియై యుండెను. గాని; ఈ దశయును స్థిరమైనది కాదు. ఇంతకుపైన అనుభవమునకు రాబడునట్టి స్థిరమయినదానిని తురీయమందురు. ఇయ్యదియే ! చైతన్యముయొక్క నిజప్రకాశదశ యగును. సాధనయందు దీనిని లభింపజేసికొన గల్గుచో యిక దుఃఖపీడ శాశ్వతముగా తొలగిపోగలదు. అయినను, శ్రీగురుమతముయొక్క తురీయము కాదిది. దానిని తురీయాతీత మందురు. ఇంకను సంతృప్తి కలుగకుండునేని ఇదిగో:-

పరమాత్మని ఆదిశక్తియగు ప్రకృతీ ప్రకటనా స్వరూపమే ఈ సర్వజగత్తు. ప్రకృతియే! శబ్దాది తన్మాత్రలతో మనస్సుగ యేర్పడుచున్నది. మహా భూతములుగా మారి జగత్స్వరూపము నొందుచున్నది. ఈ మనస్సే; అఖండబ్రహ్మము యొక్క ఇచ్ఛా శక్తి యనబడునది. అహంస్మృతినుండి కలిగి వ్యక్తమగు గుణ సంపుటినే మనస్సందురు. ఈ జగదృశ్యమంతయు, అహంయొక్క ప్రభావమేను. మఱియు:— చిత్తమాలిన్యము వలననే! విశ్వమను దృశ్యమగపడుచున్నది. కాబట్టి అహంస్మృతి ననుసరించి అన్వేషణను ప్రారంభించుచో, లేక ఆత్మతో ఏకత్వము ఘటిల్లిననే! ఆ మాలిన్యము తొలగి, నిజమైన ఆత్మచే అకర్షింపబడి చేయూత లభించగలదు. మఱియు తాదాత్మ్యభావన ఘనీభవించుచో, దేహాత్మ భ్రాంతియును తొలగి ఆత్మసాక్షాత్కారమగును. చూడండి:—

"సహవాసేన మహతాం సతాం, ఆరూఢచేతసాం"

"అనగా:— పరిశుద్ధ మానసమునందే! ఇట్లనగా; తలంపుల నిరోధసాధన వలననే, అంతర్ముఖత్వము సిద్ధించును." గాని:— సురతశబ్దయోగము వలన గాక, తలంపుల నిరోధమునకు వీలు లేదని జ్ఞప్తియందుంచ వలయును. ఏలయనగా, పాతుకొనియున్న స్వభావమునకు, లేక తలంపుల పుట్టయగు మనస్సునకు అహార మిడకున్నచో స్వాధీనపడజాలదు. లేక నిశ్చలమవజాలదు. ఇంతే గాదు, జడచైతన్యములు పాల్గొనిన స్వరూపమునే జీవుడందురు. ఈ జడచైతన్య పదార్థములకు మధ్యన (దేహాత్మకు మధ్య) లేక దేహాత్మ భ్రాంతివలన అంకురించెడి స్వభావస్వరూపముననే జీవత్వము, లేక అహంకారమందురు. ఈ అహంభావమును కలిగి యున్నంతవరకు, ఏలాటి సాధనయు కొనసాగనేరదు. కాబట్టి,

గురుత్వము నాశ్రయించిననే ! ఇట్లనగా:- అనేకములైన నామరూప వ్యామోహమునకు లోబడియున్నట్టి జీవుడు ; ఏక నామరూపముతో గూడియున్నట్టి గురునిపై, ఆధారవిశ్వాసములనుంచి సాధనమును ప్రారంభించిననే కొనసాగుటకు వీలగును. అహంగ్రంథి యెవరి యందు వీడునో ! సాధనమూలమున వారియందు, అమృతనాడి ప్రవహింప మొదలిడును. దీనిని; ఆత్మనాడియని, లేక బ్రహ్మనాడి యనియు పేర్కొందురు. ఇయ్యది తెరువబడి పారుచున్నప్పుడు ; అజ్ఞాన వ్యామోహములుండవు గాని:- సిద్ధులు కలుగుచుండును. ఈ సిద్ధుల నాశించుదురేని, ఆత్మజ్ఞానసాధనము విఘ్నమగును సుమా ! జాగ్రత.

ఇది యంతయు హృదయవిద్య యగుటచే హృదయము నుండి హృదయమునకు అంతరాన్వితముగ రావలసినది. అనగా:- గురుత్వద్వారా శిష్యత్వమునకు రావలసినదే! అయినను, ఇచ్చోట యింకనూ తెలసికొందము. సాధన యనగా:- అభ్యాసము. దీని యొక్క అర్థము సంస్కృతశబ్దమగు అభి:- ముందునకు. అస్:- ఏగుటయగును. కావున, సాధకుడు గుర్తెరుంగ వలసిందేమనగా:- చైతన్యకదలికను అదనుగాగొని, మాయద్వారా వలయాకారమున ధారాప్రవాహము కలుగుటచే, మీదు క్రిందు మధ్య పరిస్థితు లేర్పడును. అందు మధ్యస్థముగ నున్నస్థితి, మీదు క్రిందుస్థితుల స్పర్శవలన యేదైతే ముడిగానేర్పడునో! అదియే మనస్సనబడును. దీనినే జడచైతన్యగ్రంథి యందురు. ఇందుచే, బ్రహ్మాండమనస్సని పేర్కొనబడు ఓంకారము:- త్రైమూర్తి సంపుటియై యున్నట్లే ! పిండాండమందలి మనస్సునందున త్రిగుణములు వెలసియున్నవి. ఇందొకటవది సత్వగుణము:- ఈ గుణముప్రధానత వహించియున్న

పుడు మనస్సు నిశ్చలముగ యుండును. రెండవది రజోగుణము:- ఇది ప్రధానత వహించియున్నపుడు, మనస్సు నిశ్చలచంచలములతో కలిసి పఱగును. ఇఁక మూడవది తమోగుణము:- ఇది ప్రధానత వహించియున్నపుడు, మనస్సు చంచలస్వభావమును మాత్రమే కలిగియుండునని తెలియవలయును. ఇచ్చట, సాధకుడు జ్ఞప్తి యందుంచవలసిన దేమనగా :-

మానవుని శరీరమునందు, ముక్కోటిన్నర నాడులు గలవు. ఇందులో పధునాలుగు ముఖ్యమైనవి. ఈ ముఖ్యములలో మూడు ముఖ్యాతిముఖ్యమైనవి. ఇందులొనొకటి ఈళ; ఇంగ్లీషులో దీనిని:- Left Sympathetic అని యందురు. (౨) పింగళ; ఇంగ్లీషులో దీనిని:- Right Sympathetic అని యందురు. (3) సుషుమ్న; ఇంగ్లీషులో దీనిని:- Spinalcanal అని యందురు. ఇందులో ఈళ, పింగళయను నాడులు:- మార్పునొందు సహజత్వమునుగల, మాయ మఱియు కాలమునంటి వ్యవహరించును. ఇందుచే, భ్రమ ప్రమాదముల పాలొనర్చునని గ్రహించవలెను. ఇఁక సుషుమ్న యను నాడియొక్క మూతి మాత్రము మూలాధారమునందు విప్ప బడియుండును. గాని, కర్మబద్ధత ననుసరించి కుండలినిచే మూయ బడియున్నది. ఇది ప్రాణాయామసాధన వలన విప్పబడునపుడు, ప్రాణమీ సుషుమ్న మార్గద్వారమున నడచుట ప్రారంభమగును. అప్పుడు సోపానధ్యానముచే కుండలిని శక్తి ఊర్ధ్వమునకేగ మొద లిడి చక్రములపైకి రాగా, ఆయా కమలములు వికసించి వాటికి గల శక్తి ప్రకటింపబడును. సహస్రారమునందు ఈచక్రములన్నిటి యొక్క శ్రేష్ఠత్వము కలిగియుండును. మఱీ సుషుమ్నయను నాడి:- ఈళ పింగళలకు మధ్యన కలిగియున్నను, ఇయ్యదొకటి మాత్రమే

భ్రూమధ్యమునుండి ప్రారంభమై మేధస్సువఱకు సూటిగా కలసి యున్నది. లోకులున్నూ ముక్కు సూటిగా పోవలయునను సామ్యము నువాడెదరు గదా! కావున, ఇయ్యదాగ్నేయము నుండి ఆది వారు పాపెటతీయు గుర్తుద్వారా మేధస్సువైపు నడుచును. దీని ప్రారంభము నుండియే, దీని మూలముగనే క్రమముగ సాధించ జూడవలయునను సిద్ధాంతము "శ్రీగురుమతము" కలిగియున్నది. ఇది యిటులుండగా:-

మూలాధార, మణిపూరక, అనాహతములనుండి సాధనను చేయవలయునను నానావిధ సిద్ధాంతములున్నూ కలిగియున్నవి. ఇయ్యవి కొనసాగని సిద్ధాంతములు కనుకనే! ఇక్కాలమున అనుభవజ్ఞులు అఱుదైయుండుట సంభవించినది. ఒకవేళ; ఈయమూల్యామృతతుల్యమై యున్నట్టి మానవ జీవితములను సార్థకమొనర్చుకొన దలంతురేని, పిండాండ ప్రధానస్థానమగు భ్రూమధ్యము నుండి యొనర్పబడు సాధనయే! గమ్యమునుచేర సౌలభ్యమై యున్నదని గుర్తెరుగవలసి యుండును. మఱియు, నిజముగా వెలుతురు కావలయునను జిజ్ఞాస, లేక పరితపన కలిగియున్నచో; దీపమును అనుకరింప జూడవలయు గాని, ఛాయాస్వరూపము లన బడు ఈ మట్టిగోడలను రాచుకతిరిగిన ఫలితమేమి? "పూర్ణం పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" యనుచు గొంతును చించుకున్నను, శ్రేయమిసుమంతేని కలుగజాలదు సుమీ!

మాన్ బడాయి దేఖ్‌కర్, భక్తి కరే సంసార్;
జబ్ దేఖే కుఛ్ హీనతా, అవగుణ్ ధరే గఁవార్.

* * * * *

సాన్చే కాకోయీ గాహక్‌నాహీఁ, ఝూటే జగత్పతీజేజీ;
కహేఁకబీర్ మునోభాయీ సాధూ, అంధోఁకో క్యాకీజేజీ.

జగత్తుయందలి పశుపక్ష్యాది ప్రాణికోటియంతయు, తమః కలిగియున్నట్టి సహజస్వభావము ననుసరించియే వ్యవహరించు చుండగా:_ సర్వసామాన్యముగా మానవులమగు మనయొక్క ప్రవర్తన మాత్రమే క్రిందు మీదు, లేక అపసవ్యముగ యుండ చుండును. ఏలయన, వృక్షములకు వేరులు క్రిందుగ కలిగియుండే మనకు మాత్రము మీదుగా కలవు. మఱియు మానవత్వము సర్వ శక్తుల కాలవాలమయినదయ్యు, అహంకారమును అవలంబిం యుండుట కిచ్ఛగించు చుండుటచేత, అజ్ఞానియను యోగ్యత పత్రము నొందవలసవచ్చినది. ఇక్కారణములను అనుసరించియే మతము గూడా! సద్గురునాశ్రయించిననే పరమార్థము బోధపడు ననుట సంభవించినది. మఱియు:_

మానవులమగు:— మనము జన్మించుట అపసవ్యముగనే (ఉల్టానే) నిలచుట ఉల్టా. నడచుటయు ఉల్టానే! కావున మనము ఉల్టా జంతువులమయ్యున్నారము. ఒకవేళ, ఉన్నతినొంద దలంతుమేని సాధనము ఉల్టానే! అనగా:_ ఊర్ధ్వభాగము, లేక తలవైపునకేగవలసియున్నది. ఇట్లనగా:- మూలాధారమువైపు వ్యవ హరించుచున్నాము గనుక, అగ్నేయద్వారా సహస్రారమువైపేగ వలసియుండునన్నమాట. సాధనము నిటులొనర్చకున్నచో భక్తియు కుదురదు. జ్ఞానమున్నూ కలుగదు. మఱియు గమ్యస్థానమన్న నేపిట్ట పేరోయె, అమూల్యజీవితము ఇక గోవిందాయమంగళమగుట నిక్క మగును. ఇందులో:_ ఇది కలికాలమగుటచే, భౌతికలాలసత్వము మిక్కుటమయ్యుండి ఓర్వజాలమి, విరోధము, దరిద్రత, అవ స్థలు. అనర్థములున్నూ ప్రబలియున్నవాయె! ఇది నిజమా? అయి

నచో:– ఇఁక సాధింపవలయుననుజిజ్ఞాస, లేక పరితపన కలిగి యున్నదన్నమాటే యగును. ఇదిగో గ్రహించుడు:–

ఖట్‌పట్ మేఁ పోథియోఁకే పడ్‌కర్,
అట్‌పట్ చాల్ చలే దిన్ దిన్;
సార్ మిలానహీఁ జీ ఘబ్రాయా,
తత్త్వోఁకీ గింతీ గిన్ గిన్.
ఆసన్ మారా సాన్స్‌కో రోకా,
జతన్‌కియే బహు మన్ మానే;
లగీ సమాధ్ తుఝే నహీఁపాయా,
కైసే కోయీ తుఝ్కో జానే.
సాధ్‌కీ సంగత్ గురుకీ సేవా,
సహజ్ రీత్ జబ్ బన్ ఆయీ;
సహజ్ మేఁసహజ్ సహజ్ బిన్ సాధన్,
సహజ్ భావనా చిత్ లాయీ.
ఘట్ కాపర్దా ఖోల్ గురూనే,
తేరే రూప్‌కో దర్‌సాయా;
దర్శన్ రతన్‌కీ ఖాన్ ఖులీ,
అప్నేఅంతర్ తుఝ్కో పాయా.
(మహర్షి శివ్)

అయితే, ఇఁక గురుసాన్నిధ్యమున యేవిధముగా వ్యవహరించినచో, పరమార్థము బోధపడి సాధన కొనసాగగలదో! యిచ్చట నిధానముగా గమనించుడు:– కదలక కూర్చుండుట, శ్రద్ధతో ప్రబోధమును వినుట, విన్నదానిని మరచిపోకుండుట, సంకుచిత

చిత్తులుగాకుండుట, హఠము లేకుండుట, గర్వపడకుండుట, వినయ విధేయతలు కలిగియుండుట, కూర్పట్లు లేకుండుట, పరిహాపడకుండుట, అనవసర ప్రసంగములకు తావీయకుండుటయును బయటి విషయములవైపు మనస్సును పోనీయకుండుటయున్నూ కలిగియుండ జూడవలసియుండును. ఇదిగో:—

పహ్లేబురా కమాయెర్కె ,
బాంధీ బిష్కి పోట్ ;
సకల్ పాప్ పల్మే కటేఁ ,
ఆయె గురూకీ ఓట్.
బురా భలా జో గురు భగత్ ,
కబహూఁ నరక్ నజాయ్.
రబికో తేజ్ ఘటే నహీఁ
జో ఘన్ జుడే ఘుమండ్ ,
సంత్ బచన్ పల్టే నహీఁ
పలట్ జాయ్ బ్రహ్మండ్.
(శ్రీ ఆదీసంత్ కబీర్)

యోగసాధనమనగా:— అనుభూతి నార్జింపజూచుట. యోగమన:— శ్రద్ధయనునది ఏకముఖమునకు రాగలుగుట. మఱి యోగమన:— "యోగిష్ చిత్తవృత్తినిరోధః" చిత్తవృత్తులణగుట , చంచలత్వము తొలంగుట, ఇంద్రియగోచర విషయాకర్షణ నణంచివేయుట,మనస్సనునది బయటికిపోకుండాతనయందే! లయించుట, లేక యొకపనిచేయుటలో మనస్సు ఇతరత్ర జనకుండుటయున్నూ యోగమేయగును. ఈ యోగమునకు మహర్షిపతంజలి:— ఎనమిది

అంగములను ఏర్పఱచియున్నాడు. అయ్యవియే! యమ, నియమ ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి యనునవి. మఱియు, కర్మోపాసన జ్ఞానసాధనములందుగూడా వీటిని, తెలియకుండానే ప్రయోగింపనగుచుండును. పరమార్థము నందేగాక వ్యవహారమునందును వీటిని ప్రయోగింపక కొనసాగనేరవు. కావున, ఇయ్యది ప్రకృతిసిద్ధ నియమమయ్యున్నది. ఇంతకు, ఈ ప్రాణాయామయోగమెటులనః– రేచక (శ్వాసను బైటికినడపుట) పూరకము (శ్వాసను లోనికీడ్చుట) మఱి కుంభకము (శ్వాసనులోన నిలుపుట), ఒకవేళ, ఈవిధానమును చేకొన్నను వత్తడిగా నొనర్ప తగదుసుమా! ఏలయనగాః–గృహస్థులకు అవస్థలు ప్రాప్తించును. యోగులీయోగద్వారముననే! చక్రముల నన్నిటినిగడచి, సహస్రార మున శబ్దయోగము నొనర్చుచుండిరి. అచ్చోట వారికి ప్రకాశము కాంచనగుటయేగాక, శృతియును వినబడుచుండెను. దానివలన సమాధ్యావస్థ నొందుచుండిరి. మఱియు సిద్ధిశక్తి నొంది శూన్యము వరకు మాత్రమే! పోయి, బ్రహ్మతత్వజ్ఞానము నార్జించుచుండిరి. గాని, శ్రీగురుమతముః– భ్రూమధ్యమునుండి ప్రారంభించి చివర వరకు, అనగాః– ధృవపథమను గమ్యస్థానమును చేరనగు సదుపాయమును కలిగియున్నది.

ఇక సురతశబ్దయోగమనగాః– హిందీ భాషయందలి "సురత్" యనుశబ్దార్థము; అభిముఖమగుట యగును. ఈ శబ్ద యోగసాధనమును, శాశ్వతరసామృతమును వ్యక్తమొనర్చుకొను టకై వాడెదరు. కాబట్టి, ఇదియే! నిత్యసత్యజీవిత ప్రకటనమున కాధారభూతము. మఱియిదియే! జగద్రచనకు మూలాధారమయినది యును. ఈశబ్దమే నిజముగా చైతన్యప్రకటన ప్రకాశమునకును,

మఱియు పరమార్థమును స్పష్టపఱచుకొనుటకున్నూ, ఆధారోద్ధ మూలకందము. ఇదియే! కలిగి, కలుగబోవు దానినంతటిని కల చునది ఇదియే! ఆత్మకు, అన్నింటికన్నసమీపస్థయై ఆత్మీకమై యును. ఇదియే . మనశ్శరీర మంతటను పరివ్యాప్తమై ప్రవహిం చుండునదియేగాక; ఇది మనస్సునుండి విడిబడుచో, మనస్సు ఇక మననశక్తియుండదు. అప్పుడది "నిరత్"యనబడును. అనగ కదలికలేనిదగును. ఇట్లనగా:- అత్మతనము మాత్రము మి యుండుననుట. ఇందుచేతనే "నగాయత్రీపరంమంత్రః అన్న ఆర్యులు" కాబట్టి: దీనియొక్క మహిమాప్రభావము, లేక విల ననుసరించియే ! సంత్ , లేక సత్పురుషులు తమ అనుష్ఠాన మున దీనిని సురత్‌శబ్దయోగమన్నారు. అనగా:- శ్రద్ధయను చె లతో చైతన్యశబ్దమును వినుటయగును. వీరలు తమ యాచరణ దీనిని స్మరణ , ధ్యానము, మఱియు భజనయను త్రివిధనామవ లతో ప్రయోగించుకున్నారలు. ఇందులోని స్మరణయనగా: విశ సముతో తలంచుట. ధ్యానమనగా:- ప్రకాశముతో ఐక్యమ జూచుట. ఇంక భజనయనగా:-శబ్దమునువినుచు నందైక్యమగుట ఇందుచే , శబ్దమే యన్నింటికిని శిఖరమైయున్నది.

రూపమున్నంతవరకే ప్రకాశముండియుండుచు. రూపమ లేనితనమునుండి స్వరూప ప్రకటనయగుటయే ! ప్రకాశము తేజ వంతదృశ్యమగుట. రూపములేనప్పుడు శబ్దముమాత్రము ఉండియే నుండును. కావుననే , దీనిశ్రవణవలన రూపములేనితనమేర్పడును. ఈసందర్భమున మహామహుడగు శ్రీ కబీర్‌గారి ప్రవచనము ఇదిగో! అవలోకింపుడు:-

జాప్మరే అజపామరే, అన్హద్భీ మర్జాయ్,
సురత్సమానిశబ్దమే, తాహికాల్నహిఖాయ్.

ఈశబ్దము:_ స్వరూపములేనిదని గినియరాదుసుమా! ఏల యన, ఇయ్యది బహిరంతరములయందునూ కలిగియున్నది. మఱి డియే, అంతర్బహిస్సులకు అతీతమైనదియును. తిరిగి దీనిని చేరియే! గమనాగమనము, లేక జన్మ పరంపరను పోనాడవలసి యుండును ఇంతకుమించిన రూఢి పదముగానమి, దీని సహకార మును గైకొనకతప్పజాలదు కనుకనే! వేదములును, అధ్యాత్మిక పరులందరున్నూ దీనినే వాడకతప్పలేదు. ఇంతకు, శబ్దప్రకటనయే నామమేర్పడుటకు కారణమగును. శబ్దరహితమైనప్పుడిక అనామి యనబడును. తాంబూరయొక్క నాదమువలె యిది ఎల్లప్పుడును సర్వాంతర్యామిగా ధ్వనించుచునేయుండును. ఇంతేగాదు సాధకులు లేక అభ్యాసాపరులు దీనివినుచు విచిత్రపడుచుందురు. ఇది యెడ తెంపులేని సునాదమగుటచేతనే! ఇద్దానికి సురతశబ్దయోగమను నామము ఏర్పడియున్నది.

ఈ సురతశబ్దమును:_ ఆకాశవాణి, దైవవాణి, ఉద్గీథ మనియును పేర్కొందురు. దీనికి స్వరూపములేకున్నను దీనిని విన్న వారు, తమతమ మతధర్మవైఖరిననుసరించి ఇద్దానికి నామరూప ములను కల్పించుకొనిరి. కావున, దీనిని క్రమపద్ధతిప్రకారము అంతరికమున వినగలుగుచో మనస్సేకాగ్రత నొందుటయేగాక ఆనందమున్నూ చేకూరగలదు. ఆత్మోన్నతి నొందుటయు సులభ సాధ్యమవగలదు. మఱియు, జీవితమునందలి భ్రాంతియున్నూ రహితమై అతి రమణీయమూర్పు రాగలదు. అదెటులన, మనో

విశాలతయు, సమరసభావమును, దూరదృష్టియును ప్రపూ
హృదయులునై జన్మలున్నూ తరించగలవు, ఇదిగో:-

శబ్ కీఆదీ శబ్దకో జాణ, సబ్ కాఅంత్ ఉసే పహిచాణ.
శబ్ద్ శబ్ద్ కా సకల్ పసారా, శబ్ద్ శబ్ద్ సబ్ మేఁ నిస్తారా.
శబ్ద్ హీధార్ ఔర్ శబ్ద్ హైసూత్, శబ్ద్ హైసబ్ మేఁ ఓతప్రోత్.
శబ్ద్ హీకారణ్ శబ్ద్ హీ కారజ్, శబ్ద్ శిష్యగురు, శబ్ద్ అచారజ్
అస్ ఖాస్ సబ్ శబ్ద్ ఆధార్, సాన్స్ సాన్స్ మేఁ సబ్ హైతార్.
శబ్ద్ హీ మచ్లీ శబ్ద్ హీ నీర్, శబ్ద్ బఖానేఁ సత్త్ కబీర్.
శబ్ద్ బతావేఁ నానక్ పీర్, శబ్ద లిఖావేఁ తులసీధీర్.
శబ్ద్ గుప్త్ జబ్ రహా అనామ్, శబ్ద్ ప్రగట్ తబ్ ధర్యానామ్.
(శ్రీ రా ధా స్వా మీ)

సురతశబ్దయోగసాధనమే! నిజసాధనమైయుండి యున్న దగుటచే:- ఇందులో కలుగుసమాధియందు మనస్సనకు సత్నామ పథమగు నాదబ్రహ్మచైతము, లేకస్మృతికలుగును. ఈలాటప్పుడు మనస్సనునది మరొకవిధరూపొందుటతో నశించునదగును. గనుక, ఈ యోగసాధనమువలన:-రేచక పూరక కుంభకయుత యోగ సాధనమువలెగాక, గృహస్థులయొక్క శరీర మనః ప్రాణములకు ఆరోగ్యము ప్రాప్తించగలదు. గాని, దీనికి అనుభవజ్ఞాని తోడ్పాటు గైకొనుటమాత్రము ముఖ్యావసరమగును. ఏలయనగా:- విద్యయు దానివెనువెంట అనుష్ఠానపథమున్నూ కలిగియున్న నే! నిజమైనవిద్య లేక జ్ఞానానుభవము గడింపనగును. కాబట్టి:-ఎటులైతే వెలుతురు కలిగియున్న దీపమువలన అంధదీపిక వెలిగింపబడునో! మరెటు లైతే జాగ్రదావస్థయందున్నవాడే నిద్రించియున్నవానిని మేల్కొల్ప

గలుగునో ! అటులేె గురి, లేక గురిని ఆరాధనయే:- రసమువలె అతి చంచలస్వభావముతోగల మనస్సు నిశ్చలమగుటకు సరియైన ఔషధమగును. ఇంతేగాదు, గురుప్రబోధమును శ్రద్ధతోవినుటయే శ్రవణ, లేక రేచకమగును. అద్దానియందే! యుండి విచారణ గావించుకొనుటయే మననము, లేక పూరకమగును. నిశ్చిదాత్మ దగుటయే నిదిధ్యాస, లేక కుంభకమగును. ఇందుచే, వివేకముగల మానవుడు ఈ సురతశబ్దయోగమునే అభ్యసింపవలసియుండును.

ధ్యాన్ ప్రథమ్‌జుగ్, మఖ్ జుగ్ దూజే,
ద్వాపర్ ప్రత్యోషిత్త ప్రభూపూజే;
కలీ కేవల్ ఇక్ నామ్ అధారా,
శ్రుతీ ! స్మృతీ ! సంత్‌మత్‌సారా !
(గోస్వామీ తులసీదాస్)

ఇటులనగా:- (౧) సత్‌యుగమనబడు కృతాయుగములో; ధ్యానముమాత్రమే ! యొనర్పబడు చుండెను. (౨) త్రేతా యుగమున; యజ్ఞముల నొనర్చుట అవసరమయ్యెను. (3) ద్వాపారమునందు; మూర్తిద్వారా ప్రాపంచికప్రభుపూజ యొనర్చ బడియెను. ఈ కలయుగములో నామముయొక్క ఆధారమును మాత్రమే అవలంబింప నగును. ఏదైతే:- శ్రుతి, స్మృతి, మఱియు సంత్‌మతమనబడు "శ్రీ గు రు మ త ము" యొక్క సారామృత స్వరూప మయ్యున్నదియో ! ఇదిగో:-

* * * * *

౧. నామ్ మహానిధీ మంతర్, నామ్‌హీ సేవాపూజా;
జప్ తప్ తీరథ్ నామ్, నామ్‌సమ్ ఔర్‌న దూజా,

* * * * *

౨. సురత్ శబ్ద్ కా పంథ్ , దయాల్ చలాయియా ;
సంత్ సందేశ్ క్రిపాల్ , క్రిపాసే సునాయియా.

* * * * *

3. ఏక్‌రూప్ ధరేహై అనేక్ , ఔర్ అనేక్‌మేఁ సంఝోఏక్ ;
వోః వ్యాపక్ వోః సర్బఅథార్ , దేఖే జాకే మన్‌బివేక్.
( సత్పురుష్ కబీర్ )

ఇందులకు, కామ క్రోధాది అరిషడ్వర్గములకు బదులుగా, శమ! దమాది షట్క సంపత్తి నార్జింపజాలువారు మాత్రమే తగియుందురు. ఎటులయనుచో:- ఎప్పుడైతే ! శబ్దముయందు శ్రద్ధయనునది నిలుచునో, అప్పుడు ఇంద్రియములు అంతర్ముఖమై శమముప్రాప్తించును. ఇంద్రియములు మనస్సునందునిలుచునప్పుడు దమము స్వాధీనమగును. కనుక శ్రద్ధపూర్తియై సమాధానము చేకూరి, తితీక్షయను ధైర్యమలవడి, ఉపరతియను నిర్వృత్తియు సంభవించును. మఱి బంధనము తొలగుటయే మోక్షమనబడును. దీనిని ఆశించువారే ముముక్షువులనబడుదురు. కావున:- కోరికయనునది బంధనమునకు కారణమగుచుండుట సహజమేయని తెలిపి; ఈకోరికల వేరులను తెగవేయుచో:- ఇక సంస్కారములకు, లేక వాసనలకుతావుండక జనన మరణాద్యవస్థలు తప్పిపోగలవని నిరూపించి ; ఎంతటి విద్యావంతులైయున్నను , పారపడకుండానుండుటకై అనుష్ఠానపథమున అనుభవజ్ఞునిగాజేయుటకు ఈ "సురతశబ్దయోగ" అభ్యాసముద్వారా సులభ సాధనోపాయమును జూపెట్టుటవలననే! ఈ మార్గము "శ్రీగురుమతము" అని పేరొందియున్నది. ఈ మతము:- సర్వమతసమ్మేళన స్వరూపమగుటచే ; ఇందులో భేదవాదమునకు తావులేదనియు ; స్త్రీ పురుష వయః

పరిమిత పాటింపులేక, ప్రతివారున్నూ ఉన్నతోన్నతినొందుట కను వైనదే! ఇందలియోగాభ్యాసము అనియున్నూ తెలియవలయును. ఇచ్చట పరమసంత్ శ్రీ నానక్ మహాశయునియొక్క వాక్యామృత చవియును ఆస్వాదించుడు:-

"జైసే జల్మేకమల్ నిరాలం, ముర్గాబీ నిషానియె,
సురత్‌శబ్ద భౌసాగర్‌తరియే, నానక్నామ్‌బఖానియె."

ఇదుగో! శ్రుతిరత్నమనబడు సామవేదమున్నూ, ప్రణవ నాదమగు ఇద్దానిని ఉద్గీథమని నుడివియున్నది. మఱియు, దీనిని అనుభవమునొందినట్టి సురలు అసురులను జయించినారని ఛాందో గ్యోపనిషత్తు ప్రబోధించియున్నది. కాబట్టి, ఈ సురతశబ్దయోగము అమూల్యమైనది. దీనియొక్క సంపూర్ణమైనచరిత్ర; "గాయత్రీ రహస్యము" అనుపేర ఉద్గ్రంథస్వరూపమున ప్రకటింపబడినదని, ఇదివరకే మనవిజేయబడి యున్నదిగదా! ఇంతకు శ్రీగురుమతము అనగా:-సోపానక్రముగా అనుభవమును గడింపజేసి గురీయగమ్యము నందైక్యమవజేయు విధి విధానస్వరూపమేగాని, లోకమున మత మని వ్యవహరింపబడుచున్నట్టి మనోజన్య విధి విధానవైఖరి ననుసరించి రూపొందిన మార్గముకాదు. దీనికిన్ని మతమనుపద మును అంటగట్టుట, పరమార్థికదారి మతముపేర పఱగియుండుట వలననే! చేర్చబడక తప్పలేదని గుర్తెరుంగవలయును. ఇయ్యది ప్రేమ భక్తితోగూడిన సభ్యతను, లేక నీతినిపాటించునట్టి సూత్ర గర్భిత స్వరూమని గ్రహించవలయును ఏలనంటేనో:-

౧. తీరథ్ గయేతో ఏక్‌ఫల్, సంత్‌మిలేఁ ఫల్‌చార్;
సత్‌గురు మిలే అనేక్‌ఫల్, కహేఁ కబీర్ విచార్.

౨. గురూ మిలాతబ్ జానియే, మిటేమోహా తన్‌తాప్;
హర్ష శోఖ్ భ్యాపే నహీఁ, తబ్ గురూ ఆపే ఆప్.
* * * * *
౩. జో గురూపరఖ్ నపావే ఘట్కమేఁ,
మత్ తూజాయ్ అకేలా బట్‌మేఁ.

( మహాత్మా కబీర్ )

* * * * *

ధరీ దేహ మానిష్‌కీ గురూనె జీవ్‌తీప్‌ఁ తేరాకరేఁ కల్యాణ్
సేవా కర్, పూజా కర్ ఉన్‌కీ, ఉన్‌హీకో గురూనానక్ జా

( పరమసంత్ నానక్

ఈమతములో కొన్ని పరిభాషాపదముల నేర్పఱచియున్నార
అయ్యవియే:—౧. సత్సంగి. ౨. సాధు. 3. హంస. ౪. పరమహంస
౫. సంత్. ౬. పరమసంత్‌యనునవి. ఇందులోని:— ౧. సత్సం
యనగా ప్రారంభసాధకుడు, లేక స్మరణ, ధ్యాన, భజనపరుడు
ఈ మూడున్నూ (ముప్పురి) సహస్రారసోపానమువరకు మాత్రమే
౨. సాధుయనగా:— సాధకదశననుసరించి త్రిపుటి, లేక ప్రణ
మనబడుత్రిమూర్తిస్థానియగు ఓంకారమను సురతానుభవిమాత్రమే
3. హంసయనగా:— శూన్యసోపాన సవికల్పసమాధ్యావస్థానంద
నుభవి, లేక ఆత్మసాక్షాత్కార రసానుభవి మాత్రమే! ౪. పరవ
హంసలనగా:— సారాసార పరిజ్ఞానముకలిగి సారమునే గ్రహణ
మొనర్చువారుగనుక, వీరికి కోరికలనునవి యుండవు. ఇట్టివీరు
మహాశూన్యమందలి నిర్వికల్ప సమాధ్యావస్థానందము ననుభవించ
పైదశ కర్హులైయున్నవారు. మఱియు పసిబాలురవలె నుందురు.
ఎటులైతే, సనకసనందన్ సనత్కుమారులో! వీరలు ఋషుల
కాదర్శులేగాక ఫలాపేక్షరహిత కర్మలందు వాసనలు, లేక సంస్కార

ములు పూర్ణముగ దగ్ధమైయుండును. మఱియు వీరలకు జనన మరణాద్యవస్థలుండవు. ౫. సంత్‌యనగా:— సత్‌నామము నొందిన వారు. వీరిని పరిపూర్ణులందురు. ౬. పరమసంత్‌లు యనగా:— అలఖాగమ స్థానములనొందినవారు, లేక సత్పథమునుచేరినవారు.

ఇచ్చట తెలియవలసిన దేమనగా:— ఇందలి సంత్ మఱియు సాధుశబ్దములను శ్రీ కబీరుగారు ఏకరీతిగనే వాడియున్నారనియు. ఈ పరిభాషాశబ్ద, లేక రూఢిపదములను కబీరుగారికి పూర్వపూజ్యులెవరును ప్రయోగించి యుండలేదనియును శ్రీ కబీరుగారినే ! ఆది సంత్ యందురనియున్నూ. ఇట్లనుటచే అంతకు పూర్వులను కించపఱచుటగా భావింపరాదని మనవి. మఱియు:—

ఈ "శ్రీగురుమత" సత్సంగమునందు:— వేదాంత, యోగ, సాంఖ్య, పురాణ, సాంప్రదాయ, శాస్త్ర మొదలగువాటి యన్నింటి యందున్నూ దృష్టియుంచనగును. ఏలయనగా:— మానవ సృష్ట్యాది నుండియు శ్రీగురుమత పునాది ప్రకృతీసిద్ధముగా కలిగియున్న దగుటచే, ప్రతిమానవునియొక్క అర్హతననుసరించి సమయానుకూల వైఖరిని చేగొని మతావసరమును పూరించి, ఆమంత్రణ గావించు, లేక ఆహ్వానించునది యొక శ్రీగురుమతము మాత్రమేనై యున్నది. ఇదిగో చూడండి :—

"Education enlightens the nature
and character of human birth."

ఇట్లనగా:— మానవజన్మ సంసిద్ధమై యున్నట్టి సహజప్రకృతి, మఱియు ప్రవృత్తి ననుసరించి శిక్షణ వడసిననే అనుభవమును గడింపవగును. మఱియు:—

౧. ఎహ బ్రహ్మాండ్‌కీ సూక్ష్మహై రచనా ,
సూక్ష్మసె అప్ స్థూల్ బనా.
౨. కారణ్ బీజ్‌సే అంఖ్వా ఫూటా ,
ఫల్ పత్తా ఔర ఫూల్ బనా.
3. ద్వంద్ భావ్‌కే ఘట్ ఆతేహీ ,
అనుకూల్ ఔర ప్రతికూల్ బనా.
౪. సుఖ్ వాస్నాకీ ఛాయా ఫూటీ ,
రోగ్ సోగ్ దుఖ్ సూల్ బనా.
౫. తీన్ త్రిలోకీ హంనె రచాయీ ,
సో నిజ్ శిరకా భార బనా.
౬. మేరే తేరే పనేకి ఇచ్ఛా ,
జబ్ ప్రగటీ సంస్కార బనా.

* * * * *

జో సాధన్ సంపన్ననహీం , నహీం అనుభౌ సంపన్న ;
బిన్ అనుభౌ సంపన్నతా , నహీం సత్గురూ ప్రసన్న.
సాధన్‌కీ సంపన్నతా , హోయ్ అనుభౌ సంపన్న ;
జో అనుభౌ సంపన్నహై , సో సత్‌గురూ ప్రపన్న.

( మహర్షి శివ్ )

జగత్తునందలి మతములలో "శ్రీగురుమతము" మాత్రమే ఔదార్య సామర్థ్యములతో వ్యవహరించెడి సంస్కృతయంత్రము (Mission) కాబట్టి, ఇయ్యది సంకుచితవృత్తుల కలవిగాని తికమక చర్యలకు లోనగుచుండుట పరిపాటి విషయమగుటచే విచారపడరాదు. ఒకవేళ , ఈ హిందూమతమున ఒడుదుడుకులు

సంభవించెనందురేని:- సముద్రమునందు పోటుపాటు లేతెంచు చుండుట సహజమే యగుగదా ! ఇంతేగాదు, అర్హతకుతగు ధర్మ సూత్ర గర్భితయైన దీనియొక్క పునాదిని:- ప్రత్యేకవిలువైన వజ్ర గులకల (Concrete) తో మహాబురుషులు నిర్మించిరగుటచే దీని భాషయు సంస్కృతమే నయ్యున్నది. ఇందుచే:- అనుభవజ్ఞమైన ఈ మతమును:- ఎవరేని యేనాటికైననూ మఱుగుపఱచజాలరు. చారిత్ర్యకముగా వీక్షింపగలుగువారి కిట్లని సువేద్యమవగలదు.

ఓ జిజ్ఞాసా స్వరూపములారా:- పారమార్థిక సోపానమును పూలసెజ్జగా భావింపరాదు సుమా ! ఏలయనగా, ఇంద్రియసుఖ లోలురకిది అబ్బజాలదే గాక, వేష భాషలతో విఱ్ఱవీగువారి దరి జేరనూజాలదు. ఇందుకు శృంగారాడంబరములను త్యజించవలసి యుండును. మఱియు ఆలుబిడ్డల, భాగ్యభోగములను, శ్రీ సద్గు రార్పణమొనర్చి, నిష్కామ్యమున ఆయా వానితో పనిగొనుచు, ప్రత్యక్షభగవానుడగు గురుసేవాతత్పరులై యుండగలట్టి వారి భార మంతయును యాపరాత్పరుడే వహించునని తెలియవలయును. చూడుడు:- "చరాచరములన్నింటనూ నేను నిండి నిబిడీకృతమై యున్నానను భావమున, జగత్సర్వమును ప్రేమించుచుండువాడే! నా అంతరంగభక్తుడని" శ్రీకృష్ణ పరమాత్మయు నుడివియున్నాడు. మఱియు "మృత్యు సర్వంహరశ్చాహమ్" (భగ, గీ.) "జీవన్ మరణ్ చరణకే చాకర్ ; చింతారహిత్ చిత్తహై నిత్యా" (ఒక భక్తుడు) గనుక:- ఏలాంటి అపాయమైనను, నిజమైన భక్తుని ఋజుమార్గమునుండి మరలింపజాలదు. ఇచ్చోట:- ప్రహ్లాదుడు తనతండ్రి పంపినట్టి, మఱియు మీరాబాయి తన మఱది పంపినట్టి విషమును సంతోషముతో త్రాగివేయుటయు; తత్పరియువపాన

ఫలితమునున్నూ జ్ఞప్తికి తేజూచినచో, సత్యము స్వయముగానే బోధపడగలదు. కాబట్టి భక్తహృదయము:– క్షమ, దయ, ప్రేమో దారములతో నిండియుండును. మఱియు కోపము, ఆశ, వంచన, భయము, గర్వము, నిర్లక్ష్యము, దౌర్జన్యము, స్వార్థములు వీని దరిజేరనూ జాలవు. ఇంతేగాదు:– ప్రేమ, ప్రేమించు, ప్రేమింప బడుటల కతీతమైయుండి; అనన్యభక్తులు పరస్పరము సంభా షించు కొనునప్పుడు గద్గదతనొందుట, అశ్రుపూరితు లగుటయు, మఱియు గగుర్పాటొందుటయును గాంచనగును. ఇందుచే:- అనిత్య పదార్థాశ్రయమే! సమస్త ఇడుమలు, దుఃఖముల నొందుటకు హేతువనియు; దైవమునకు దవ్వునగాని, లేక భిన్నముగ గాని తనను భావించుచుండు వాడెంతటి ఘనుడైననూ; ఇంద్రియము లకు దాసుడుగాక తప్పదనియున్నూ తెలిసికొని జాగ్రతపడవల యును. మఱియు నిత్య సత్య, ఆనందామృత, అనిర్వచనీయ, పరమపావన తేజోరాశి యగు పరంజ్యోతిని:– గురుస్వరూప సహ కార, సేవా తత్పరతల మూలమున వడయుగలట్టివారికే! శాశ్వత శాంతియు అపరిమితానందములును ప్రాప్తించ గలవనియున్నూ గుర్తెరుంగవలయును. ఇదిగో! పరమపురుషోత్తముడగు శ్రీకబీరు మహాశయుని గురుస్వరూప ప్రబోధము నిచ్చోట పరిగ్రహించుడు:-

౧. చార్ దినాకే సంగీ సాథీ – కుల్ కుటుంబ్ పరివారా,
అంతసమయకోయి కామ్‌నఆవే – సబ్ న్యారేకాన్యారా.
౨. మన్మే ధ్యాన్‌హై సత్‌గురూకా – నహివ్యాపే సంసార్,
ఛోడ్ ఆస జగ్‌కి సున్‌భాయీ – గురూసె కర్‌లేప్యార్.
3. మైఁహూఁ తేరే జీవాౘజీవన్ – మైఁహూఁ తేరీసాన్స్,
మైఁతో ఘట్‌మేఁ తేరేబస్తా – తూకాఁవ్ భయా ఉదాస్.

౪. ముఝ్కోదేఖ్ దేఖ్ ఘట్అప్నే – ధర్‌చర్నన్ విశ్వాస్,
ఏక్‌పలక్ బిసూంనహి తుఝ్కో – తెరాకరుంసో పాస్.

౫. మైంహుంజ్ఞాన్, ధ్యాన్‌భి మైంహుం – మైందాసోంకాదాస్,
దాస్ దుఖీతో ముఝేభి దుఖ్ హెూ – కర్డోం దుఖ్ కానాశ్.

౬. మేరా ధామ్ నహీం కాశీమేం – నా గిరి ధర్ కైలాస్,
తేరే ఘట్‌మేం రహూం బిరాజిత్ – కర్లే వహాం తలాష్.

౭. ద్వాదశ్‌చక్ర ఛోడ్ చఢ్ఉంచే – కర్ సత్‌పథ్మే బాస్,
వహీ రూప్ మేరాహై సాధూ – స్వయం జ్ఞాన్ ప్రకాశ్.

*   *   *   *   *

మఱియు, ఇచ్చోట శ్రీ కబీరుగారి అనుభవైక హితోపదేశ మునుగూడా కనుగొందము:–

౧. తీన్‌ఛోడ్ చౌథాపద్ దీన్హా, సత్‌నామ్ సద్గురుగత్ ఛీన్హా.

౨. ఎహ కర్నీకా భేద్‌హై, నాహీం బుద్ధీ బిచార్;
కథనీ ఛోడ్ కర్నీకరో! తబ్ పావ్‌కుఛ్ సార్.

ప్రపంచమునందలి వస్తుసర్వము అశాశ్వత, లేక మార్పునొందునదగుటచే వాటిపై ఆధార పడియుండుట మాత్రముతో జీవితమును గడపునరుడు; జననమరణాద్యవస్థలకు లోనై దుఃఖికావలసినది సహజమగుటచేతను:–జగత్తునకు కారణుడైన వాడిందులో తనవలె; సర్వశక్తిగర్భిత సృష్టికి చివరవ్యక్తిగా మనుష్యుని సృజియించి తనయొక్క నిర్మల వైభవమును ప్రకటించి యుండుట వలనను:-అన్నిజీవులలో, నిత్యానిత్య వస్తువివేకముగల జీవియగు మానవుడెరుంగగలుగుటయేగాక; వానిని చేరుటయే! తనయొక్క విధ్యుక్త కర్తవ్యమునియున్నూ తెలియవలసియుండును. కాబట్టి

ముఖ్యముగ సాధకులగువారు, జ్ఞప్తియందుంచుకొని ప్రవర్తింప వలసిన విషయములను ఇచ్చోట గాంచెదము.

గురుః:- సంస్కృతధాతువగు "గ్రీ" నుండి వెడలినది. గ్రీయనగా:-శబ్దించుట, పలుకుటయు, ప్రబోధించుటయునగును. శబ్దమే! చైతన్యప్రకటన, లేక ప్రత్యక్షమగుటకు ప్రధానకారణము. కనుక, పరమార్థప్రబోధముతో గూడియుండి, అనుభవమును గడింప దగు శిక్షణ గఱపగల సమర్థుడే! నిజమైనగురుడు. ఇట్టిమహానుభావుడు స్వరూపధారి ఈశ్వరుడేయగును. ఎచ్చట పరితపనకలిగి యుండునో స్వయముగా నచ్చట ప్రత్యక్షమై అవసరములను పూరించును. కాబట్టి, ఇట్టివారియొక్క కరుణారసము సర్వత్ర వెల్లువలై పారుచుండును. అయినను, అద్దానిఁ జూఱగొనదలంపును కలిగియున్న వారందులకు అర్హతను సంపాదించ వలసినది మాత్రము అత్యవసరమగును. ఇఁక శిష్యః:-సంస్కృతధాతువగు "శాస్" నుండి వెడలినది. శాస్ అనగా:-ఆజ్ఞాపనమగును. ఎవడైతే! గురుమూర్తియొక్క శాసనమునకు లోబడి అనువర్తించుచుండి, పరమార్థానుభవ మునకై వానియొక్క స్వరూపమునందు తన యొక్కశ్రద్ధను, లేక దృక్పథమును అతికించుకొనుటకుగాను ఒడంబడియుండునో; వాడే! నిజముగా శిష్యపదవాచ్యమునకర్హుడు. ఇట్టివారలు:-గురువునే! తనయొక్క సర్వస్వమనిభావించి వినయ విధేయులై, వారి ప్రబోధమును సదా ఏకాగ్రశ్రద్ధతో వినుచుండి తథానుష్ఠానపరులై యుందురు. కాబట్టి, ఇదుగో:-

౧. నహీఁ మై జాంతాథ కోన్ హూఁ
ఔర్ కెఁవ్ యహాఁ ఆయా

పడాకైఁవ్ కాల్‌కీ ఫాంసీమేఁ
కైఁవ్ మాయానె భర్‌మాయా.

౨. కిసీసే కామ్ జబ్ మేరా
నహి నిక్లాతో ఘబ్రాయా,
గురూకీ శరణ్‌లీ తబ్
సద్గురూనే ముఝ్కో సంఝాయా.

3. నహీఁ మాయా అలగ్ తుఝ్సె
యహ్ బుద్ధి తేరీహై మాయా,
సమయ్‌హై కాల్ మాయావశ్
సమయ్‌సే ఆప్ ఘబ్రాయా.

౪. సురత్‌కో సాధ్ ఘట్‌మేఁ
శబ్ద్‌కే సాధన్‌కో నిశ్చాయా,
తభీ సంఝోగ తూ చైతన్
హై చేతన్ చైతనా భాయా.

* * * * *

తేరీ శరణాగత్ హువా, ఫిర్ కిస్కో రాఖోఁ ఆస్;
ఆస్‌తో తేరీ దయాకీ, జగ్‌సే రహూఁ ఉదాస్.
శీష్‌పర్ నిజ్‌కరకమల్, ధర్లియా చరణ్‌లగాయ్;
పతిత్ పాపీ తర్‌గయా, గురూ శరణ్ తేరీ ఆయ్.

* * * * *

౧. దయానిధి దీన్‌దుఖ్ భంజన్,
క్రిపామయ్ నాథ్ జనరంజన్.

౨. చరణ్‌కీ ఓట్‌మేఁ లీజే,
ముఝే భక్తిక ధన్ దీజే.

3. తుమ్హారా నామ్ లేతాహూం ,
చరణ్‌మేం చిత్‌కొ దేతాహూం.

౪. తుమ్హారా ఇక్ సహారా హై ,
నహీం కోయీ హమారా హై ,

౫. చరణ్ మైఛోడ్ కహం జాపూం ,
సదామన్ బుద్ధిసే ధ్యావూం.

౬. యహీ బినతీ హమారీ హై ,
తుమ్హీంసే ఆస్ భారీ హై.

ప్రతి జీవితముననూ మూడుసోపానములు కలిగియున్నవి. అందొకటి:—అస్తిత్వము, రెండవది:—పరికరము , మూడవది:—పని జరుగుస్థానము. వీటినిబట్టియే:— విద్య , ధర్మము , మఱియు మతమునందున్నూ మూడుదశలే కానవగుచున్నయవి. ఈ మూటిని క్రమబద్ధముగా గడపగలుగుచో నాలుగవదశయు లభించగలదు. మఱియు బైటివిద్య మూటివరకే నిలిచిపోవునని తెలిసికొని , అను ష్ఠానపథమున నాలుగవదశ నార్జింపవలసియుండును. ఈ వైఖరిని అనుసరించియే ! మనపూర్వులు , విధి విధానములను నిర్మించి యున్నటుల బోధపడుచున్నది. ఇంతేగాదు , శ్రీగురుమత సిద్ధాంత మున సూచించునట్టి నాల్గవపథము , వీటన్నింటికినిపైన అనుభవ మున పొందబడునదని జ్ఞప్తియందుంచవలయును. ఇట్లని:— అను ష్ఠానప్రదుని పరిశోధనాదృష్టికి బోధపడునేగాని. శబ్దజంజాటమునకు లోనై ఆలాపించుచో మతోద్దేశమే మడియగలదు. కాబట్టి:— జీవ ' దేవ, మఱియు ఆత్మికదృష్టితో బొందుపఱచబడియున్నట్టి గమనీక అదుగో ! నిధానముగా పరికింపవలయును.

| సంఖ్య | నామములు | మూడు సోపానములు | నాలుగవ దశ |
|---|---|---|---|
| ౧. | వర్ణ విభాగము. | శూద్ర, వైశ్య, క్షత్రియ, | బ్రాహ్మణ. |
| ౨. | ఆశ్రమ విభాగము. | బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, | సన్యాసము. |
| ౩. | అవస్థా విభాగము. | జాగ్రత్, స్వప్న, సుషుప్తి, | తురీయము. |
| ౪. | విచార విభాగము. | శ్రవణ, మనన, నిదిధ్యాస, | సాక్షాత్కారము. |
| ౫. | జ్ఞాన విభాగము. | విజ్ఞాన, అనుమాన, ప్రమాణము, | సార్శబ్దము. |
| ౬. | యుగ విభాగము. | కలి, ద్వాపార, త్రేతా, | సత్యుగము. |
| ౭. | పంథ్ విభాగము. | కర్మ, ఉపాసన, విజ్ఞానము, | జ్ఞానము. |
| ౮. | దైవ విభాగము. | శివ, విష్ణు, బ్రహ్మ, | బ్రహ్మము. |
| ౯. | బ్రహ్మ విభాగము. | విరాట్, అవ్యాకృత్, హిరణ్యగర్భ, | పరబ్రహ్మము. |
| ౧౦. | సృష్టి విభాగము. | జడ, జీవ, ఈశ్వర, | చైతన్యమాత్రము. |
| ౧౧. | వేద విభాగము. | అథర్వ, యజు, ఋగ్, | సామము. |
| ౧౨. | రచన విభాగము. | సృష్టి, స్థితి, ప్రళయము, | ఆత్మపథము. |
| ౧౩. | గుణ విభాగము. | తమః, రజః, సత్వః, | ప్రధానము. |
| ౧౪. | మనో విభాగము. | మనః, చిత్త, అహంకారము, | బుద్ధి. |
| ౧౫. | యోని విభాగము. | ఉద్భిజః, స్వేతజః, అండజః, | జరాయుజః. |
| ౧౬. | లోక విభాగము. | పాతాళ, మర్త్య, స్వర్గము, | సత్యలోకము. |
| ౧౭. | ముక్తి విభాగము. | సాలోక్య, సామీప్య, సారూప్యము, | సాయుజ్యము. |

ఈ కలియుగమున అవతరించినట్టి:- ఆది సంత్ శ్రీ కబీరు మహానుభావునియొక్క అనుభవైక సందేశమును కనుంగొనుడు:-

# ఆధ్యాత్మిక స్థానానుభవ విశదీకరణము

-: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :-

౧. కామ్ క్రోధ్ మద్ లోభ్ బిసారో,
షీల్ సంతోష్ ఛమాచిత్ ధారో;
మద్ధ మాంస్ మిథ్యా తజ్ డారో,
హెూ జ్ఞాన్ ఘోడే అసవార్ భరమ్సే న్యారాహై
-: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :-

౨. ధోతీ నేతీ బస్తీ పావో,
ఆసన్ పద్మ్ జుగత్ సే లావో;
కుంభక్ కర్ రేచక్ చిత్ లావో,
పహ్లే మూల్ సుధార్ కాజ్ ఫిర్ సారా హై.
-: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :-

3. గుదా కమల్ దల్ చతుర్ బఖానో,
క్లింగ్ జాప్ లాల్ రంగ్ మానో;
దేవ్ గణేశ్ తహాఁ రూపా థానో,
రిద్ధి సిద్ధి చఁవర్ ఢులారా హై.
-: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :-

౪. ఇంద్రి చక్రి ఖట్ దల్ విస్తారో,
బ్రహ్మ సావిత్రి రూప్ నిహారో;
ఉలట్ నాగ్నికా సిర్ మారో,
తహాఁ శబ్ద్ ఓంకారా హై.

-: కర్ నయనోం దీదార్ మహల్ మేం ప్యారా హై :-

౫. నాభీ అష్ట కమల్ దల్ సాజా ,
సేత్ సింఘాసన్ విష్ణు బిరాజా ;
హ్రింగ్ జాప్ తాసో ముఖ్ గాజా ,
లఛ్మీ శివ్ అధారా హై.

-: కర్ నయనోం దీదార్ మహల్ మేం ప్యారా హై :-

౬. ద్వాదశ్ కమల్ హ్రిదేకే మాయీం ,
గౌరీ శివ్ జహాం ధ్యాన్ లగాయీం ;
సోహంగ్ శబ్ద్ తహాం ధున్ ఛాయీం ,
గణ్‌కరేం జై జై కారా హై.

-: కర్ నయనోం దీదార్ మహల్ మేం ప్యారా హై :-

౭. దోదల్ కమల్ కంఠ్‌కే మాహీం ,
తేహీ మధ్‌బసే అవిద్యా మాఈ ;
హరిహర్ బ్రహ్మ చంవర్ ఢులాఈ ,
జహాం ష్టంగ్ నామ్ ఉచ్చారా హై.

-: కర్ నయనోం దీదార్ మహల్ మేం ప్యారా హై :-

౮. తాపర్ కంజ్ కమల్ హై భాయీ ,
బగ్లా భంవ్‌రా దోరూప్ లఖాయీ ;
నిజ్‌మన్ కరత్ తహాం ఠకురాయీ ,
సో నయనన్ పిఛ్వారా హై.

-: కర్ నయనోం దీదార్ మహల్ మేం ప్యారా హై :-

౯. కమ్లన్ భేద్ కియా నిర్‌వారా ,
యహీ సబ్ రచ్నా పిండ్ మంఝారా ;

సత్‌సంగ్ కర్ సత్‌గురు సిర్‌ధారా,
వహ్ సత్‌నామ్ ఉచ్చారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౦. ఆంఖ్ నాక్ ముః బంద్ కరావో,
అనహద్ ఝింగా శబ్ద్ సునావో;
దోనో తిల్ ఇక్‌తార్ మిలావో
తబ్ దేఖో గుల్జారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౧. చంద్ సూర్ ఏకే ఘర్ లావో,
సుఖ్మన్ సేతీ ధ్యాన్ లగావో;
తిర్‌బేనీ కే సింధ్ సమావో,
భఁహర్ ఉతర్ చల్ పారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౨. ఘంటా శంఖ్ సునో ధున్ దోయీ,
సహస్ కమల్‌దల్ జగ్‌మగ్ హెూయీ;
తామధ్ కర్తా నిర్‌ఖో సోయీ,
బంక్‌నాల్ ధఁస్ పారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౩. డాకిన్ సాకిన్ బహు కిల్కారే,
జమ్‌కింకర్ ధరమ్‌దూత్ హకారే;
సత్తనామ్ సున్ భాగే సారే,
సత్‌గురు నామ్ ఉచ్చారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౪. గగన్‌మండల్ బిచ్ ఉరధ్‌ముఖ్ కోయ్యా,
గురుముఖ్ సాధూ భర్‌భర్ పియ్యా;
నిగురే ప్యాస్ మరే క్యా కియ్యా,
జాకే హియే అంధ్యారా హై.
—: కర్ నయనోం దీదార్ మహల్‌మేం ప్యారా హై :—
౧౫. త్రికుటీ మహల్‌మేం విద్యా సారా,
ఘన్‌ఘన్ గర్జేం బజేం నగారా;
లాఖ్ బరన్ సూరజ్ ఉజ్యారా,
చతుర్ కమల్ ఓంకారా హై.
—: కర్ నయనోం దీదార్ మహల్‌మేం ప్యారా హై :—
౧౬. సాధ్ సోయీజిన్ ఏహగఢ్ లీన్హా,
నౌ దర్‌వాజే పర్‌గట్ ఛీన్హా;
దస్వాం ఖోల్‌జాయ్ చిత్ దీన్హా,
జహాం ఖుఫల్ రహ మారా హై.
—: కర్ నయనోం దీదార్ మహల్‌మేం ప్యారా హై :—
౧౭. ఆగే సత్ సున్న్ హై భాఈ,
మాన్ సరోవర్ పైఠో ధాఈ;
హంసన్ మిల్ హంసాహోయ్ జాఈ,
మిలే జో అమీ అహారా హై.
—: కర్ నయనోం దీదార్ మహల్‌మేం ప్యారా హై :—
౧౮. కింగిరీ సారంగ్ బజే సితారా,
అచ్ఛర్ బ్రహ్మ సున్న్ దర్‌బారా;
ద్వాదశ్ భానూ హంస్ ఉజ్యారా,
ఖట్ దల్ కమల్ రరంకారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౧౯. మహా సున్న్ సింధ్ బిష్మి ఘాటీ ,
బిన్ సత్‌గురు పావేనహిఁ బాటీ ;
బ్యాఘ్ర సింఘ సర్ప్ బహుకాటీ ,
సహజ్ అచింత్ పసారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౨౦. అష్టదల్ కమల్‌పార్ బహ్మ భాఈ ,
దహ్నే ద్వాదశ్ అచింత్ రహాఈ ;
బాయేఁ దసేదల్ సహజ్ సమాఈ ,
యుఁ కమలన్ నిర్వారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౨౧. పాంచ్ బ్రహ్మ పాంచోఁఅండ్ బీనో ,
పాంచ్ బ్రహ్మ నిహఅచ్ఛర్ చీన్హో ;
చార్ మొఖామ్ గుప్త తహఁ కీనో ,
మధ్య బిందీదాన్ దర్బారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౨. దో పర్బత్‌కే సంధి నిహారో ,
భఁహర్ గుఫా తే సంత్ పుకారో ;
హంసా కర్తే కేల్ అపారో ,
తహఁ గురువన్ దర్బారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

౨3. సహస్ అఠాసీ దీప్ రచాయే ,
హీరే పన్నే మహల్ జడాయే ;

## సాధన సంపత్తి

మురలీ బజత్ అఖండ్ సదాయే ,
సోహంగ్ ధున్ ఝుంకారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౪. సోహంగ్ హద్దు తజీ జబ్ భాఈ ,
సత్త లోక్ మేఁ పునిచల్ ఆఈ ;
ఉరత్ సోహంగ్ మహా అధికాఈ ,
జాకా వార్ నపారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౫ ఖోడస్ భాను హంస్ కే రూపా ,
బీనా సత్ ధున్ బజే పునీతా ;
హంసాకరత్ చఁవర్ సిర్ భూపా,
సత్త పురుష్ దర్బారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౬. కోటిన్ భాను ఉదయ్ జబ్ హెూఈ ,
ఏ తేహీ పున్ చంద్ర ఖిలోఈ ;
పురుష్ రోమ్ సమ్ ఏక్ న హెూఈ ,
అయిసా పురుష్ దీదారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౭. ఆగే అలఖ్ లోక్ హై భాఈ ,
అలఖ్ పురుష్ కీ తహఁ ఠకురాఈ ;
అర్బన్ సూర్ రోమ్ సమ్ నాఈ ,
అయిసా అలఖ్ నిహారా హై.

—: కర్ నయనోఁ దీదార్ మహల్ మేఁ ప్యారా హై :—

౨౮. తాపర్ అగమ్ మహల్ ఇక్‌సాజా ,
అగమ్ పురుష్ తాహీకో రాజా ;
ఖర్బస్ సూర్ రోమ్ ఇక్ లాజా ,
అయిసా అగమ్ అపారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—
౨౯. తాపర్ అకహ్ లోక్‌హై భాఈ ,
పురుష్ అనామీ తహాఁ రహాఈ ;
జో పహుంచే జానేఁగే వాహీ ,
కహన్ సునన్‌సే న్యారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—
౩౦. కాయా భేద్ కియా నిర్వారా ,
యహ్ సబ్ రచనా పిండ్ మంఝారా ;
మాయా అవగత్ జాల్ పసారా ,
సో కారీగర భారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—
౩౧. ఆది మాయ కీనీ చతురాఈ ,
ఝూటీ బాజీ సాంచ్ దిఖాఈ ;
అవగత్ రచన్ రచీ పిండ్ మాహీఁ ,
తాకా ప్రతిబింబ్ డాగా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—
౩౨. శబ్ద్ బిహంగమ్ చాల్ హమారీ ,
కహకబీర్ సత్‌గురు దఇ తారీ ;
ఖులే కపాట్ శబ్ద్ ఝుంకారీ ,
పిండండ్ పార్‌దేస్ హమారా హై.
—: కర్ నయనోఁ దీదార్ మహల్‌మేఁ ప్యారా హై :—

సంత్ మతోపదేశమును గావించుటయేగాక, తమ శిష్యుల ద్వారా ప్రచారమును గావించు చుండునట్టి గురుపీఠ నామము లనుగూడా తిలకింపుడు:—

## శ్రీగురుమత పీఠికా స్థానములు

౧. కబీర్ పంథ్. (ఆదీ సంత్‌మత్) ౨. నానక్ పంథ్. 3. ఉదాసీ పంథ్ (శ్రీ చంద్ గారిది) ౪. దాదూ పంథ్. ౫. వైష్ణవీ పంథ్ (జంభ్‌ఋషి గారిది) ౬. సాధ్, లేక సత్‌నామీ పంథ్. (బీర్‌ఖాన్ గారిది) ౭. సత్‌నామీ పంథ్ (జగ్‌జీవన్ గారిది) ౮. గులాబ్‌దాసీ పంథ్. ౯. గరీబ్‌దాసీ పంథ్. ౧౦. పాంఫ్‌దాసీ పంథ్. ౧౧. చరణ్‌దాసీ పంథ్. ౧౨. దర్యా పంథ్. (బిహార్) ౧3. దరియా పంథ్ (రాజ్‌పూతానా) ౧౪. యారీ పంథ్ (దెహిలీ) ౧౫. ఘీసా పంథ్ (దెహిలీ) ౧౬. నిర్మలా పంథ్ (గురూ గోవింద్ సింఘ్ గారిది) ౧౭. సత్‌నామీ పంథ్ (తుల్‌సీసాహెబ్ హాథ్రస్) ౧౮. రాధాస్వామీ పంథ్ (రాయ్ సాలగ్రామ్ గారిది) ౧౯, నామ్‌దేవీ పంథ్. ౨౦. పీపా పంథ్. ౨౧. రోయిదాసీ పంథ్. ౨౨. ధన్నా పంథ్. ౨3. సేనా పంథ్ ౨౪. దూల్మీ పంథ్. ౨౫. బుల్లా పంథ్. ౨౬. గులాల్ పంథ్. ౨౭ నిరంజనీ పంథ్. ౨౮ దర్వేషీ పంథ్. ౨౯. నారీనీ పంథ్. (శివ్‌నారాయణ్ గారిది) 3౦. బింద్రాబనీ పంథ్. 3౧. గణేశ్ పంథ్. 3౨. జాగో పంథ్. 33. సురత్ పంథ్. 3౪. మూల్‌నిరంజన్ పంథ్. 3౫. టిక్సారీ పంథ్ (ఒడైసా) 3౬. భగవాన్ పంథ్. 3౭. కమాల్ పంథ్. 3౮. కమాలీ పంథ్. 3౯. రామ్‌కబీర్ పంథ్. ౪౦. ప్రేమ్ పంథ్. ౪౧. జీవా పంథ్. ౪౨ దేవీ పంథ్. (మురాధాబాదీ) ఇయ్యవియేగాక, అసంఖ్యాక శాఖోప శాఖలున్నూ మన ఆర్యావర్తమునందు వెలసియున్నవని

తెలియవలయును. సంత్ అనగా; సం:– ఆది, చక్కని. త్:– అమృతము, లేక పవిత్రము. పంథ్ అనగా:– మార్గము, లేక మతము.

## మంగళము

మంగళం గురుశబ్దరూప్ అనాంసామ్ ప్రకాశనమ్,
మంగళం శబ్దార్థ శబ్దాధార్ శబ్ద్ నివాసనమ్.

* * * * * * * *

మంగళం గురుదేవాయా, మహనీయ గుణాత్మనే ;
సర్వలోకశరణ్యాయా, సాధురూపాయ మంగళమ్.

## ఉత్తర శాంతి పాఠము

ఓమ్. సహనావ వతు, సహనౌ భునక్తు, సహ వీర్యం
కరవావహై, తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై.
ఓం. శాంతి శ్శాంతి శ్శాంతిః.

తా. శ్రీ సద్గురు వరేణ్యుడు:– అవినాభావ సంబంధ గురు శిష్యులగు మమ్మిద్దరిని ; సంరక్షించునుగాక. మమ్ముల నిద్దరిని ; పరిపాలించునుగాక. మేమిద్దరమున్నూ:– జ్ఞాన సంబంధమైనట్టి సామర్థ్యమును కలిగియుందుముగాక. మఱియు మాచే అర్జింప బడినట్టి సత్‌విద్య, తేజో ప్రకాశవంతమై యుండియుండునుగాక. ప్రమాద కృతాపరాధములచే, మాలోమాకు ద్వేషమున్నూ కలుగ కుండునుగాక. మాకు కలిగియున్నట్టి:- అధ్యాత్మిక ; అధి దైవిక. అధి భౌతిక తాపములున్నూ శాంతించునుగాక. " తథాస్తు. "

* * * * * * * * * *

భారతీయ తెలంగాణప్రాంత భువనగిరి నివాసియగు
తం. ధర్మాచార్య విరచిత శ్రీగురుమతమను గ్రంథములో
ప్రథమ భాగము సమాప్తము.

# విజ్ఞాపనము

శ్రీ సద్గురు గ్రంథమాలలోని పుష్పముల వివరణము

౧. శ్రీగురుమత ప్రథమభాగ ప్రకరణములు:- (౧) మతచరిత్ర. (౨) మత వైఖరులు.(3) సామాజిక గురుమతములు (౪) జగద్రచన. (౫) సప్త లోకములు. (౬) మానవ పరిస్థితి. (౭) సాధన సంపత్తి. ద్వితీయభాగ ప్రకరణములు:-(౮) గురువు అవసరము. (౯) గురు శిష్య ప్రభావము. (౧౦) శ్రీగురుమత సారాంశము. (౧౧) శ్రీగురు మహాత్మ్యము, (౧౨) ఓ మానవ జీవమా !

౨. నిత్య ప్రార్థనా విధానము:— (౧) భగవన్నామ మహిమ. (౨) ప్రార్థన విజయసూచనలు. (3) నిత్య ప్రార్థనా విధానము. (౪) ఆర్యోక్తులున్నూ గలవు.

3. నిత్య పూజావిధానము:— పూజావిధానము, మఱియు అఱువది నిబంధనావళి యున్నూ గలవు.

౪. హిందూమతము:—ఇందలి అధ్యాయములలో; (౧) హిందూ మతము. (౨) హిందూమత సారాంశము. (3) ప్రకృతి, పురుష, జన్మ. (౪) బ్రహ్మము. (౫) మతము. (౬) ప్రతీకోపాసనము. (౭) ఉపసంహారము అనునవి గలవు.

౫. గాయత్రీ రహస్యము:— ఇందులోగలట్టి ప్రపాఠములలో ; (౧) గాయత్రీమంత్ర ముఖము (౨) గాయత్రీమంత్ర ముఖాభివర్ణ నము.(3) ఉపనిషత్తులలో గాయత్రీమహిమ.(౪) స్మృతులయందు గాయత్రీమహిమ. (౫) పురాణములయందు గాయత్రీ మహిమ. (౬) గాయత్రీ మనన మహావాక్యములు. (౭) గాయత్ర్యోపాసనా మహిమ. (౮) సురతశబ్ద యోగము. (౯) సాధక మానవా !

ఇట్లు విన్నవించు విధేయుడు

**తం. ధర్మాచార్య**

భువనగిరి (నల్లగొండ జిల్లా)